బెర్నార్డుషా అస్తమయము. అయోట్ సెంట్ లారెన్సులో, షా ఇంట్లో గది. గాంధీ, బుద్ధుడు, స్టాలిన్‌ల విగ్రహాలూ, చిత్రాలూ, షా గదిలో ఉన్నాయి.

గోల్డర్సుగ్రీన్ క్రిమిటోరియంకు చేరుతున్న బెర్నార్డుషా శవపేటిక

# భారతి ఇరువదియేడవ సంపుటము, భా-౨

---

## అకారాది విషయ సూచిక



భారతి, జూలై '50

దారుశిల్పంలో స్త్రీమూర్తి

[లేపాక్షి పరిసరంలోని ఒక జీర్ణ దేవాలయంలో మగ్గిపోవుచున్న ఒక



విక్రృతి సం.
అధికఆషాఢము

# భారతి

సంపుటము 27
సంచిక 7

# అప్పగింత

శ్రీ పి. గణపతిశాస్త్రి

అత్తకు మామకుం దనుజ నప్పనసేసెడివేళ హూని డ
గ్గుత్తిక మెల్ల సాచి, తనకుం గల భాగ్యము సర్వముం బరా
యత్తము సేయులీఁ దనయాకరహల్లక మల్ల వారికేల్
గుత్తుల హత్తి, నన్నని మొలుంగున నివ్విధి నెమ్మితో ననెన్.

"ఇది పువునజ్జ యించుక వహించిన నూర్చు శిరీషమూర్తి, నె
మ్మది నెదియేని కోర్కెఁ బెరిమమ్మున వేడిన తల్లికైన జె
ప్పదు; చెలికత్తె లెంత బలవంతము సేసిన నాటలాడనే
గదు; చిననాటినుండియు నొకానొకవైఖరి వచ్చె దీనికిన్.

ఎన్నఁడుగాని, తాను మము నిర్వుర వీడి, నిమేష మొంటిమై
నున్నది లేదు; బాలిక ముహూర్తము కన్పడకున్నఁ దల్లియుం
దెన్నులు సూచు; దీని నొకతెం గడుఁ బ్రేముడిఁ బెంచె నింక మీ
కన్నను దీని కెవ్వరొక కంట దయం గనిపెట్టి చూడుఁడీ!

దీని యుదంత మింత యొకతీరున మీరు నెరింగియుండ ర
ద్దాని సమగ్రతం దెలిపెదం గృపసేసి వినుండు! మేనకా
జానిసఖుండు విశ్వవసుసంజ్ఞుడు నిర్జరు డీమెతండ్రి; య
ప్సానిని శేరి, నానతి యుపత్యత దీనిని బెంతు నిమ్మనెన్.

మొదట, విముక్తసంగుల కపూర్వము బంధ మిదేల ! బాలికా
హృదయము కోమల మ్మిది యొకించుకయుం దన తల్లిదండ్రులన్
వదలిన దాది బెంగగొనవచ్చును వద్దనియంటిగాని, యిం
టిది పసిదానికోన మొకటేగతి నేచె నగద్గనమ్ముగన్.

పాపము ! సంతు లేని దొకపాపకునై యిట గాళ్ల వ్రేళ్ళనే
దో ! పలుమారు నన్నడుగుచున్నది లెమ్మని, దాని కేమిలే
వే ! పసిదానిఁ బెంచుకొనవే ! యః పల్కుతి ; నంత. నింత మో
మై పరవల్లు ద్రొక్కు హృదయమ్మున నెత్తుకొనెం గుమారికన్.

మేనయు, విశ్వవసుండు న-నూనాత్మజపుత్రికానముల్లాసితు; ల
ద్దాన వెనువెంటఁ దమ చెలి-దీనిం బెంచుకొన సమ్మతించిరి కృపతో.

అనునిమిషమ్ము నాత్మతనయాధికవత్సలవృత్తిఁ బెంచె; దీ
నిని గనురెప్పనై నిమిషనిద్ర నెరుంగని తల్లి; బాలనై
నను దన తల్లితండ్రు లను నమ్మిక మమ్ముల నల్లె పిల్చుచుం
డును; మొఁన మొన్నదాక నెపుడున్ వినలే దిది యాత్మవృత్తమే.

తవ బహుపూర్వపుణ్యఫలితమ్మునఁ జేసి, రురుం గుమారకా
గ్రణి హృదయేశుగా నిరువురన్ మిముఁ బూజ్యుల నత్తమామలం
గనుగవ నాత్మదైవతయుగమ్ముగ నెమ్మి భజింపగాగ నెం
దనయ తదీయజన్మ మిక ధన్య మటం చెదలోఁ దలంచెదన్"

అని వచియించి మానిహృదయమ్మున నోడిక గట్టు బాష్పముల్
కనుగొనలం దొకింత కణికాకృతి దాల్చు నటన్న శంక, నిం
కన నొక మాట రాక, తనయుం గనుగొంచు మరుద్విశీర్ణని
స్తనితనవాంబువాహమువిధాన గరంగు గతిం గనంబడెన్.

—'ప్రమద్వర' నుండి.

# అప్పకవీయము: క్రొత్తతాళపత్ర ప్రతి

శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

ఆంధ్రశబ్దచింతామణికి విపులమైన తెలుగుసేత యనదగిన అప్పకవీయమును శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారిచేతను, మరియొకరిచేతను బరిష్కరింపజేసి శ్రీ వావిళ్ళవారు ౧౯౩౮ లో సరిక్రొత్త కూర్పును బ్రకటించినారు. ఇటీవల మేము కొవ్వూరులో నున్నతరి నొకరిల్ల దగ్గరిమిత్రులైన శ్రీ పుచ్చా సుబ్రహ్మణ్యశాస్త్రిగారివద్ద నొక యప్పకవీయతాళపత్రప్రతి యున్నదని విని వారి నడిగి దాని గ్రహించితిమి. ఈ తాళపత్రప్రతిని, శ్రీ వేదుల రామశాస్త్రిగారు మొన్న మొన్న రచించి ప్రకటించిన అప్పకవీయవివరణము (యతిప్రాసప్రకరణము) పరప నిడుకొని వావిళ్లవారి ప్రతితో బోల్చిచూచితిమి. మంచిమంచి పాఠాంతరములు లభించినవి. ఇట్టి తాళపత్రప్రతిని సంపాదించిన శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి కృతజ్ఞులము.

ఈ తాళపత్రప్రతియందు ప్రథమ, ద్వితీయ, తృతీయ, పంచమాశ్వాసము లున్నవి; చతుర్థాశ్వాసము లేదు.

దీని తృతీయాశ్వాసాంతమున "విశ్వావసునామ సంవత్సర వైశాఖబహుళ ౧౩ గురువారమునాడు గుంటుపల్లి పాపయ్యగారి ప్రతిలో వున్న వళిప్రాసపరిచ్ఛేదంబు గుంటుపల్లి వేంకట్రాయణింగారికి గుంటుపల్లి లక్ష్మయ్య వ్రాసియిచ్చినది" అని యున్నది.

పంచమాశ్వాసాంతమున "విశ్వావసునామసంవత్సర వైశాఖబహుళ ౧౮ అంగారకవారంరోజ్న గుంటుపల్లి వేంకటరాయణింగారికి గుంటుపల్లి లక్ష్మయ్య వ్రాసియిచ్చిన సంధిపరిచ్ఛేదము సంపూర్ణముగా వ్రాశాను" అని యున్నది.

తృతీయాశ్వాసాంత్యమందని వ్రాసినదానిలో 'వైశాఖబహుళ ౧౪ గురువారము' (మూడంకె వెల్లకిల బడినని యెంచి బహుళ ౧౩ అని వ్రాసినాము) అని యున్నది. త్రగొందళిగా నూహించిన మా యూహ నిజమైనదని చెప్పజాలము. ౧౯౦౫ జూన్ ౧ వ తేదీ విశ్వావసునామసంవత్సర వైశాఖబహుళ ౧౩ గురువారమైనది. దీనింబట్టి చూచిన మాయూహ సరియైనదనియే తోఁచెను. కాని పంచమాశ్వాసాంత్యమందలిదని వ్రాసినదానిలో గల వైశాఖబహుళ ౧౮ "అంగారక" వారమని యున్నది. ఇది మాయూహకు బాధాకరమైయున్నది. తృతీయాశ్వాసాంత్యమందలి తిథి యెద్దియో పొడగట్టినది గాదు. కాన నిది యెప్పటి ప్రతియో యిప్పుడు చెప్పజాలను.

ఈ తాళపత్రప్రతిప్రథమద్వితీయపంచమాశ్వాసము లొకరి ప్రతినుండియు, తృతీయాశ్వాసము మరియొకరి ప్రతినుండియు నెత్తివ్రాసినట్లు తృతీయపంచమాశ్వాసాంతగతమైన వ్రాయసకాని వ్రాతలవల్ల స్పష్టము. నేటి ముద్రణప్రతికిని నీ తాళపత్రప్రతికిని చెప్పుకొనదగు పాఠాంతరము లున్నవి. అందు శ్రేష్ఠములని నాకు దోఁచినవి యుల్లేఖించుచున్నాను. ఇం దున్న వ్రాతతప్పులను, "దక్షిణమందలి - దక్కినమందలి" ఇత్యాదిభేదములను విసర్జించితిని. కేవలము మేలుపాఠములని తోఁచినవియే వ్రాయుచున్నాను. ఇంక "తాటియాకు" అనుటకు "తా" యనియు, "మొదటి ప్రక్క" అనుటకు "మొ. ప్ర" అనియు, "రెండవ ప్రక్క" యనుటకు "రెం. ప్ర" అనియు, "పంక్తి" అనుటకు "పం" అనియు, "తాళపత్రప్రతి" యనుటకు "తా. ప్ర" అనియు, "ముద్రణప్రతి" యనుటకు, "ము. ప్ర" అనియు సంకేతముల నిచ్చియున్నాను.

మున్ముందు ముద్రణప్రతిపాఠమును, దర్వాత తాళపత్ర ప్రతిపాఠమును జూపుచున్నాను. ఇందు గల పాఠము లందలి సాధ్వసాధుత్వముల బాధకులైన పండితవిమర్శకు లెన్నుదురుగాక.

—పీఠిక—

తే॥కమల రెుందున దనరూపు గాంచి వ్యులిగి
(ము. ప్ర. ౨. ప.)

కమల రెుుప దపు దన రూపు......(తా. ప్ర. ౧. తా. మొ. ప్ర. ౬పం)

తే॥దిసవగా నొప్పు నొసలిపై దిద్దికట్టి (ము. ప్ర. ౮ప.)

దిసదుగా లచ్చి నొసలిపై......(తా. ప్ర. ౧తా, రెం. ప్ర. ౩పం.)

మ॥చనుదెం చానాద మాలించి (సంధిదోషము)
(ము. ప్ర. ౫ప)

జననం బొ నాద మాలించి (తా. ప్ర. ౧తా. రెం. ప్ర. ౬పం.)

తే॥బంగరు చెఱంగు మాసు శుభంబు లొసగు (ము. ప్ర. ౯ప.)

...చెఱంగు రంగు శుభంబు...(తా. ప్ర. తా౨. మొ. ప్ర. ౩పం.)

ము. ప్ర. లో నున్న ఈ పద్యము ౧౦యవదిగను, నిది యదిగను నిండున్నవి.

శా॥ఆమోదంబున నర్మగర్భ పరసేష్టాలాపముల్
(ము. ప్ర. ౧౦ప.)

ఆమోదంబున బూనగా సరసశిష్టాలాపముల్
(తా. ప్ర. ౨తా. మొ. ప్ర. ౫ప.)

క॥ హరిచరణర తిపాంతు (ము. ప్ర. ౧౧ప.)

హరిచరణభక్తిస్వాంతు...(తా. ప్ర. ౨తా. మొ. ప్ర. ౭పం.)

ఉ॥చిరాలన దాటి లంక (ము. ప్ర. ౧౮ప.)

చివాలున దాటి లంక (తా. ప్ర. ౨తా. రెం. ప్ర. ౮పం.)

ము. ప్ర. పాఠ మప్రశస్తము, నస్వాభావికము. నిఘంటువుల కెక్కను లేదు.

క॥ వసిష్ఠ నారదబకదాల్భ్యశి...(ము. ప్ర. ౧౫పం.)

వసిష్ఠ నారదబలిదాల్భ్యశి...(తా. ప్ర. ౨తా రెం. ప్ర. ౬పం.)

బకదాల్భ్యులం డను భక్తుం డొక్కం డుండె గాని.ము. ప్ర. లో "బక" వేరుగను, "దాల్భ్యశి" వేరుగను నున్నది. దాల్భ్యశి డను హరిభక్తుడు కలడు. అర్థహితమై వేరుచేసి యుపయోగించిన "బక" శబ్దముకన్న తా. ప్ర. లో నున్న "బలి" యను పాఠమే శ్రేష్ఠమై తోచినది.

చ॥ కంఠమునకు దీరెగదా పగయందు నీలకంధరుడు (ము. ప్ర. ౨౧ప.)

......తీరెగదా పగ యంచు...(తా. ప్ర ౩తా. మొ. ప్ర. ౬పం.)

క॥ దరహారహీరపాండుశరీరక...(ము.ప్ర. ౧౯ప)

హారదకహారపాండుశరీరక...(తా.ప్ర.౩తా. మొ. ప్ర. ౩పం)

క॥ పమరుద్ధనపశివుని భోజమహిమ—(ము.ప్ర.)

పమరుద్ధనదశివకజాజమహిమ—(తా.ప్ర.౩తా.రెం, ప్ర౮పం)

క॥ రవిశశికుజబుధసురగురు—(ము.ప్ర.౨౫ప)

...సరగురు......(తా.ప్ర. ౩తా.రెం.ప్ర.౫ పం.)

సీ॥ ఇద్దఱు కైదండ లిడ నీటు గలుగువాడు—(ము.ప్ర. ౩౬ప.)

......కైదండ నిటునటు గలుగు...(తా. ప్ర. ౫తా. రెం. ప్ర. ౭పం.)

దుప్పటి రెుుల్లెవాటొప్పువాడు—(ము.ప్ర.౩౬ప.)

దుప్పటి రెుుప్పగా గప్పువాడు—(తా.ప్ర.౫తా రెం.ప్ర.౫పం.)

ఉ॥ఏది వచింపగా బడిరెుు—(ము ప్ర.౮౬ప.)

ఏది రచింపగాబడిరెుు—(తా.ప్ర. ౬తా. రెం.ప్ర. ౧పం.)

తే॥ఎఱుంగ రీ యాంధ్రభక్కి—(ము.ప్ర.౮౭ప.)

ఎఱుంగర యాంధ్రభక్కి—(తా.ప్ర.౬తా.రెం.ప్ర. ౮పం)

క॥ కృతిని విద్యయు గలుగుక—(ము.ప్ర.౬౯ప.)

కృతియు విద్యయు గలుగఁ—(తా. ప్ర. ౮తా. మె. ప్ర. ౩పం.)

సీ॥ బొద్దిసేపల్లి నివరళపురిని—(ము.ప్ర.౪౩ప.)

బొది సేపల్లినవదళపురిని—(తా.ప్ర.౮తా.రెం. ప్ర. ౩పం.)

సీ॥ సంతతంబును పౌరుషము తృప్తి గాంచదు—(ము. ప్ర.౪౮ ప.)

...పౌరుషము వెలిగాంచదు—(తా.ప్ర. ౯తా.మెు ప్ర.౮పం)

ఉ॥ పెద్దిభట్టుతో...వెంగన గన్నభట్టు(ము.ప్ర.౭౦ప.)

పెద్దిరాజుతో...వెంగన గన్న భట్టు(తా.ప్ర ౯తా రెం.ప్ర. ౧పం.)

ఆ॥ సేసమయందు(ము.ప్ర.౮౩ప.)

సేవమయందు(తా.ప్ర.౯తా.రెం.ప్ర.౮పం.)

క॥ సుకవులీలో లేరే(ము.ప్ర.౯౨ప.)

సుకవులిలలో లేరే(తా.ప్ర.౧౦తా.మె. ప్ర.౪పం.)

క॥ శ్రుతశాస్త్రాగమజిత(ము.ప్ర.౧౦౦ప.)

శ్రుతిశాస్త్రాగమజిత(తా.ప్ర.౧౧తా.మె.ప్ర.౭పం)

—:ప్రథమాశ్వాసము:—

క॥ సవిశేషంబుగ జెప్పె సంకుచిత(ము.ప్ర.౩ప.)

...జెప్పెను సముచిత(తా.ప్ర.౧౧తా.మె.ప్ర.౪పం)

వార్తా (ము.ప్ర.ఆర్య.వృ.౧)

శబ్దార్థా(తా.ప్ర ౧౧తా.మె.ప్ర.౮పం,)

స్వస్థాన వేష భాషాభిమతాః(ము.ప్ర.ఆర్య.వృ. ౨.)

స్వస్థాన దేశ భాషాభిమతాః(తా.ప్ర.౧౧తా.మె.ప్ర ౮పం.)

తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా...తుల్యాతుసమా.(ము.ప్ర.ఆర్య.వృ.౮)

తజ్జా సమాన దేశ్యా గ్రామ్యం...తుల్యాదసమా.(తా.ప్ర.౧౧తా.రెం.ప్ర.౨పం)

సాహిత్యరత్నాకరంబున(ము.ప్ర.౫.వచనం.)

ఈగ్రంథము లేదు(తా.ప్ర..౧౧తా.రెం.ప్ర,౪పం)

తే॥ తెనుగు [వ] కావళ్యకం బిది(ము.ప్ర.౯ప.)

తెనుగున కవళ్యకం బిది(తా.ప్ర.౧౨తా. రెం.ప్ర. ౧పం.)

తే॥ హరిణరోగము వాసె శ్రీహర్షణునకు(ము.ప్ర.౨౨ప)

హరిణరోగంబు బాసె శ్రీహర్షణుడు(తా.ప్ర.౧౩తా.మె.ప్ర.౬పం)

ఇంక బంధవిధభావసీసమాలిక "దైన్యాదహిత నిద్రావిహీన"వఱకు నున్నది. తరువాత "శృంగారరససీస మాలిక"లేదు సరిగదా ౩౮సీసమాలికయొక్క తే॥ గీ॥ మూడువాలుగుపాదము లున్నవి. ఇట్టిది వ్రాయస కాని ప్రమాదము—

సీ॥మా॥హాస్యాదికార్ద్రిరసాత్మజాత(ము.ప్ర.౩౯ప.౧౫ పాదం.)

హాస్యాదిరౌద్రరసాత్మజాత (తా.ప్ర.౧౪తా.రెం.ప్ర.౪పం.)

సీ॥గీ॥ఓగిరంబులు మంచి మేళోగిరములు(ము.ప్ర.౪౦ప)

...మంచి మేలాగిరములు(తా.ప్ర.౨౧తా.మె.ప్ర.౮పం)

క॥ ద్వివిధయయ్యె(ము.ప్ర,౪౬ప.)

ద్వివిధమయ్యె (తా.ప్ర. ౨౧తా.రెం.ప్ర.౬పం.)

ఉ॥ఇచ్చదలంచి యొక్క మెయి నిత్తతి(ము.ప్ర.౯౧ప)

ఇచ్చదలంచియు నెక్కల నిత్తతి(తా.ప్ర.౨౨తా.రెం.ప్ర.౫పం)

తే॥ శేశంబు లేక(ము.ప్ర.౧౦౬ప.)

శేశంబు లేక(తా.ప్ర.౨౮తా.రెం.ప్ర ౫పం)

తా.ప్ర.పాతమునే అహోబలుడు గ్రహించెను(మా.అహో.సంజ్ఞ)

క॥ గుణముసామి(ము.ప్ర.౧౧౪ప.)

గుణముకుసామి(తా.ప్ర.౨౯తా.మె.ప్ర.౬పం.)

—:ద్వితీయాశ్వాసము:—

యుగవసహాశ్చ హలః(ము.ప్ర.ఆర్య.వృ.౮)

లవసహాళం తు హల్వర్గః (తా.ప్ర.౧తా.రెం.ప్ర.౨ పం)

ము.ప్ర.లో నున్న ౧౪ఆశ్వాంతముపఱకుమాత్ర మేయిందున్నది. ఆశ్వాసాది శిశ్వాది లేదు. ఇవి తృతీయాశ్వాసములోనివి గాన నిందుంచుట సమంజసము గాదు. తా.ప్ర.లో నున్నట్లే యుండుట మంచిది. ఆశ్వాసాదిరాదిశ్లోకములు తృతీయాశ్వాసమున నున్నవి. కాని

వృత్తమిత్యాదిశ్లోకములు చతుర్థాశ్వాసములోనుండవలసి యున్నది.

పురాస్త్రరసగిరి (ము. ప్ర. ౧౪. ఆర్య. వృ)
పురాస్త్ర రుగిరి(తా.ప్ర.౧తా.రెం.ప్ర.౬పం.)

అహోబలుడును "నా.ప్ర" పాఠమునే గ్రహించె (మా.అహో.సం)

సీ॥ బుత్త్వదీర్ఘ సునగ(ము.ప్ర.౭ప.)
బుక్త్వదీర్ఘ మిరొక్క (తా.ప్ర.౨తా.మొ.ప్ర. ౮పం.)

౨౧పద్యముతరువాత ము.ప్ర.లో "వీనికి రూపములు" అని యున్న రూపము లేమియు "తా.ప్ర." లో లేవు(౩ తా రెం.ప్ర.చూడు.) ము. ప్ర. లో నున్న ౩౪వచన మిందు లేదు (మా. ౫తా.మొ.ప్ర.౧పం.)ము.ప్ర.లో నున్న హల్లులకు రూపములు తా. ప్ర.లో లేవు. ౩౫, ౩౬పద్యములకు మధ్య ము.ప్ర.లో నున్నది తా.ప్ర.లో లేదు. ము. ప్ర.లో నున్న ౩౯,౪౦పద్యగద్యములు తా.ప్ర.లో లేవు. ౪౧పద్య మున్నది. (మా. ౫తా. మొ. ప్ర.)

క॥ ఇరులీగలుబుకలూ శ్లేవ్వరు(ము.ప్ర. ౪౪ ప.)
ఇరువాగలు బుకు లూ శ్లేవ్వరు(తా.ప్ర.౫తా.రెం ప్ర.౧పం.)

ము.ప్ర.౫౮తర్వాత నున్న శ్లోకము తా.ప్ర. తుల్యముగా నున్నది. పూర్వ మున్న భేద మిట లేదు. (౮తా.రెం.ప్ర.౫పం.)ము.ప్ర.లో నున్న ౬౧వచనము తా.ప్ర.లో లేదు. (౭తా. మొ.ప్ర.౫పం)

సీ॥ భ్రూలతాప్రకపితములు(ము.ప్ర.౬౬ప.)
భ్రూలతాత్రు కొతములును(తా.ప్ర.౭తా.రెం.ప్ర.౨పం.)

వ. మరియు(ము.ప్ర.౬౮తర్వాత.)
దానిమంద(౭తా.రెం.ప్ర.౫పం.తా.ప్ర.)

క॥ వదనావ్యావళిత...నిదానము(ము.ప్ర.౬౯ప.)
వచనవ్యావళిత... నిధానము(తా.ప్ర.౭తా.రెం.ప్ర.౮పం)

సీ॥గీ॥కృతాంతకా...మదవజనక(ము.ప్ర.౮౨ప.)
కృతారిసత...ధాతృజనక(తా.ప్ర.౯తా.మొ.ప్ర.౪పం.)

ఆ॥ పెక్కు లేలకృష్ణ(ము.ప్ర.౮౪.ప.)
ఎక్కు వేలకృష్ణ(తా.ప్ర.౯తా.మొ.ప్ర.౬పం.)
ము.ప్ర.లో నున్న ౮౮పద్యము తా.ప్ర.లో లేదు. (౯.తా.రెం.ప్ర.౨పం)

ఆ॥ నీరిలోవనుండి (ము. ప్ర. ౮౭ప.)
నీటిలోవనుంచి (తా. ప్ర. ౯తా. రెం. ప్ర. ౩పం.)

తే॥నవెసలిచ్చి (కసలివిచ్చి. పాఠాంతరం). (ము. ప్ర. ౭౨ప.)
వెసలివచ్చి (తా. ప్ర. ౯తా. రెం ప్ర. ౬పం.)

క॥ దుర్మగులకు (ము. ప్ర. ౭౮. ప.)
దుర్మతులకు (తా. ప్ర. ౧౦తా. మొ. ప్ర. ౪పం.)

ము. ప్ర, లో నున్న మనుచరిత్రపద్యము (౯౮) తా. ప్ర. లో లేదు.

ఆ॥ చలము మాని కడుపు చట్టకోవ (ము. ప్ర. ౧౧౯)
.........చల్డికోవ! (తా. ప్ర. ౧౧తా. రెం. ప్ర. ౩పం.)

ఉత్సాహ—జానొప్ప గెల్చెన్ జమదగ్ని సూనున్ (ము. ప్ర. ౧౩౧. ప).
తానొప్ప గెల్చెన్—.....(తా. ప్ర. ౧౩తా. మొ. ప్ర. ౬పం)

కేటి యనంతుని ఛందమందును "జానొప్ప" యని యున్నదిగాని యతి తప్పును. జమదగ్నిలో దకారము నకు యతి.తా.ప్ర.పాఠమే శ్రేష్ఠము.

క॥ తా మేత్వం బిడరు (ము. ప్ర. ౧౩౨ప)
తా మెత్వం బిడరు (తా. ప్ర. ౧౩తా. మొ. ప్ర. ౮పం.)

తే॥నడుగరాదు (ము. ప్ర. ౧౩౩ప.)
నడువరాదు (తా. ప్ర. ౧౩తా. మొ. ప్ర. ౭పం.)

ఆ॥ రాచ సెలతలందు నే చెలియకు (ము. ప్ర. ౧౩౪)
రాచ సెలతలందు నీచెలియకు (తా. ప్ర. ౧౩తా. ౭పం.)

సీ॥ విచ్ఛిత్తికచ్ఛాపకచ్ఛపరిచ్ఛేదపృచ్ఛాచ్ఛవిచ్ఛిరతుచ్ఛగుచ్ఛ (ము.ప్ర.౧౩౮) విచ్ఛిత్తికచ్ఛపఋచ్ఛాచ్ఛవిచ్ఛిద్రతుచ్ఛగుచ్ఛపృచ్ఛపుచ్ఛితాది (తా. ప్ర. ౧౪ తా. మొ. ప్ర. ౨పం).

ఉ॥ వాక్యంబులను స్వదేశ్యములుగాని వైకృతములు గావు (ము. ప్ర. ౧౩౯ ప)

వాక్యంబు లన్యదేశ్యములుగాని..... (తా. ప్ర. ౧౪తా. మొ. ప్ర. ౫పం)

ము. ప్ర. లో నున్న ౧౪౦పద్య మీ తా. ప్ర. లో లేదు (౧౫ తా. మొ. ప్ర. ౩పం.)

శా॥పురంధ్రీరత్నముల్ వేడుకన్ (ము. ప్ర. ౧౫౦ప)

పురంధ్రీరత్నము లుప్పొడగన్ (తా. ప్ర. ౧౫తా. మొ. ప్ర. ౫పం.)

ము. ప్ర. లో నున్న ౧౬౯పద్య మిందు లేదు. (౧౬తా. రెం. ప్ర. ౬పం.) ము. ప్ర. లో ౧౭౨ తరువాత నున్న 'వాలిపర్వేషా'మనుదాని వృత్తి తా. ప్ర. లో లేదు.

క॥ శ్రీహరి కపురమున్ (ము. ప్ర. ౧౯౨ ప.)

శ్రీహరికనగన్ (తా. ప్ర. ౧౯తా. మొ. ప్ర. ౫పం.

రేఫాక్షరపదములు విడదీసి యర్థములు ము. ప్ర. లో నున్నవి యిందు లేవు. ౨౧౯పద్యముతరువాత "ఏకార భేదంబులు" అని శీర్షిక యుంచవలె. అది ము. ప్ర.లో లేదు. తా. ప్ర.లోనున్నది (౨౬తా. మొ. ప్ర. ౬పం)

లఘ్వలఘు భేదంబులకు (ము. ప్ర.౨౨౧ప. తర్వాత.)

లఘ్వలఘు భేదాభేదంబులు (తా. ప్ర. ౨౬ తా. రెం. ప్ర.౧ పం.)

క॥ వైకృత కావ్యంబులలో (ము. ప్ర. ౨౨౨. ప.)

వైకృతవాక్యంబులలో. (తా. ప్ర. ౨౬ తా. రెం. ప్ర. ౧ పం.)

ఉ॥అయమరాచలంబు (ము. ప్ర. ౨౨౮ ప.)

అయమలాచలంబు (తా. ప్ర. ౨౭ తా. మొ. ప్ర. ౧ పం.) ము. ప్ర. లో నున్న ౨౩౬ పద్యము తా. ప్ర. లో లేదు.

ఉ॥ యాదవరాజసింహమూర్తిరక్షకుండు (ము. ప్ర ౨౩౮. ప.)

యాదవరాజసింహమూర్తరక్షకుండు (తా. ప్ర. ౨౭ తా. రెం. ప్ర. ౨ పం.)

క॥ కేవలతను కార్శ్యయుతుడు (ము. ప్ర. ౨౫౬. ప)

కేవలఘనకార్శ్యయుతుడు (తా. ప్ర. ౨౮ తా రెం. ప్ర. ౬ పం.)

ఏకైకం పంచధా భవేత్ (ము. ప్ర. ౨ వ పంక్తి. శ్లోకం.)

ఏకైకం పంచధా క్రమశః (తా. ప్ర. ౩౧ తా. రెం. ప్ర. ౯ పం.)

ము. ప్ర. లో నున్న "అవహాకహాడా" ఇత్యాది రెండుపాదము లిందు లేవు. "ఘోరార్ధ్రిక" శ్లోకము మొదలు "కీర్తితాః పురా" వఱకు (ము.ప్ర. లో నున్నయవి.) నీ తా.ప్ర. లో లేవు.

అరివర్ణ చక్రోద్ధారణ (౩౦౩ ప. తరువాత. ము. ప్ర.)

అరివర్ణశోధనచక్రోద్ధారణ (తా. ప్ర. ౩౪ తా. మొ ప్ర. ౩ పం.)

ము. ప్ర. లో నున్న ౩౦౪ వచన మున్నదిగాని దానిక్రింద నున్నయొక శ్లోకము, నుత్పలమాలయు నిందు లేవు.

తే॥ మొదలి వర్ణమునకైన (ము. ప్ర. ౩౦౭ ప.)

మొదలి వర్ణమునకైన (తా. ప్ర. ౩౫ తా. మొ. ప్ర. ౨ పం.)

సీ॥ అర్వగోకాపరైణాలికి (ము. ప్ర. ౩౧౩ ప.)

అవనిగోకాపరైణాలికి (తా. ప్ర. ౩౫ తా. రెం. ప్ర. ౩ పం )

తే॥పటునోకండునై పదిరాశి పరగుచేని (ము. ప్ర. ౩౨౧ ప.)

పటునోకండునై పతిరాశి పరగుచేని (తా. ప్ర. ౩౬ తా. మొ.ప్ర. ౨ పం)

ఆ॥ కర్త్రురాశిపతికి గావ్యాదివర్ణము,

రాశి కీసుడైన గ్రహమునకును, నూడు గలుగ చెప్పువాడు కొలయముండు (ము. ప్ర. ౩౨౫. ప)......

గావ్యాదివర్ణోడు రాశి......గ్రహమునూడు, గలుగ

......కాలయముండును (తా. ప్ర. ౩౬ తా. మొ. ప్ర. ౭ పం)

ము. ప్ర. లో నున్న ౩౪౪-౩౪౫ పద్యాలు తా. ప్ర.లో లేవు.(౩౬ తా. రెం. ప్ర.)ము. ప్ర. లోని ౩౫౬ పద్యము తా. ప్ర. లో లేదు (౩౮ తా. మొ. ప్ర. ౫ పం)

క॥ నగనకు (ము. ప్ర. ౩౬౨ ప)
మరువక (తా. ప్ర. ౩౮ తా. రెం. ప్ర. ౮ పం)

ఆఱవచోట తకారము నిలిపి (ము. ప్ర. ౩౭౦ తరువాత)
...చకారము నిలిపి (తా. ప్ర. ౩౯ తా. రెం. ప్ర. ౬ పం)

క॥ సాళువపెదతిమ్మమహీ (౩౭౧ ప. ము. ప్ర.)
సాళువపెదచేవ్యమహీ (తా. ప్ర. ౩౯ తా. రెం. ప్ర. ౭ పం)

క॥ కురకురకవుల (ము. ప్ర. ౩౮౮ ప)
కురకురకవుల (తా. ప్ర. ౪౧ తా. మొ. ప్ర. ౭ పం)

సీ॥ అతతబహూరత్న (ము. ప్ర. ౪౦౦. ప.)
అతతబహుమాల్య (తా. ప్ర. ౪౩ తా. మొ. ప్ర. ౭ పం.)

తే॥ పరవిరుషచైత్రకర్కటశ్రావణములు (ము. ప్ర. ౪౧౩. ప.)
పరవితారుషకర్కటశ్రావణములు (తా. ప్ర. ౪౪ తా. రెం. ప్ర. ౩ పం)

ఘస్రములను (ము. ప్ర. ౪౧౩ ప.)
ఘస్రములును (తా. ప్ర. చూ. పూర్వసంఖ్య)

ము. ప్ర. లో గల ౪౨౩ పద్యాదిపాదమును దరువాతి పద్యమందలి (౪౨౪) చివరి మూడుపాదములను గలిసి యొక పద్యముగా తా. ప్ర. లో నున్నది.

ఆశ్వాసాంత్యగద్యముతరువాత కులతిలకసారములోని పద్యములు అని యాక్రిందివీవ మున్నది. (౪౭ తా.)

శత్రునామంబును శత్రుబీజంబును
మృత్యుగణంబు తా మేళవించి
ఆకచటతపయశే లారింట నేడింట
కదుకొండింటను బరగ నిల్పి
తిలతైల మెక్కింత తలపైని నిడికొని
మూడు శిఖలుగ దలముళ్లు వేసి
భామదుగ్ధములు కపాలమ్మునను బోసి
చిల్లు కట్టైన నుసిచేసి కల్పి
బొమ్మతోయంబుల పదునిచ్చి పదునిచ్చి
దుత్తూరకలమున దునియవ్రాసి
కణగి యేడ్చుచు బద్యంబు కాలవైవ
నబడు పూనిన హరిహరు లడ్డ మైన
మిడుతకైవడి శత్రుండు మిడుచుగాత
శత్రుసంహార వేంకటాచలవిహార!

మూడవపాదమున గణభంగ మైనది. మూడుశిఖలు గాగ ముళ్లు వేసి అని దిద్దిన సరిపోగలదు.

—:తృతీయాశ్వాసము:—

శా॥ కుచతటీపైరాపతద్గ్రాహ (ము. ప్ర. ౧౯ ప.)
కచతటీపైటీపటగ్రాహ (తా. ప్ర. ౨ తా. రెం. ప్ర. ౨ పం)

సీ॥ సంస్కృతవ్యవహార (ము. ప్ర. ౫౪ ప.)
సంస్కృతవ్యాహార (తా. ప్ర. ౫ తా. రెం. ప్ర. ౭ పం.

తే॥ తమలోన నివియును (ము. ప్ర. ౮౭. ప.)
తమలోన యతియును (తా. ప్ర. ౮ తా. రెం. ప్ర. ౭ పం)

చ॥ పోర నక్షతతను జరెయ్యి వాని (ము. ప్ర. ౯౦ ప.)
కారణక్షతతను డరెయ్య దాని (తా. ప్ర. ౯ తా. మొ. ప్ర ౩ పం)

చ॥ మేలు మూడగణ (౮౯ ప. ము. ప్ర.)
మేలు భూవరా! (౯ తా. మొ. ప్ర. ౨ పం-తా. ప్ర.)

ఉ॥ రింగున వారి గోల నమరించి (ము. ప్ర. ౯౨. ప.)
......సవరించి (తా. ప్ర. ౯ తా. మొ. ప్ర. ౭ పం.)

సీమ్నః అంతః సీమంతః (ము. ప్ర. పరరూపవిరతులు. వచనం.)
సీమస్య అంతః సీమంతః (తా. ప్ర. ౧౩ తా. మొ. ప్ర. ౨ పం.)

ముద్రణప్రతియం దున్న పాఠము సరియైనది కాదు. సీమ్నః అంతః అయినయెడల సీమాన్తః అని యగుగాని సీమన్తః కాజాలదు. (చూ. అప్ప. వివరణము.)

ఉ॥ నారాయణునట్లు దానును ధరామరవంశ (ము. ప్ర. ౧౭౦ న.)

నారాయణునట్లు వానసధరామరవంశ(తా.ప్ర.౧౩ తా.మొ.ప్ర.౮పం)

"ఆంధ్రకవితరంగిణి" కర్తలైన శ్రీ చాగంటి శేషయ్యగారు పెందటిసంపుటగతనారాయభట్టుచరిత్ర మందు "నారాయణభట్టుగృహనామము "వానస" వారు. నన్నయ రచించిన పైపద్యములోని "దానును" అను శబ్దమునకు బదులుగా దక్షిణదేశమునుండి సంపాదింపబడి ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమున నుంపబడినయొక ప్రతిలో "మానస" యని యున్నది. "వానస" యనుటకు బదులుగా విలేఖకుడు పొరపాటున "మానస" యని వ్రాసియుండును. "దానును" అను పాఠముకంటె "వానస" పాఠమే సమంజసమని తోచుచున్నది." అని వ్రాసియున్నారు. శ్రీ చాగంటివారి యూహ యూహగాక ప్రస్తుతతాళపత్రప్రతిలో నున్న పాఠమునుబట్టి నిజమైనదియే యైనది.

వ—దీని మూడవ పాదంబునందు వదునొక్కొంటికి నని యున్నచోట సంధిగూర్చ(ము.ప్ర.౨౧౭.)

దీని మూడవపాదంబునందు "పదునొక ఒంటికి" అన్నచోటను సంధిగూర్చి(తా.ప్ర.౨౧తా.మొ.ప్ర ౬ పం.)

వేదుల రామశాస్త్రిగారు తమ యప్పకవీయ వివరణమున "పదునొక్కొంటికి" ననునెడ స్వరప్రధానవడిగా సంధిగూర్చి సోమయాజులు వాడినారని చెప్పునంతటి తెలివితక్కువవా డప్పకవి గాడనియు, నయ్యది వ్రాయసకాని తప్పైయుండుననియు, "పదియు నొంటికి" నని యప్పకవి వ్రాసియుండు ననియు జెప్పియున్నారు. "పదునొక్కొంటికి" ననుచో నప్పకవి చెప్పినది సరియైనదే యనియు, నద్దానికి బలముగ కొండురంగనాథకృతమందలి మఱియొక ప్రయోగము చూపుచు రావూరి దొరసామిశర్మగారు గత సెప్టెంబరు (1949) భారతిలో వ్యాసము వ్రాసియున్నారు. పదునొక్కొంటికి ననుచో స్వరప్రధానవడి యనిన నర్థము పొసగదు. పదునొక ఒంటికి నని విడదీసిన బండ్రెండగుచున్నది. కాని యట పదునొకండునే వివక్షింపవలె. అప్పకవీయవివరణగతసవరణ నాకు నచ్చలేదు. అప్పకవి యీ విషయమున బొరబడెననియే నా యాశయము. ఏరికైనను దప్పు లుండవని చెప్పజాలముగదా!- పదియు నొంటికి నని దిద్దుట మంచిది గాదని నా యాశయము. విస్పష్టముగా తాళపత్రప్రతియందు "బదునొక + ఒంటికి" నని యున్నది. దీనినిబట్టియు, నప్పకవియభిప్రాయము "పదునొక్కొంటికి" ననుచో స్వరప్రధానవడి యని యెంచినట్లే తేలుచున్నది. "పదునొక్కొంటికి" ననుచో స్వరప్రధానవడి యని చెప్పిన నర్థభంగ మెందవు ననువిషయ మేరికిని మెన్నటివరకు దెలియరాలేదే! అర్థసంబంధమైన పొరపాటు నెవ్వరు బదినాల్గువత్సరములనుండి గుర్తింపనందు నప్పకవికి మాత్ర మట్టిదొడ నర్థస్ఫూర్తి యున్నదని చెప్పజాలము. ఇది సూక్ష్మాతిసూక్ష్మమైన విషయము అప్పకవి పొరబడె ననుట యాశ్చర్యము గాదు. విలేఖకుని పొరపాటన్న నయ్యది యేదొయొక్క ప్రతిలోనో యుండవలెగాని తాళపత్రప్రతులం దన్నింటియందును "బదునొక్కొంటికి" "పదునొక ఒంటికి" వనియే యుండదని నా యాశయమై యున్నది.

ము.ప్ర.లోనున్న ౨౨౪పద్యము తా.ప్ర.లో లేదు. "అప్పయ సేటందుక నందితిమ్మకన్న చాటుధార" అని "అప్పలిడుసతడు" అను ము.ప్ర.లో హంశక్క భాస్కరునిదిగా నీయబడిన ౨౨౩పద్య మున్నది(౨౨ తా. రెం. ప్ర. ౩ పం.) అయ్య అనుటకు అని ము.ప్ర.లో బద్యము లేదు. తరువాతి కాకిఖండమందలి పద్య మున్నది. ౨౨౪. పైపద్యము లేదుసరిగదా ౨౨౪వ. పద్యమును లేదు. ము.ప్ర ౨౩౧ తరువాత అవ్వ అనుటకు అనిమాత్ర మున్నదిగాని యదియు నిందు లేదు. ౨౩౨, ౨౩౩పద్యములుగూడ (ము.ప్ర.లోనివి) తా.ప్ర.లో లేవు. (౨౨ తా. రెం. ప్ర) అక్క అనుటకు చాటుధార (ము..ప్ర.౨౩౩ తరువాత) అక్క అకేటందుకు "…కూరిగుర్వన" చాటుధార (తా.ప్ర.౨౨తా.రెం.ప్ర.౫పం.)

ము.ప్ర.లో నున్న ౨౩౪పద్యమును మొదటి మూడుపాదములను సమానముగను, నాల్గవపాదము ము.ప్ర.౨౩౫వ. పద్యము నాల్గవపాదమును నున్నది. ము.ప్ర.లో నున్న ౨౩౪పద్యాంత్యపాదమును ౨౩౫వ. పద్యాదిపాదత్రయమును నీ తా.ప్ర.లో లేవనుట. ఆ పద్య మిట్లున్నది—

క॥ ఇక్కాలియుగళ క్షితులలో
ఎక్కింపకు భట్టకళంక లేక ధరిత్రిన్
మిక్కిలి మల్లేసని యం
బక్కడు పరిగలదె సకలభాగ్యస్ఫురణన్.
(౨౪తా. రెం. ప్ర. ౫పం)

అయి అచేటందుకు ము. ప్ర. లో నన్న పేరు తా. ప్ర. లో లే దు.

ఆ॥ పంచమికన్ననం టె(ము. ప్ర. ౨౩౭వ.)
పంచమినన్ననం టె (తా. ప్ర. ౨౩ తా. మొ. ప్ర. ౧పం)

వ—ఈ చెప్పిన దడలకు పదాది నన్న చతుర్థవర్గసరళము ఆదేశమైనచ్చునపుడు ఆదేశయతిగా జెప్పవచ్చును (ము. ప్ర. ౨౬౫వ.)

ఈ చెప్పిన దడలకు పదాది నున్న చతుర్థ వర్గసరళమునకు తృతీయవర్గసరళము ఆదేశము....(తా. ప్ర. ౨౫తా. రెం. ప్ర. ౪పం.)

క॥ కైలాటరాయ(ము. ప్ర. ౨౪౨)
కేళాధిరాయ!(తా. ప్ర. ౨౬తా. మొ. ప్ర. ౪పం.)

ము. ప్ర. లో రేఖ యని యున్నచో(౨౪౨-౨౪౩) తా. ప్ర. లో లేఖ యున్నది. రేఖ యని లేదు—

వ. రేఖాశబ్దము మొదల ద్వితీయాంతస్థమని తెలియంగునది. ము. ప్ర. ౨౪౪. లేఖాశబ్దము మొదలిది తృతీయాంతస్థమని తెలియంగునది (తా. ప్ర. ౨౬ తా. మొ. ప్ర. ౪ పం.)

ఈయాశ్వాసాంతమున నిట్లున్నది.

శ్లో॥యాదృశీ పుస్తకం దృష్ట్వా
తాదృశీ లిఖితి మ్మయా
అబద్ధంవా సుబద్ధంవా
మమ దోషో నవిద్యతే.

క॥ వాలాశ్రుభులు తప్పులు
చాలంగా గలవు శబ్దసంగతు లెఱుగం
గేలింబెట్టక తిట్టక
పోలంగా దిద్దరయ్య బుధజనులారా!

విశ్వావసునామసంవత్సర వైశాఖ బ॥ ౧ లు గురువారం గుంటుపాపయ్యగారి ప్రతిలో వున్నట్టి యీ వళిప్రాసపరిచ్ఛేదం గుంటుపల్లి వెంకట్రాయుడుంగార్కి గుంటుపల్లి లక్ష్మయ వ్రాసియిచ్చెను.

—పంచమాశ్వాసము—

లుక్సంశ్లేషా నాచిద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు (ము. ప్ర. ౩ శ్లో.) లుక్సంశ్లేషా నాచిద్రుతప్రకృత్యంతనస్య సర్వత్ర (తా. ప్ర. ౧ తా. ౫ పం) ము. ప్ర. లో "ద్రుతస్య సర్వత్రి లుక్సమాసేషు" అను సూత్రము రెండుశ్లోకములలో నున్నది. ఈ క్రింది శ్లోకములు తిలకింపుడు.

శ్లో॥సర్వత్రాజ్వతా కార్యం
జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః,
లుక్సంశ్లేషా నాచి
ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు (శ్లో. ౩.)

శ్లో॥ప్రతమలుగపి ద్వినుల్వో
ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు,
హేమోక్తే పరుషాణాం
గసడదవాస్యుః పదా ద్ద్వంద్వే (శ్లో. ౧౪)

విభజించి వ్యాఖ్యానించుటకుగూడ "ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు" అను సూత్రము ౩౦౭ వ. పుటలోను (౪౪ పద్యం) ౩౨౫ వ. పుటలోను (౧౬౪ పద్యం) రెండుసారులు వ్యాఖ్యానింపబడినట్లు ము. ప్ర. లో నున్నది. కాని తా. ప్ర. లో నొక్క పర్యాయమే వాఖ్యానింపబడినది. మూడవ శ్లోకములో దా. ప్ర. కిని ము. ప్ర. కిని గల భేదముం జూపితిని. తాళపత్రప్రతిపాఠమే శ్రేష్ఠమైనది. ఈసూత్రము రెండు చోట్ల నుండుట శ్రీ గిడుగువారు గాంచినారు గారు. విభజించి వ్యాఖ్యానించుటకుగూడ తా. ప్ర. లో ౩ వ శ్లోకమున నున్న "లుక్సంశ్లేషా నాచి ద్రుతప్రకృత్యంతనస్య సర్వత్రి" అను సూత్రమే వాఖ్యానింపబడెను. పద్యములలో మార్పులేదు.

"శాబ్దా పత్స్వబ్దాతోలుగ్
దారాశ్రేతి దపికేభస్వాశిత్"

అని మొత్తముగా నిచ్చిన శ్లోకములలో నుండి (౩౦౨ పుట ౬ శ్లోకం) విభజించివ్యాఖ్యానించుచొ) "దారార్థే తతుదపి రః"అని (౩౧౪ పుట. ౯౯ పద్యం

ము. ప్ర. లో లున్నవి ఒకేసూత్రమున నిట్టి భేదముల కవకాశము గావరాదు. ఇది ఇతరపుస్తకగతిమాత్రపకవ ఫలమై యుండవచ్చు. కాని తా. ప్ర. లో మొదట నిచ్చిన శ్లోకములలోను (౧ తా.) వ్యాఖ్యానసందర్భము నను "దారార్థే తఉదపి రేఫ స్స్యాత్" త్తనియే యున్నది గాని రెండువిధములుగా లేదు (తా. ప్ర. ౯ తా మొ. ప్ర. ౨ పం).

ము. ప్రలో ౪ వ శ్లోకమున (౩౦౩ పుట) "ధాతుపదసంభవానాం విశేషణానా ముతపథానుముచి" యనియూ, వ్యాఖ్యానసందర్భమున "ధాతుపద సంభవానాం విశేషణానా ముత స్తథా నగచి" (౩౧౮ పుట ౯౨ పద్యముతరువాత.) అని యున్నది. తా. ప్రలో వ్యాఖ్యానసందర్భమునగూడ "నమచి" అనియే యున్నది. తా. ప్ర. ౯ తా. మొ. ప్ర. ౭ పం. "నగచి" యని యుండుట పొరపాటు. ఈసందర్భమున నుమాగమమేగాని నగాగమము గాదు.

ము. ప్ర. లో శ్లోకములందు (౭. శ్లోకం) ౩౦౩ పుట. "లోపో నమఆదికే విసర్గశ్చ" అనియు వ్యాఖ్యాసందర్భమున "విసర్గస్య" యనియు నున్నది. కాని తా. ప్ర. లో రెండుచెడలందును "విసర్గశ్చ" అనియే యున్నది.

ము. ప్ర. లో ౩౦౩ పుటలో ౧౩ శ్లో. (శ్లోకములందు) "ప్రథమాద్వైభక్తికయోర్లుక్ పూర్ణో వాపతిక్రియార్థేతు" అనియు, వ్యాఖ్యానసందర్భమున (౩౧౯ పుట ౧౨౩ పద్యంతరువాత) "ప్రథమాద్వైభక్తికయోర్బిందుశ్చ మహోన్నతిక్రియార్థేతు" అన్నియున్నది. ఇట్లే యున్నచో ముపర్ణకమునకు లోపము లేక బిందుపుమాత్రమే వచ్చును. ఈభేదము నహోబలపండితీయాదులు చూచుటవల్లనై యుండవచ్చును. అహోబలపండితీయమున "చాశేరుపథాత్సనశ్చలుగ్వాస్యాత్ "అనుసూత్రమునుండి లుక్కను పద మనువర్తించుచున్నదిగావ ముపర్ణకము నకు లోపము గల్గును. అప్పకవీయమునను, నహోబల పండితీయగతమైన సూత్రి ముండినట్లున్న మువర్ణలోప మొదవదు, "ప్రథమాద్వైభక్తికయోర్లుక్ పూర్ణో వాపతిక్రియార్థేతు" అని యున్నగాని మువర్ణకమునకు లుక్కు రాదు. తా. ప్ర. లో వ్యాఖ్యాసందర్భమునగూడ "ప్రథమాద్వైభక్తికయోర్లుక్ పూర్ణో వా ప్రతిక్రియార్థేతు" అనియే యున్నది (తా. ప్ర. ౧౨ తా. రెం. ప్ర. ౨ పం.)

ము. ప్ర. లో "శత్రర్థేతూతశ్చనో స్తస్య స్యాచ్చ పూర్ణబిన్దురపి" అని యున్నది. తా. ప్ర. లో "శత్రర్థే లుగుతశ్చనో స్తస్య స్యాచ్చ - పూర్ణ బిందురపి" అని యున్నది. ము. ప్ర. పాఠముకన్న తా. ప్ర పాఠమే శ్రేష్ఠమైనదని నా యూశయము. ము. ప్ర. పాఠమే యున్నను వర్ణగతోకారలోపము క్లిష్టము గావచ్చునుగాని సుకరము గదు.

ము. ప్ర. లో మూలశ్లోకములందు ౧౬ శ్లో. ౩౦౩ పుట. "లుగ్వా నప్రకృతిపదాత్ పరతః"అనియు వ్యాఖ్యాసందర్భమున "లుగ్వాద్రుతప్రకృతికాత్పరతః" అనియు నున్నది. ౩౨౨ పుట. ౧౮౨ తరువాత. తా. ప్ర. లో రెండుచోటులందును "లుగ్వా నప్రకృతి పదాత్ పరతః" అనియే యున్నది.

తే॥గూను నెమ్మేను మెడ నాను మీను పేను (ము. ప్ర. ౨౫ ప.)

......నెమ్మేను జేనును మీను పేను (తా. ప్ర. ౩ తా. రెం. ప్ర. ౩ పం.)

తే॥అల్ల పాండుని సతి మేనయత్త యనగ (ము. ప్ర. ౫౫. ప.)

అల్ల పాండుని సతియు మేనత్త యనగ (తా. ప్ర. ౬ తా. ౫ పం.)

సీ॥ వారిచే నంద దీవనలు కెక్కు" (ము. ప్ర. ౬౦ ప.)

త్రిదివజులచే నంద దీవనలను (తా. ప్ర. ౬ తా. రెం. ప్ర. ౮ పం.)

తే॥పదపదార్థ మపేక్షింప (ము. ప్ర. ౪౬ ప.)

పరపదార్థ మపేక్షింప (తా. ప్ర. ౭ తా మొ. ప్ర. ౨ పం.)

తే॥వర్తమానార్థమున షష్ఠవర్ణ (ము. ప్ర. ౪౬ ప.)

వర్తమానార్థమున నొచవర్ణ (తా. ప్ర. ౭ తా. మొ. ప్ర. ౨ పం.)

క॥ మొనసందు నతడు (ము. ప్ర. ౯౪ ప.)

మొన నందునతడు (తా. ప్ర. ౯ తా. ౭౦. ప్ర. ౧ పం.)

సీ॥తంౘ్రి......కాంతారమునకు నేని (ము. ప్ర ౧౪౨ ప.)

తంౘ్రి......కాంతారమునకు నేగి (తా. ప్ర. ౧౪ తా. మొ. ప్ర. ౫ పం.)

ము. ప్ర. లో నున్న "హేమోక్తే పరుషాణాం గషడదవా స్సృశ్ః పదా ద్వంద్వే" అను సూత్రమును, దాని వ్యాఖ్యాపద్యములును (౧౬౭-౧౬౯ ప.) తా. ప్ర. లో లేవు.

ఈ యాశ్వాసాంతమున్న నిట్లున్నది. విశ్వావసునామసంవత్సర వైశాఖబహుళ ౧౪. అంగారక వారంనాఁటికి గుంటుపల్లి వెంకట్రాయుడిగారి గుంటుపల్లి లక్ష్మయ్య వ్రాసియిచ్చిన సంధిపరిచ్ఛేదము. సంపూర్ణంగా వ్రాశాను.

ఇందు గల లేఖవాని శేషములు:-ఇందు వచనము గిడుగువారికి లభించిన ప్రతులలోవలెనే వాడుకభాషగా నున్నది. రేఫకు రేథ అని వ్రాయుట, సాధురేఫ శకటరేఫల విభేదము లేకుండుట. శకటరేఫపదజ్ఞానపీఠమాలికమాత్రము శకటరేఫలు గల్గియుండుట. అరసున్నకు నిండుసున్న కొన్నియెడలను బొల్లినకారము గొన్నియెడలను బొల్లుగకారము కొన్నియెడలను నుండుట, నిండుసున్నకు నిండుసున్నయు గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వమును నుండుట. రేఫసంయుక్తమునకు మీఁదిహల్లునకు వలపలగిలక నిచ్చుట, కొన్నియెడల జ్ఞకారమునకు "గ్న" కారము వ్రాయుట, పెక్కుచోట్ల హ్రస్వాంతములు దీర్ఘాంతములుగా బద్యాంతముల నుండుట. అటనట యడాగమమున్నచోట వడాగమ ముండుట, అనునాసికద్విత్వములకు మారుగా బిందుపూర్వములుగను బిందు వుండియు ద్విత్వ ముండుట. (కంనియ, కంన్నియ, కన్నియ యనుటకు) ఇంకను మఱికొన్ని విశేషములు గలవు గాని స్థలాభావముచే విరమించితిని.



# శ్రీనాథుని యింట విందు

[శ్రవ్య నాటిక]

శ్రీ భావరాజు వేంకటకృష్ణరావు

## మొదటి రంగం

[రాజమహేంద్రవరమున—ఏదువందల సంవత్సరముల క్రిందట—ఒకనాడు శ్రీనాథకవిసార్వభౌముని యింటి ముంగిట—ప్రాంగణమున—ఉదయము పది గడియలవేళ.]

లక్ష్మీధరుడు: దుగ్గనార్యులకు లక్ష్మీధరుడు నమస్కారము లాచరించుచున్నాడు.

దుగ్గన: లక్ష్మీధరుడా? మనోభీష్టసిద్ధి రస్తు. ఇప్పుడేనా నీ రాక? లొల్లనుండి?

లక్ష్మీ: గోదావరిని దాటుట కొంచె మాలస్యమైనది. గాలి వాటముగ లేని కారణమున పడవలను చాలాదూరము త్రెడ్లమీద తీసికొనివచ్చిరి. సగము దూరము వచ్చుసరికి తూర్పుగాలి అందుకొనెను. రుద్రపాదములవద్ద దిగి, అఘమర్షణస్నాన మాచరించి, మార్కండేయశివుని అర్చించి వచ్చుచున్నాను. గురుపాదు లెచ్చట నున్నారు?

దుగ్గన: మరచితివా యేమి? లక్ష్మీధరా! నేడు శ్రీనాథభట్టు కవిసార్వభౌముల జన్మదినము. ఉదయమునుండియు వారు శివార్చనయందు నిమగ్నులై యున్నారు.

లక్ష్మీ: మరువలేదు. ఈ వేడుక లంతయు అందుకొఱకే. మా గురువుగారు వీరభద్రవేమభూపాలుర విద్యాధికారులైన నాటనుండి సామంతనృప, మహామంత్రి పదచిహ్నములైన అరటిచెట్లతో గృహప్రాంగణమును, శ్రీద్వారములతో చలువపందిళ్లను అలంకరించుట అలవాటయినది. అనంతవిలాసముగల వారు మా గురువరేణ్యులు.

దుగ్గన: బావగారు, అక్కగారును ఉదయము బ్రాహ్మముహూర్తపు వేళనుండి మహేశ్వరార్చన దీక్షలో నున్నారు. వారితో మాటాడుటకు వీలులేదు. ఇపు డెంత ప్రొద్దెక్కినది? పది గడియ లైనట్లున్నది. ఇంకొక గడియలోపల హోమాదులు సమాప్తిచేసికొని పూజాగృహమునుండి వెలువడగలరు.

లక్ష్మీ: లక్ష్మీధరుడు అనుకున్న నాటికి రాలేడని అడిగినారు కాబోలు గురువుగారు?

దుగ్గన: ఒకసారి గాదు. నిన్నరాత్రి శయనించులోపల రెండుమూడు సారు లడిగినారు.

లక్ష్మీ: నాయపరాధమును మన్నింతురుగాక. శిష్యులు మా గురుసార్వభౌముల కెందరున్నను లక్ష్మీధరునిపై సాదరాభిమానములు మెండు.

దుగ్గన: శ్రీనాథభట్టోపాధ్యాయులకు అందరి యందుకంటె నీయం దించుక శిష్యవాత్సల్యము హెచ్చు. ఆయనకవితారచనను, ఊహ తెలిసికొని గంటముతో తాటియాకుమీద వడివడిగ వ్రాయగల్గుదువని నిన్ను మెచ్చుకొందురు.

లక్ష్మీ: అవిశేషము గురుకృపామహిమవలన గల్గెను. నా కేమి కర్తవ్యమును నియోగించిరో గురువుగారు?

దుగ్గన: ఆ మహానుభావుని తలంపు, గాంభీర్య మెవ్వరెఱుగగలరు? నేడు తనజన్మదినోత్సవమని బావగారు రాజమహేంద్రపురకవీంద్రసమాజమునకు విద్వజ్జనములకు విందుచేయ తలపెట్టినారు.

లక్ష్మీ: సన్నాహ మంతయు సాగినట్లున్నదే. అదిగో వటువులు, బ్రాహ్మణకుమారులు అటునిటు కార్యార్థులై పరుగిడుచు ఏవో సంభారములను, సామ

ద్రాక్షలను, మామిడిపండ్లను, రంభా, పనస, నారికేళఫలము లను బయటనుండి తెప్పించి చేర వేయుచున్నారు.

దుగ్గన : ఇంకొక విశేషము. జగద్గురుబిరుదాంచితులగు శ్రీ బెండపూడి అన్నయమంత్రిశేఖరులను కవిసార్వభౌములు ప్రత్యేకముగ నాహ్వానించియున్నారు. వారుకూడ వేంచేయుదురు.

లక్ష్మీ : మాకవిరాజుకీ జన్మదినోత్సవమున రాజమహేంద్రపురమున విందుచేసి సన్మానించు పుణ్యాత్ముడొక్కడును లేడు.

దుగ్గన : లక్ష్మీధరా, లేకేమి, ఉందురు. ఉన్నారు. నీవు కవిరాజహృదయమును ఎఱుగజాలకున్నావు.

లక్ష్మీ : గురువుగారికి నావలన కావలసిన కార్యమేదో ముఖ్యమయినది ఉండవలయును. లోనికిబోయి దర్శనము చేసికొందును.

దుగ్గన : లేకేమి. ఉండును. కాని వారి శివార్చన ముగియకుండ ఎట్లు దర్శనముచేసికొనగలుగుదువు ?

లక్ష్మీ : దుగ్గనమంత్రీ, గురుసందర్శన కౌతుకమున నట్లంటిని. మా గురువుగారి సాటి అన్యులకు రాదు. అట్టి మహనీయుడింతకు పూర్వము జన్మింపలేదు. భవిష్యత్కాలమున జన్మింపడు. మహాత్ములు వారు. నా యీడుకు వారఖండతపస్సంపన్నులు, బ్రాహ్మీదత్తవరప్రసాదులు. బ్రహ్మజ్ఞాననిధాన మయిన వారు.

(లోపలినుండి రుద్రనమకము వినబడుచుండును)

దుగ్గన : శివార్చన ముగియువేళ సమీపించుచున్నట్లున్నది.

(లోపలనుండి రుద్రం వినబడును.)

"నమో భవాయచ రుద్రాయ చ నమ శ్శర్వాయ చ పశుపతయే చ నమో నీలగ్రీవాయ చ శితికంఠాయ చ నమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ నమ స్సహస్రాక్షాయచ శతధన్వనే చ నమో గిరిశాయ చ శిపివిష్టాయ చ నమో మీఢుష్టమాయ..."

లక్ష్మీ : గురువుగారు శివతాండవనృత్యం చేయుచున్నట్లున్నది.

(మరల రుద్రనమకం)

నమో జ్యేష్ఠాయ చ నమః కనిష్ఠాయచ నమః పూర్వజాయచాపరజాయచ నమో మధ్యమాయ చ ప్రగల్భాయ నమః'

(లోపలనుండి జేగంటల ధ్వని. పిమ్మట)

శ్రీనాథుడు :

నీవ పరబ్రహ్మంబవు
నీ వఖిలాండైకపతివి నీవు ప్రసన్న
శ్రీ విభవారోగ్యయుః
ప్రావీణ్యప్రాభవైక ఫలదుడవు శివా.
నిన్ను త్రిజగన్నివాసుని
బన్నగకంకణుని భక్తపరతంత్రుని న
భ్యున్నతకరుణాగుణసం
పన్నుని గనుగొంటి మంటి బాలేందుధరా.
నీచేత, కృపానిధిచే
వాచాగోచరవివేకవై యాత్మునిచే
నో చంద్రకలాశేఖర
యాచించి మనోరథార్థ మర్థిం గందున్.

(లోపలనుండి జేగంటల ధ్వని, తాండవనృత్య ధ్వని. నిశ్శబ్దమంతట. అయిదు క్షణముల పిమ్మట మంత్రపుష్పము.)

ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః, ఓం తదాత్మా...
త్వంయజ్ఞ స్త్వం వషట్కార స్త్వ మింద్ర స్త్వగ్ం...
రుద్ర స్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః...
భూర్భువస్సువరోం, బ్రహ్మ శివో మే అస్తు సదాశివోం.

దుగ్గన : మంత్రపుష్పసమర్పణము జరుగుతున్నది.

లక్ష్మీ : గురువర్యు లీవలకు వచ్చు వేళ చూచి రుద్రమూర్తియైనవారికి సాష్టాంగనమస్కార మాచరింతును.

శ్రీనాథుడు : దుగ్గనమంత్రీ! ఎవరక్కడ...తొా

మునుండి అరటియాకులు వచ్చినవా ? ఎవ్వరును లేరా ఇచ్చట ? దుగ్గనమంత్రీ.

దుగ్గన : ఇదిగో వచ్చుచున్నాను.

శ్రీనాథుడు : భావా, నేడుకూడ లక్ష్మీధరుడు రాలేదుగా ! చిరంజీవి కనివార్యకారణ ముండును, రాకుండుటకు.

దుగ్గన : ఇప్పుడే—ఒక అరగడియ యైనది. వచ్చినాడు. మీ దర్శనార్థము...

లక్ష్మీ : గురుసార్వభౌముల పాదకమలములకు సాష్టాంగనమస్కారము లాచరించుచున్నాడు లక్ష్మీధరుడు.

శ్రీనాథుడు : వచ్చితివా నాయనా, దీర్ఘాయురస్తు. మనోవాంఛాఫలసిద్ధిరస్తు. ఆరోగ్యమస్తు. నీకును వృద్ధులైన నీ జననీజనకులకును ఎల్లవారికిని సేమము కదా ? నీరాకకై ప్రతిక్షణమును నిరీక్షించుచున్నాను.

లక్ష్మీ : భవదీయకృపావిశేషము.

శ్రీనాథుడు : దుగ్గనమంత్రీ, సమస్తము ఆయత్తమైయున్నదికదా. నీ ధౌరంధర్యమున ఎల్లరును అప్రమత్తులై యుందురు. అదిగో సింగనతిల్లనలు వచ్చుచున్నారు. వారి వైఖరి చూడ సర్వము ఆయత్తమైనట్లున్నది. నా చిత్తమున కెక్కినరీతి భోజనశాలను సిద్ధపఱచియుందురు.

సింగ,తిల్లన : చిత్తము, చిత్తము (ఒక్కసారిగా)

లక్ష్మీ : చిత్తము. గురువుగారు అనంతభోగలీలాస్పదులు, సిద్ధసంకల్పులు.

(రెండవఘట్టము - అచ్చోటనే.)

సోమన : దుగ్గనార్యా, భావగా రెక్కడ ? అక్కగారు చూచిరమ్మనినారు.

దుగ్గ : లక్ష్మీధరుడును వారు కలసి యిప్పుడే లోనికరిగినారు. సింగనా, ఎక్కడకు పోవుచున్నావు ? ఇటు రమ్ము, అతిథులు వచ్చు వేళ యగుచున్నది. మీ రిరువురును మొగసాల నిలిచియుండి అతిథుల నర్చించి లోనికి తోడ్కొనిరండు. వటుకుమారు లెక్కడ ?

సింగ : ఎల్లరు ఆయత్తులై యున్నారు. భావగారు—

దుగ్గన : అతిథులై వచ్చినవారిని ఆకసమున గూర్చుండబెట్టి పాదప్రక్షాళనమో, స్నానమో గావించి, పిండికట్టిన మడుగుకావిధోవతులను గట్టనిండు. అలంకరణార్థము గంధాక్షతలను సిద్ధము చేయింపుడు.

సోమన : అన్నగారు రాజమహేంద్రపురకవీంద్రసామాజికులకు విద్వజ్జనములకు బోధ మల్పంబు, గర్వమభ్యున్నతంబు, కాంతి నిష్ప్రచురంబు, మచ్చరము ఘనము, కూపమండూకముల బోలె గొంచెమెరిగి, పండితమ్మన్యులైన వైతండికులకు — భావగారెంతకింత అట్టహాసముగ విందుచేయుచున్నారు.

దుగ్గన : సోమా, నీ వూహింపజాలని విశేషమేమి కలదయ్యా ! శ్రీనాథభట్టు సుకవి బహుదేశములు జూచినారు. బహుదేశబుధులతో భాషించిన మనీషివారు. అఖిలరాజాస్థానములందు మన్ననలందిన ఘనులువారు. వెదజల్లినారు విశదకీర్తిమూర్తికర్పూరఖండములను దిశాంగణములందు — భావగారి యూహలు, భావగారి తలంపులు మన కెట్లు తెలియును ?

సింగ : అదిగో శ్రీపతి, శ్రీధరారాధ్యులు వచ్చుచున్నారు. రూపము గొన్న తర్కవ్యాయశాస్త్రములు.

దుగ్గన : శ్రీధరుడు కవిగూడ, ఎఱుగవు నీవు ! తొమ్మన, చూడు, ముందుకుబొమ్ము. ఆ వచ్చునది గంగాధర ఘటశాస్త్రి; ఈ యారి ఘటికాస్థానమున కధ్యక్షుడు. మీమాంసకగురువు.

సింగ : కొండ్రాడ్డి భూమీశునకు ఆప్తుడు. నిశ్శంక కొమ్మనామాత్య కవి వచ్చుచున్నారు. వారి ప్రక్కనున్న దెవరు ?

దుగ్గన : మధువనభట్టు. వారివెనుక మల్లన మంత్రి. వారిరువును కాళిదాస భారవులను బోలిన కవులని వారి నమ్మకము.

సోమన : ఎప్పుడైన నొక్క శ్లోకమునుగాని, యొక్క పద్యమునుగాని వారు రచించినట్లు నేనెఱుగను.

దుగ్గన : గట్టిగా మాట్లాడకుము. వారికి వినబడ గలదు నీ విమర్శనము.

సింగ : ఆయన చాటు రచనలను వింటిని కొన్నింటిని.

దుగ్గన : ఆ వచ్చునది కుమారశర్మ. ఆ వెనుక నరహరిభట్టు. అభినవ బాణభట్టని ప్రసిద్ధి. వారిరువు రుభయభాషాకావ్యరచనాశోభితులు. నరహరిమృత్యుంజయవిలాసమని మార్కండేయశివుని మహాత్మ్యము వర్ణించుచు ప్రౌఢరచన గావించినాడు.

కొమ్మ : అన్నంభట్టు, తిల్లనమంత్రులు.

సింగ : వీరిలో ఎవ్వరిని తలపులో బెట్టుకొని, ఏపండితమ్మన్యుని ఉద్దేశించి శ్రీగురువుగారు బోధ మల్పంబు అని పద్యము చెప్పినారు?

దుగ్గన : షూ్.

సోమన : శ్రీపతితిల్లనమంత్రి, నరహరిభట్టులు కవిసార్వభౌముని కవిత్వమును మాత్సర్యముతో ఆక్షేపించినారు ఆనాడు రాజసభలో. అప్పుడు భావగారు ప్రాణములు విసిగి నీకటమున నుండి శ్రుతిపుటు నిష్ఠుర ముగ నడవి కాకులు బట్టు పెద్దలైన చప్పు డుడిగి రాయంచ యూరక యుండుట లెస్స; సైపరాకున్న నెందేని జనుట యొప్పు—అని అన్నారు.

సింగన : ఆనాడు విద్వజ్జనములు పరివేష్టించి యుండ మధువవకవి యధిక్షేపించినాడు. నీభాష ఆంధ్రముగాదు; నీ కవిత్వంబు కర్ణాటభాషయని.

సోమన : కవిసార్వభౌములు వెంటనే యా మనీషాలవదుర్విదగ్ధుని జూచి ధిక్కారముతో—

"ప్రౌఢి పరికింప సంస్కృతభాషయండ్రు
పలుకు నుడికారమున నంధ్రభాషయండ్రు
ఎవ్వ రేమన్న నండ్రుగా కేల కొఱత
నా కవిత్వంబు నిజము కర్ణాటభాష."

అని గర్జించుచున్నాడు.

దుగ్గన : లోపల గంధాక్షతలను ఇచ్చుచున్న ట్లున్నారు. ఆహ్వానించిన విందలందరు వచ్చినట్లున్నది. అరటియాకులు పఱచినట్లున్నారు.

(శాంతిపాఠము వినబడుచుండును. అన్న నూక్తములు)

సింగన: మహామంత్రులవా రింకను రాలేరు.

దుగ్గన : సరిగా వారు పండ్రెండుగంటలకు వేంచేయుదురు......వినుడు వినుడు. దుర్గము దక్షిణ గోపురద్వారమున గడియారము గంటలు వినబడు చున్నవి. రెండార్లు గాబలయును.

కొమ్మన : కోలాహలము వినబడుచున్నది. మంగళ వాయిద్యములు వినవచ్చుచున్నవి. మహామంత్రుల వారు వేంచేయుచున్నారు. అదిగో శ్రీద్వారము, సింధము, కుంతములు, ఆతపత్రములు— జగజ్జేగీయ మానంగా ఉన్నది దృశ్యము. సింగనా, ఎక్కడ నీవు? అందలము దింపుచున్నారు.

సింగన : అవనీభారధురీణరిపుసై వాల్యభీకీ, ధీకీర్తివైభవలీలాజితకావ్య, కావ్యరచనాపారీణ తావాస, వాసవభోగప్రతిమాన, మాన వినయాచారార్థ సంభార, భారవిసంకాశమహాకవీంద్ర పరిమత్ప్రిస్తా యమానోదయా.

(నృత్య సంగీతము వినబడుచుండును)

శ్రీనా : జగనొబ్బగండ అన్నసచివేంద్రునకు అభివాదము. పరమహర్ష మగుచున్నది. అమాత్యశేఖరుల రాక. ఇది యొక కృపావిశేషము.

అన్న : కవిసార్వభౌమా! పాకనాటివాడవు, బాంధవుడు, వేములవాడుని మనుమడవు. మీ యింటికి విందనై వచ్చుట ఒకపాటి కృపావిశేషమా.

శ్రీనా: దుగ్గనమంత్రీ! ఉన్నతపీఠమున కూర్చుండ బెట్టి పాదప్రక్షాళనము చేయింపుము. (మెల్లగా) హేమపాత్రాచయము వచ్చియున్నదా? పీచోపులు వీచుటకు విప్రకుమారులు...

దుగ్గన : మీ రానతిచ్చిన తెఱగున...

శ్రీనా : సింగన, కొమ్మన మహామంత్రులకు త్రోవచూపుడు.

(కాపవరఘట్టము భోజనశాల)

..................

(శాంతిపాఠము, అన్న సూక్తము చదువు చుందురు).

దుగ్గన: సింగా, లక్ష్మీధరు డెక్కడ? పాత్ర సంశుద్ధికార్యము గాంచివారుగద! వృద్ధసీమంతిను లను వటుకుమారులను వడ్డన ప్రారంభింపమని కనుసన్న చేయుము.

లక్ష్మీ: పరిమళహిమాంబువులతో పాత్రలను పంక్తినడుమ నిలబడి క్షేత్రపాలప్రాగ్వకముగా వందిం పుడు. వడ్డనగూడ నట్లే.

సింగ: పుష్పమాలలతో అతిథుల కంఠసీమల నలంకరింపుడు. ఇది వేసవికాలమని మరువకుడు. తాల వృంతములను బట్టుకొని చల్లని గాలి వీచుచుండుడు.

దుగ్గన: బావగారు అన్నమాత్యుల చెంతగా గూర్చుండదలచినారు. కవిసార్వభౌములకు గూడ అమాత్యశేఖరులతోపాటు హేమపాత్ర లుంచుడు. హిమాంబువులు వడ్డించుడు. వడ్డన ప్రశాంతముగ, పెల్లిగా జరుగవలయును.

లక్ష్మీ: దుగ్గనార్యా, వడ్డనలు పూర్తియైనవి.

దుగ్గన: కప్పురభోగములును, కలమాన్నములును, దివ్యాన్నములను మూడింటిని వడ్డించితిరిగద.

లక్ష్మీ: సిద్ధముచేసిన పదార్థము లన్నియు వడ్డిం చుటకు మూడుమూరల పొడవుగల యురటియాకులు చాలకున్నవి.

సింగ: బావగారితో మహేశ్వరార్చనము సాగింపవచ్చునని మనవిచేయుడు.

శ్రీనా: ఓం. జయజయ. కంఠేకాలా
మహానటా, హరా, భవా సర్వజ్ఞా
జయజయ విరూపాక్షా, రాజశేఖరా.
జయజయ
జ్యోతిర్లింగమయ మంగళాకార
జయజయ భక్తభావనా సులభస్వ
భావనాతీత పావనాకారధావళ్య
విగ్రహా, శ్రీమన్మహాదేవ.
జయజయ దేవతారాధ్య, ఆపద్ధ్వాంత
దివాకరా, పరమదయాకరా.
జయజయ శ్రీ పరమమాహేశ్వరా!
నమస్తే నమస్తే నమః.

లక్ష్మీ: గురుదేవుని శివభక్త్యావేశలీలార్చితిః స్వయంభువునైన పరమమాహేశ్వరునివలె ప్రకాశించు చున్నారు.

తెల్లనమంత్రి— మాకు నరహరిభట్టు, కవిసార్వ భౌముడు సాక్షాత్ పాశుపత దీక్షామూర్తి గైకొనినట్లు వెలుగుచున్నాడు.

నరహరి: కన్నులపండువుగా నున్నది ఆ సుంద రమైన యాకారరేఖ. అర్ధచంద్రునివలె నున్న ఆఫాల భాగముపై విభూతిరేఖలు, నీర్కావిమడుగు, శరీరము నిండ అలదిన కమ్మనిభసితం, పెదదముత్యములతో నెన కట్టి గ్రుచ్చిన మంచిరుద్రాక్షమాలలు.

దుగ్గన: హర, హర, మహేశా.
హరహర మహేశ, విరూపాక్ష.

సింగన: ఆపోశనంబులు పట్టుడు.

దుగ్గన: ఆపోశనంబులు పట్టుడు. అమృత మస్తని ఆరగింపుడు.

మధువన: నరహరిభట్టు, అన్నయమంత్రిగారికి ఆపోశనము వడ్డించుచున్న ఆ పురంధ్రియెవ్వరు?

నరహరి: ద్వీపాంతమునుండి వచ్చితిరా మధు వనకవీంద్రా.

మల్లన: అంతమాత్రము ఎఱుంగలేకున్నారా. ముందు భర్తగారికి ఆపోశనము వడ్డించి అమృతమస్తు అని, అన్నామాత్యులకుకూడ భర్తపనుపున ఆపోశన మిచ్చుచున్న ఆ మహాసాధ్వీమణి కవిసార్వభౌముని గారాబుటిల్లాలు.

మధువన: అహో, మహాభాగ్యము, సంధ్యారా గమువంటి చాయగల చీనాంబరము గట్టి, కీల్కొప్పు గర్భమంతు ఏల్లికొకుసుమములు గుత్తి సమరించిన యా ముత్తైదువను జూచిన చేమొడ్పు ఘటియిల్లు. అట్టి పుణ్యాంగనను భార్యగా బడసిన గృహమేధిఫలము దక్కిన కవిసార్వభౌముని భాగ్యమెంతని వర్ణింప గలము?

దుగ్గన : పూజ్యులయిన మీ కొక విన్నపము చేయవలసిన దని కవిసార్వభౌము లానతిచ్చుచున్నారు. ప్రొద్దుపోయినది, మందగతిని మందగతిని పన్నాభ్యులై భుజియింపుడు, ఆరగింపుడు అని.

మల్లి : ఆపండి, ఆపండి, ఆజ్యధారాప్రవాహా మును. ఏమి పరిమళము! క్రొన్నెయి.

సీమంతిని : తమకు పాయసము.

వటువు : తమకు పాయసములోనికి ఆజ్యధార,

ముక్తై : దివ్యాన్నములు, కలమాన్నములు, కప్పురభోగములు, ఏది వడ్డించమందురు?

వటువు : తమకు మామిడిపండ్లు, ఇక్షుఖండ ములు, ఇక్షురసములు, వీటిని వడ్డింతునా. తమకు? తమకు?

లక్ష్మీ : ప్రొద్దుపోయినది. మందగతిని భుజిం పుడు.

సీమం : తమకు శాలింపు సొజ్జపిండి.

సీమం ౨ : తమకు పిండివంటకములు.

వటువు : తమకు రంభాఫలములు, కొమ్మనటి పండ్లు, అమృతకలశములు, శర్కరకదళీలు. తమకు?

సీమంతిని : తమకు దివ్యాన్నములు. కలమాన్న ములు. కప్పురభోగములు. తమకు?

వటువు : తమకు ఖర్జూరపనసతొనలు. నారికేళ పనసతొనలు.

సీమంతి : తమకు క్రొన్నెయి క్రొన్నెయి.

సీమం ౨ : తమకు పదార్థములు. పద్రసీపా మగ్రి.

సీమం ౩ . తమకు పచ్చడులు. పద్రసీపామ గ్రితో తాలబోసిన పచ్చడులు.

వటువు ౩ : తమకు వడియములు, చేడలు, చక్కిలములు, వరుగులు.

సీమం ౨ : ఇక్కడ ద్రాక్షాపానకము.

సీమం ౧ : తమకు పాడబరపాటలీపాకము.

దుగ్గన : వడ్డించుచున్న వృద్ధసీమంతినులతో వటుకుమారులతో ఎవరి కేపదార్థములు ఎంత వలసిన అంతంత పెల్లగా, ఆగటిగాకుండ, వమరించిన దొన్నెలందు వడ్డించుడని హెచ్చరిక చేయుచు. ... కుమారులైన మా బింగలు మందగతిని మందహాంస గతిని అరగింతురుగాక యని కవిసార్వభౌముని విన్న పము. ...లక్ష్మీధరా, సింగన, కొమ్మన మీమీ పంక్తు లందు వడ్డనలు సరిగా నడచుచున్నవిగదా.

లక్ష్మీ :

వవరించు నెవ్వఁడు జఠరకోశంబునఁ
 జొడవడంగక యుండ భూతగణము
నెరయించు నెవ్వఁడు నిజసహాతపమాయ
 సకలప్రపంచంబు సంతతముగ
నివసించు నెవ్వండు వివిధోపనిషదర్థ
 హార్మ్యశృంగములయందు విహారహాంబు
చరియించు నెవ్వఁడు శాశ్వతమంగళ
 ప్రోద్ధంతురార్భటి నొక్కరుండు
నహహ యయ్యాదిదేవుఁ డనామయుండు
శ్రద్రుఁ డచిచింత్యుఁ డాద్యుఁ డరూపుఁడుండ
నవ్యయంబగు తత్త్వమన దవర్చు
నజాడు ఫాలాక్షు డిందురేఖావతంసుండు.

భోజనకాలే నమః పార్వతీపతే హరహరహర హర. ఓం.

సీమం : తమకు ఇక్షురసము. తమకు నారికేళ జలము. తమకు ద్రాక్షాపానకము.

వటువు : తమకు లడ్డువములు. అపూపములు. తమకు?

సీమం ౨ : తమకు తమకు బూరిగెలు. తమకు ఆజ్యధార.

సీమంతిని ౩: మండెగలు తమకు. ఖండశర్కర?

వటువు : తమకు లడ్డువములు. బూరిగెలు.

సీమంతిని ౨ : గోక్షీరమును కడ్డింపనిండు మండె గలపై, ఖండశర్కరలపై.

వర : లక్ష్మీధరు డెంతటివాడయినాడు! సరు పద్యరచనలను విశృంఖలవృత్తి పాడుచున్నాడు.

వటువు : తమకు మణుగుబూవులు, లడ్డువములు.

మల్లన : పదార్థములు, పిండివంటలు, పాయస

ములు, దివ్యాన్నములు, పండ్లు, రసములు, రసావళీ పాకములు అక్షయమగుచున్నవి యీ అరటిఆకులమీద. ఆరగించుటకు పూర్వము తలపుకలిగినంతమాత్రాన.

గంగాధర: ఈవిందువంటి విందు నేను పుట్టి బుద్ధియెఱిగిన తరువాత నారగింపలేదు. ఇకముం దిట్టి విందును చూడబోము.

తెల్లన: కవిసార్వభౌముడు బహుదేశములు పర్యటించి బహువిధములగు రుచుల నారగించినవాడు. ఇక భోజనోత్సవమునకు లోటేమి గల్గును?

మధువన: ఇంతటి పుట్టుభోగి కావున కాంచిపురమున ద్రావిడుల భోజనమును, కర్ణాటకమున కన్నడ భోజనమును ఏవగించుకొని విలపించినవాడు.

సీమంతిని: ౨ తమకు ఇక్షురసము. మిరియపు పొడి చల్లినది.

సీమంతి ౧: తమకు అపూపములు. పాయసము.

వటువు: తమకు పనసతొనలు. తమకు మామిడి పండ్లు. తమకు రంభాఫలములు, కొమ్మనటిపండ్లు.

సీమంతిని ౧: తమకు [illegible].

సీమంతిని ౨: తమకు పాదబరసావళీపాకము. తమకు ఇప్పుడు తెచ్చిన వెన్నమీగడలు?

శ్రీపతి: ఇది యెట్టులయ్యా. ఏమి, మహాద్భుతమయిన విందగదయ్యా ఇది. ఒక్కొక్కటి చొప్పున వడ్డించిన పదార్థములను చవిచూచుటకైన మా యుదరములు చాలకున్నవే.

సీమంతిని ౧: తమకు పరిమళహిమాంబువులు, పరిమళహిమాంబువులు తమకు?

మధువన: పంక్తిపంక్తికిని నడుమ నిలిచి - కవిసార్వభౌముని ఇల్లాలు తాలవృంతమును ఉభయపార్శ్వములవారికి వీచుచు అన్నపూర్ణాదేవి, కాశీవిశాలాక్షి యవతరించిన విధాన మందగమనయై నడుచుచున్నది.

నరహరి: ఏమి ఆ యిల్లాలి వైభవము!

సీమంతిని: తమకు [illegible], దధి, దధి, [illegible].

దుగ్గన: లక్ష్మీధరా, గురువుల యాజ్ఞ.

* * * *

అన్నయ: శ్రీనాథ సుకవీ. పోయినయేడు శివరాత్రికి మనము ద్రాక్షారామమున కరిగినపుడు సాని కూతు రొకతె ఈశానిరూపిణియై భిక్షాటనము పలికి నృత్యమును వర్ణించితిరి.

శ్రీనాథుడు: లక్ష్మీధరు డాపద్యమును కంఠస్థము చేసినాడు.

లక్ష్మీ:

విరుల దండలతోడి వేణికాభారంబు,
పాంకంబు పిఱుదుల బొరలియాడ
మంజీరులాకోటికోమలరుణత్కారంబు
రవళిమట్టెల మ్రోత యవఘళింప
గుదురునిండిన చిన్ని గుబ్బచన్నులమీద
ముత్యాల త్రిసరంబు మురువుజూప
వలమానతాటంకవజ్రాంకురచ్ఛాయ
లేతవెన్నెలఁ బుక్కిలించి యుమియ
సాని యీశానియై మహోత్సవమునందు
గేల నవచంద్రకాంతిపు గిన్నె పూని
భిక్షభిక్షాటన మొనర్చు వేళ చేయు.
మరాళ నృత్యంబు జగముల మరులుకొలుపు.

దుగ్గన: భోజనకాలే, నమః పార్వతీపతే హరహరహరహర ఓం.

సీమంతిని: తమకు ద్రాక్షాపానకము. తమకు, తమకు?

సీమంతిని ౧: అయ్యా మీగడలు. అయ్యా తమకు దధిఖండము.

తెల్లన: ఇది దధిగాదయ్యా - మీగడ, అంతా మీగడే.

వటువు: తమ కూరుగాయలు. ఇది జంబీరము, ఇది మామిడికాయ, ఇది అడవియుసిరి. ఇది రాచయుసిరి.

వటువు: చారులు, పరిమళముతో నిండిన చారులు.

సీమంతిని ౧: తమకు భక్ష్యసామగ్రితో [illegible] పదార్థములు [illegible]?

సీమంతిని ౨ : తమకు దివ్యాన్నములు. కప్పూర భోగములు. కలమాన్నములు.

వటువు : తనకు పరిమళహిమాంబువులు.

(అవతలనుండి సంగీతము, నృత్యముతోగూడిన సంగీతము వినవచ్చును.)

దుగ్గన : భోజనము లయినట్లున్నవి చూడుము.

సింగన : లేదు. ఆపంక్తియందు దధిఖండములు, గారెలు వడ్డించుచున్నారు.

...ఆపంక్తియందు పానకములు, రసావళీపాకములను ఆరగించుచున్నారు.

...ఆపంక్తియందు ఉత్తరాపోశనము బట్టుటకు సిద్ధముగ నున్నారు. ఈపంక్తియందు భోజనము లయినవి.

కొమ్మన : దుగ్గనార్యా, మొదటినుండి పరికించుచున్నాను. శ్రీపతిమధుకవకపింగ్రులు, నరహరితల్లన మంత్రులు ఏవో గుసగుసలాడుకొనుచున్నారు.

దుగ్గన : నీవేమి విశేషమును గుర్తించితివి?

సింగన : నాదృష్టికి అందరు సుహృష్టులయి విందారగించినట్లు కనిపించినారు.

దుగ్గన : భోజనము లయినట్లున్నవి. అందరు లేచుచున్నారు.

సింగనా, తాళవృంతములను బట్టించుకొనిరమ్ము.

[నాల్గవ ఘట్టము.]

(నృత్యసంగీతములు వినవచ్చుచుండును.)

పతిసైన నీకొఱకు వెలసితి
సౌందర్యసంపద గలిసి
.........
నీతపమ్మునకు నమ్ముడుపోయితి
చేలుకొమ్మ...

శ్రీనాథుడు : విందలు హస్తములు గడుగుకొని యాచమనక్రియ గావించి ఇటే వచ్చుచున్నారు. దుగ్గనమంత్రీ. మొగసాలయందు చలువపందిటిక్రిందట కట్టికేళ్ల పందిటిక్రింద రత్నకంబళములు పఱచియుంచినారు. వారి నందరి నక్కడికి వెంచేయ త్రోవ చూపుడు.

(అచ్చరకన్నెలు తాంబూలములను మడుపుల దీర్చి సిద్ధముచేసినారు. నృత్యసంగీతములు, వీణావాయిద్యము వినబడుచుండును)

శ్రీధరు : శ్రీనాథకవిసార్వభౌముడు నిక్కముగ రసికాగ్రేసరుడు. కవిచక్రవర్తి.

నరహరి : ఏమి యీ పరిమళవాసనాలహరి. కస్తూరి, కర్పూర, గంధ, నీహారసౌరభము.

దుగ్గన : ఈ మెత్తని ఆసనములందు విశ్రమింపుడు.

(గంధర్వాంగనలు పాడుచుందురు.)

జయజయ పార్వతీమనోహర.

జయజయ పరమానంద

జయజయ అనవద్యనిత్య.

జయజయ నిజభక్తవైకుంఠ.

దుగ్గన : సింగనార్య, జ్యేష్ఠానుపూర్వకముగా కుంకుమాగురుకస్తూరిగంధపంకమును ఈ విద్వజ్జనులకు, ఈకవిపుంగవులకు అప్సరవధూటులు అలదుదురుగాక.

లక్ష్మి : దుగ్గనమంత్రీ, దివ్యలోకసౌరభము, ఈ కస్తూరితావి, కస్తూరీఘనసారగంధముల పరిమళము.

నర : ఓసి ముద్దరాలా. చాలును చాలు చాలు, ఈవాసనలు వారముదినములవఱకు నిలచియుండును. ఛాందసుడనై కడిగికొన్నను మాయవు.

తల్లన : మధువనకవిని చూడుము కొమ్మనమంత్రీ. ఆ చిఱునగవు. ఆ ఆనందాతిశయమును చూడుము.

లక్ష్మి : వింత ఏమున్నది కవీ, గంధము వలదుచుండ ఆ పూబోణి, సుఖపారవశ్యము ననుభవించుచున్నాడు.

శ్రీపతి : నీరజాక్షిపూలమాలతో కూడ తన కన్నులను ఆకనికిగచుట్టును తిప్పుచు అలంకరించుచున్నది.

శ్రీ : చూడవయ్యా ఆ మడుపులందుకొను విలాసము చిగురుబోడిహస్తాగ్రములనుండి.

నరహరి : నిన్నుమాత్రము అట్టి సుఖానంద పారవశ్యము ననుభవింపవద్దని యెవరు నిషేధించినారు?

తిల్లన : దివ్యాప్సరసలవంటి వారవధూటులు వీరు దక్షవాటినుండి వచ్చియుందురు.

లక్ష్మి : శ్రీనాథభట్టారకులు స్వయముగ దక్షవాటివాగపోతి అను గంధర్వభామినిచేత వేమనం శ్రీశ్వరుని గారాబుమంత్రికి గంధకర్పూరకస్తూరినీహార కర్దమమును బాహావులను, వక్షస్థలమునకు పూయించుచున్నాడు దగ్గర నూర్చుండియు, ఏమియు ఎఱుగని యట్లు.

తిల్లన : పరాయత్తచిత్తముతో నున్నాడవు. నీకందించు మడుపులను గ్రహింపకున్నావు.

శ్రీ.రు : పిలచిన విందుకు ప్రతియొక్కనికి పరిమళద్రవ్యము లందింపను, తాంబూలపు మడుపు లందివ్వను ఈ కళావతుల నెక్కడనుండి గొనివచ్చినాడు శ్రీనాథుడు? అన్నయమంత్రిశేఖరుఁడు శ్రీనాథకవితో నేదియో చతురోక్తు లాడుచున్నారు.

అన్న : శ్రీనాథకవివరేణ్యా, మీ సాహిత్యసౌష్ఠవ కవనము లెంత ప్రౌఢములో మీ రసికతయు నంత ప్రౌఢమయినది.

శ్రీ : మీ సౌమనస్య మట్టిది దేవా!

మల్లన : నృత్యము చేయుచున్న ఆ నీరజాక్షిని చూడుము తిల్లనకవీ. ఇందునిభాస్యచెమట చెక్కుటద్దములందు గ్రమ్మి మృగనాభిపత్రమును భంగపఱచుచున్నది.

శ్రీపతి : చంద్రవదనయే యా వధూటి. పన్నీటితో మేళవించిన చందనద్రవ మింపయ్యెను చూడుము. ఆ మెంతతీమునకు.

లక్ష్మి : మహామంత్రులవారు లేచుచున్నారు. అందలము నాయత్తముచేసి తెచ్చినారు.

(కాహళాది మంగళతూర్యనాదములు.)

నరహరి : అందు లొక్కరొక్కరే శ్రీనాథకవిశేఖరుని మన్ననలను గైకొనిరి. తాలవృంతములతో నరుగుచున్నారు. తిల్లనకవీ, ఎచ్చట నున్నారు లెండు.

కవిసార్వభౌముడు ఇటు వచ్చుచున్నారు.

జయ సర్వేశ్వర జయ సర్వలోకజనకా
జయ సర్వేశ్వర జయ సర్వలోకజనకా
జయ శైలేంద్రజావల్లభ జయగిరీశా
జయ దక్షాధ్వరమర్దనా జయ మహేశా
కామితార్థఫలదా, యీశ, రక్షింపవే.



# పల్లెపక్క పిల్లకాలువ

శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

తెల్లు తెలితెలిపూలు
వెల్లివిరిసిన ఎడద
సుడులతో వడులతో
ముడివిడిన నడలతో
పల్లెప్రక్కన దుడుకు
పిల్లకాలువ నేనె !
ఎల్లకాలము మాట
లేమోను
ఈనాటి నాబ్రతుకు
నిజమేను !

అలలలో చిరుకలలు
మలపుల్లో మైకాలు
అడుగడుగు పదుగుల్లు
ఒదుగుల్లు వోవుచూ
పల్లెప్రక్కన పరుగు
పిల్లకాలువ నేను
ఎల్లకాలము మాట
లేమోను
ఈనాడు యీబ్రతుకు
త్రుళ్లేను !

పంటమడిగట్టు నే
పల్లెపడుచుపదాల
గండిలో ఇల్లాలి
గుండె వెచ్చని సొదల
పల్లెప్రక్కన ఉలియు
పిల్లకాలువను...
ఎల్లకాలము మాట
లేమోను
మబ్బువానకు విరిసి
మొరసేను !

---



‘అద్దరి’

# పరకీయ

[ఏకాంకిక]

శ్రీ పాకల వేంకటరాజమన్నారు

పాత్రలు:

బ్రహ్మానందం
ప్రభ—అతని భార్య
సత్యం, మోహన్ రావు—అతని స్నేహితులు
కృష్ణరావు—డాక్టరు
బండివాడు.

[ఏలూరులో బ్రహ్మానందం ఇంట్లో గది. ఇంగ్లీషులో చెప్తే 'డ్రాయింగురూము' అనవచ్చును. మధ్యన బల్ల, చుట్టు నాలుగు కుర్చీలు. బల్ల ఎందుకైనా ఉపయోగించుకోవచ్చును—కాఫీ, టీ పుచ్చుకోడానికి, పేకాట ఆడుకోడానికి, ఉత్తరాలవీ వ్రాసుకోవడానికి, పుస్తకాలు, పత్రికలు పడేయడానికి. ఒకమూల మంచం. ఇంకోమూల ఇంటిలోపలికి వెళ్లడానికి తలుపు. రంగంకుడివైపున వీథిలోకి వెళ్ళడానికి తలుపు.

బ్రహ్మానందం, సత్యం కూర్చున్నారు. బ్రహ్మానందం ఏలూరులో స్కూలుమాష్టరు. 30 ఏండ్లవాడు. అవయవాలలో ఏమీ లోటు కనిపించదుగాని, ముఖంలో తేజస్సు లేదు, ఆరిపోయిన పొయ్యిలాగ... సత్యం కూడా అవయస్సువాడే. లోకజ్ఞానం గలవాడుగా కనబడతాడు. చర్మం గట్టిపడింది. మద్రాసులో ఏదో కంపెనీవారి ఏజెంటు. పనిమీద ఏలూరు వచ్చాడు. సిగరెట్టు తాగుతున్నాడు.]

బ్రహ్మ—అయితే, సత్యం, ఏలూరు వచ్చి మూడు రోజులైందా? ఇప్పటికి జ్ఞాపకం వచ్చానన్నమాట.

సత్యం—కాదురా. వచ్చినరోజు చాలా అలసిపోయి, ఎక్కడా కదలబుద్ధి వెయ్యలే. నిన్న పని ముగించుకొని ఇక్కడికే వస్తామనుకొని బయలుదేరాను దారిలో హఠాత్తుగా మోహనరావు కనబడ్డాడు. చూచి చాలాకాలమైంది కదూ. హలో అంటే హలో అనుకొన్నాక, "ఎంతకాలానికి కలుసుకున్నాం" అని అన్నాను. అనగానే, వాడు "అవున్రా. ఇది సుదినం. కనుక ఉచితరీత్యా గౌరవించాలి మంతో వంగా. రా. నాకు ఆకలి అవుతూవుంది. హోటల్లో పార్టీ చేద్దాం"అని నా అడుగులు తిప్పివేసి లాగుకొని వెళ్లాడు. అంత అమాయకంగా అడుగుతూవుంటే ఎలా అడ్డు చెప్పను? సరే. హోటల్, అపైని శాకాహారీ... ఈరోజు విఘ్నం లేకుండా పెందలకడే వచ్చేశాను, స్కూలు సెలవుకదా అని.

బ్రహ్మ—అరే! మోహన్ ఈవూర్లో వున్నాడా? ఉండికూడా ఒక్కరోజైనా మాఇంటికి వచ్చాడు కాదే! అంత స్నేహంగా వుండేవాడు.

సత్యం—ఈవూర్లో వున్నాడంటే, నిన్న ఉన్నాడు. ఈరోజు ఉంటాడోలేదో, వాడికి నిలకడ

కూడానా? పదిరోజులొకచోట ఊర్లో ఉండవలసివస్తే ప్రాణత్యాగం చేసుకొంటాడు.

బ్రహ్మ—ఒక్కరోజు అయితేమాత్రం! నాకు ఈఊర్లో ఉద్యోగమని తెలుసునే. మూడుమాసాల క్రితం తన ఖండకావ్యసంపుటి నాకు పంపాడే?

సత్యం— (ఆలోచించి) నీకు వివాహమైంది తెలుసునా వాడికి?

బ్రహ్మ—తెలియకేం? అసలు నాభార్యది కూడా బందరు. వాడి ఊరే.

సత్యం—అయితే నాకు ఒక కారణం స్ఫురిస్తూవుంది. భార్యతో సుఖంగా నీవు గౌరవంగా కాపురం చేస్తున్నావుకదా. ఎందుకు తనలాటివాడు మర్యాదస్థులింటికి రావడం అని మానివేసివుంటాడు.

బ్రహ్మ—ఏమిటోయి విపరీతంగా మాట్లాడుతున్నావు. వాడికి త్రాగడం అలవాటు మనం కాలేజీలో వున్నప్పుడే ఉండేది. అంతమాత్రానికేనా...

సత్యం—(నవ్వి) అయితే నీకు వాడి చరిత్ర అంతా తెలియదన్నమాట. వాడికి పెండ్లి అయింది తెలుసూ?

బ్రహ్మ—(తెలియదని తల ఆడించును.)

సత్యం—చిన్నప్పుడే అయింది. కాపరానికి వచ్చిన మూడోరోజే భార్యతో చెప్పాడు—"నీతో జీవితం నాకు మృత్యువుతో సమానం. నీ కేమీ తప్పు చెయ్యలేను. వీలుంటే నీవు ఇంకొకర్ని వివాహంచేసుకోవడం నాకు సమ్మతమే. నా ఆస్తి కావలిస్తే, నీకు రాయమని నాన్నగారితో చెప్తాను" అని, అలాగే తండ్రితో కూడా చెప్పి, వెలతిరగకముందే, గిర్నింక వారి కోడల్తో లేచిపోయాడు. వాడి తండ్రి శుద్ధఛాందసుడు. మండిపడి ఆస్తిలో సగం కోడలికిన్నీ, ఇంకొక సగం ట్రస్టీలకూ వప్పచెప్పి, మాసానికి వందరూపాయలు కొడుక్కి ఇప్పించవలసినదిగానూ విల్లువ్రాసి, పాపం, స్వర్గం చేరుకున్నాడు.

బ్రహ్మ—ఎంత గ్రంథం! అయితే మోహన్, ఇప్పుడు ఆవిడతోనే...

సత్యం—అదృష్టవశాత్తు ఆవిడ త్వరలోనే చచ్చిపోయింది. ఎంత కష్టపడ్డదో. అఖండమైన ఆనందం అనుభవించిం వంటాడు వాడు మాత్రం.

బ్రహ్మ—ఆ తరవాత?

సత్యం—నిరంతర సంచారం, హోటల్లో భోజనం, స్టేషన్లో పడక. చేతులో డబ్బుంటే బ్రాందీసాపు, లేదా, పానికొంప. వాడు మర్యాదగా కాలం గడుపుతున్న నీయింటికి వస్తే నీవేమనుకొంటావో అని జంకితే ఆశ్చర్యమేముంది?

బ్రహ్మ—పాపం! జీవనోపాయం?

సత్యం—చెప్పలేదూ? తండ్రివిల్లుప్రకారం ప్రతిమాసం ౧౦౦ రూపాయలు ట్రస్టీలు ఇస్తారు. ఆ వందరూపాయలు ఏ పదిరోజుల్లోనో ఖర్చు అయిపోతవి. ఆ తరవాత జీవితం నిరంతరసమస్య-ఎలాగో ఒకలాగు పూర్తి అవుతూవుంటుంది. నిన్న నాతో హోటల్లో తిన్నాడా, మళ్లీ ఇంతవరకు వస్తుందినా ఉండవచ్చును. తిక్కతిరిగితేమాత్రం అద్భుతంగా వ్రాస్తాడు. అలాటివాడికి మన సంఘంలో చోటు ఎక్కడా కనబడదు. ఏం, ఆలోచిస్తున్నావు?

బ్రహ్మ—ఎంత ఠీవియంటుగా వుండేవాడు. జాలివేస్తోంది. కొద్దిగానో గొప్పగానో సంసారం చేసుకుంటూవుండి బాల్యస్నేహితుడు వస్తుంటే సహించలేనురా? సత్యం! ఎక్కడుంటాడో ఇప్పుడు?

సత్యం—దృఢంగా చెప్పలేను. ఎందుకు?

బ్రహ్మ—నేను హోటల్‌కు వెళ్లడం బాగుండదు. వాడిని ఇక్కడికి తీసుకొనివచ్చావంటే కడుపునిండా టిఫిన్, కాఫీ ఇచ్చి పంపిస్తాను. నాకు తృప్తిగా వుంటుంది.

సత్యం—ప్రయత్నిస్తాను. (లేచి) కానీ, మీ ఆవిడ ఏమంటుందో ఆలోచించావా? పతివ్రత అంటే ఆవిడే అని అంటూవుంటుంది కోడలితో మాఅమ్మ. ఇటువంటి దుర్మార్గుణ్ణి మన గడప ఎలా తొక్కించావంటుందేమో? పైపెచ్చు తప్పు నామీదికే వస్తుందేమో?

బ్రహ్మ—అలాటి భయం నాకు లేదు. నా యిష్టమే ఆవిడ యిష్టము.

సత్యం—(నవ్వుతూ, రాగంతీస్తూ-) తనువులు రెండైనా మనసు ఒకటే. ఏం... నాకూ అకలిగానే వుంది.

(నిష్క్రమణ.)

బ్రహ్మ—(కొంతసేపు మౌనంగా ఆలోచిస్తుంటాడు.)

(ప్రవేశం ప్రభ. బ్రహ్మానందం భార్య. నిండు పేరు ప్రభావతి. కాని అందరూ ప్రభ అనే అంటారు. చామనచాయ; వొంట్లు ఇరవై అయినా, ఎంతో కాలం కాపురం చేసిన ఇల్లాలులాగా వుంది. పెద్దకళ్లు. ఆ కళ్లల్లోకి ఏకాగ్రంగా చూస్తే ఎంతో లోతుగా కనిపిస్తవి. కాని అలా ఎవ్వరూ చూడరు. భర్త కూడా చూచిఎరుగడు. చూడనివ్వదేమో.)

ప్రభ—ఏమిటండీ ఆలోచన?

బ్రహ్మ—ఆఁ. ఆలోచనా? నిన్నుగురించే.

ప్రభ—(నవ్వి) నిజంగా? నన్నుగురించి మీ రెప్పుడైనా ఆలోచిస్తారనుకోలేదుసుమండీ. అంటే జబ్బుగా వున్నప్పుడు తప్ప.

బ్రహ్మ—అంటే?

ప్రభ—అబ్బే. ఆశ్చర్యం ఏమీలేదండి. రోజూ వండుకునేవంటగురించి మనం ఆలోచిస్తామా చూడండి. దాంట్లో ఏదైనా లోపంవుంటే, అప్పుడు ఆలోచిస్తాం. మరమ్మత్తు చేయిద్దామా, పారేసి కొత్తది కొనుక్కుందామా అని. అలాగే.

(ప్రభ మాట్లాడుతూ వున్నా, ఏదో పని చేస్తూనే వుంటుంది. బల్లమీద వస్తువులు సర్దుతూ, గోడమీద క్యాలెండరు తేదీ మారుస్తూ పనికిమాలిన కాగితాలు బుట్టలో వేస్తూ.)

బ్రహ్మ—పొరబడ్డావు. నిజంగా నిన్నుగురించే దీర్ఘాలోచనలో పడ్డాను.

ప్రభ—వుండె కొట్టుకొంటూ వుందండి. ఏమిటో చెప్పేద్దురూ.

బ్రహ్మ—నాతో చదువుకునేవాడు మోహన్ రావు, ఎరుగుదువుగదూ. అసలు మీవూరే కాబోలు.

ప్రభ—(ఉలికిపడి, మళ్లీ వస్తాయించి) ఆఁ.

బ్రహ్మ—చాలా తెలివైనవాడు. కళారాధకుడు. కవి.

ప్రభ—పత్రికల్లో ఎప్పుడైనా చూస్తుంటా ఆయనపద్యాలు. కాని, ఎందు కిప్పోగట్టా?

బ్రహ్మ—వాడి ఉత్తరగాథంతా తెలుసునా నీకు? భార్యనువదిలిపెట్టడం, ఎవరితోనో లేచిపోవడం, తాగడం, తిరగడం విపరీతమైపోయింది వాడి జీవితమంతా. ఎంతో ముందుకు రావలసినవాడు. పట్టి పోకిరీ అనే పేరుసంపాదించుకొన్నాడు. పాపం-(తటుక్కున) ప్రభా, నేనుకూడా అలా అయిపోతానేమో అని నీకు భయంవేస్తోందా?

ప్రభ—లేదు.

బ్రహ్మ—ఏఁ. ఎందుచేత?

ప్రభ—(కొంచెం విసుగుతో) దుర్మార్గంగా వుండాలంటేమాత్రం అందరికీ సాధ్యమవుతుందటండీ!

బ్రహ్మ—(లెంపకాయ తిన్నట్లు ఉక్కిరిబిక్కిరై, మళ్లీసర్దుకొని) మోహన్ ఇప్పుడు ఈ వూళ్లో వున్నాడు.

ప్రభ—(కోపంతో) చాల్లేండి; ఈ గొడవ. (శాంతించి) ఇదేనా నన్నుగురించి మీ రాలోచిస్తూ వున్నది?

బ్రహ్మ—తొందరపడితే ఎలాగు?

ప్రభ—క్షమించండి.

బ్రహ్మ—సత్యాన్ని పంపించాను; మోహన్ కనబడితే మనయింటికి పిల్చుకొనిరమ్మని. ఏదో ఇంత టీ ఇచ్చి బాతాఖానీ కొడదామని. నీవు ఆక్షేపిస్తావేమో నని ఆలోచనలో పడ్డాను. సత్యంకూడా అన్నాడు "మీ ఆవిడ ఆక్షేపిస్తుందేమోరా" అని. అంటే నే నన్నాను. "ఆ భయంలేదు. నా యిష్టమే ఆవిడ యిష్ట"మని. దేవిగారు ఏమి సెలవిస్తారు?

ప్రభ—మీరే అన్నారు గదండీ. ఇక మళ్లీ నన్నడగడం ఎందుకూ? మీరు మీ స్నేహితుల్తో టీ పుచ్చుకొని కాలక్షేపం చేస్తే నా కేమి అభ్యంతరం ఉంటుందండీ?

బ్రహ్మ—బ్రతికాను. (కొంతసేపు ఇద్దరూ మాట్లాడరు) ప్రభా! బందరులో వున్నప్పుడే తాగే వాడటకదూ. మరీ ఎక్కువైపోయిందట. వెధవ అలవాటు.

ప్రభ—(పలకదు).

బ్రహ్మ—రిశ్శంగవారి అమ్మాయి, నీకు తెలుసుగదూ, నానాపాట్లు పడిపోయింది. అప్పటినుంచీ ఏ పాని దొరికితే అదే అంటారు. వాడి తండ్రి ఎంత ఛాందసుడు! ఎంత ఆచారపరాయణుడు! అలాంటి ఆయన కొడుకు ఎందుచేత ఇలా పరిణమించాడో పాపం!

ప్రభ—(నాతిప్రకాశంగా) అందుచేతే నేమో?. ఇక లోపలికి వెళ్లాలండి. బోలెడు పను లున్నాయండి'

(నిష్క్రమిస్తుంది)

(బ్రహ్మానందం లేచి పచారు చేస్తాడు. లోపలికి వెళ్లి ఒక క్రొత్త టేబిల్ క్లాత్ తీసుకువచ్చి బల్లమీద పరుస్తాడు. కుర్చీలు మూడు చుట్టూ ఉంచి ఇంకొక కుర్చీ దూరంగా మంచందగ్గర వేస్తాడు. మళ్లీ ఏమను కున్నాడో దాన్నికూడా బల్లదగ్గరే వేస్తాడు.)

(ఇంతలో ప్రవేశం సత్యం)

బ్రహ్మ—అరే. ఒంటరిగా వచ్చావేమీ, మోహన్ పరారి అయ్యాడా?

సత్యం—(విచారంగా) కాదు. ఈవూళ్ళోనే ఉన్నాడు. కాని ఇక్కడికి వచ్చే స్థితిలో లేడు.

బ్రహ్మ—జబ్బుగా వున్నాడా?

సత్యం—ఆఁ, జబ్బంటే జబ్బే. కారణం అమితంగా తాగడం. మన స్మరణలో కూడా లేడు. మాచి పలకరిస్తే జవాలు పట్టలేదు. వెర్రిమాపులు, మాటలూ; లేదా కళ్లు మూసుకుంటాడు. ఒళ్ళంతా వేడిగా ఉంది, జ్వరం వచ్చినట్లు. నా కేమీ తోచకుండా వచ్చేశాను' పూటకూళ్ళమ్మ ఇంట్లోనే వున్నాడు.

బ్రహ్మ—ఎలా జరిగింది ఇంతా?

సత్యం—శుద్ధ అమాయకుడవు బ్రహ్మం! నీ కర్థంకాదు ఇలాంటివాళ్ల దర్యలు. ఏ పత్రికవాళ్లో పంపించివుంటారు బిల్లు అంతే. పైసా అయిపోయే వరకూ తాగివుంటాడు.

బ్రహ్మ—ఎలా మరి?

సత్యం—డాక్టర్ చూడాలి ఒకటి. ఎక్కడైనా మంచిచోట్లో ఉంచి సంరక్షించే ఏర్పాటు చెయ్యాలి, రెండు. పాపం! చూస్తే జాలిగా వుంది. ఇది మావూరైతే మాయింటికే తీసుకువెళ్లేవాడిని గాని రైల్లో ఎక్కించే స్థితిలో లేడు.

బ్రహ్మ—ఈయింటికే తీసుకొస్తే?

సత్యం—అంతకన్నానా?

బ్రహ్మ—బండిలో వేసి తీసుకొనిరా.

సత్యం—లేకపోతే మోసుకొనిరావాలి. మంచం సిద్ధం చేయించు.

బ్రహ్మ—ఆఁ, ఆఁ (గట్టిగా) ప్రభా! ప్రభా!

(సత్యం వెళ్లిపోతాడు. ప్రవేశం ప్రభ—మసి వేళ్ళతో.)

ప్రభ—తెమ్మంటారా టీ? (అని ఎవరూ లేక పోవడం చూచి) మీ కొక్కరికేనా టీ?

బ్రహ్మ—చూడు ప్రభా. మోహన్ చాలా ప్రమాదకరమైన స్థితిలో వున్నాడట. సత్యం చూచి వచ్చాడు. జ్వరం, మన స్మరణలో లేడట. పాపం, వెధవ అలవాటు. అదీ ఒకరకమైన ఉన్మత్తజాడ్యమే కదూ.

ప్రభ—త్రాగుడా?

బ్రహ్మ—ఊఁ. నాకు చాలా జాలివేసింది; ప్రభా. వాడి కీవూళ్ళో నా అన్నవాళ్లు లేరు.

ప్రభ—సరే. వెళ్లి చూచిరండి. టీ తేనా? పుచ్చుకొని వెళ్లండి.

బ్రహ్మ—మళ్లీ నేను చూడడం ఎందుకు? మన యింట్లోనే ఉంచుకుంటే ఒళ్లు నయమయ్యాక వెళ్లి పోతాడు.

ప్రభ—(కఠినంగా) ఎంతమాత్రం వీలుకాదండి.

బ్రహ్మ—(విస్మయంతో) ఏం?

ప్రభ—కావలిస్తే హాస్పిటల్లో చేర్పించండి. ఎక్కడైనా ఉంచండి.

బ్రహ్మ—ఏమిటి ప్రభా, ఇలా మాట్లాడుతున్నావు? పనిమనిషిని రాత్రి ఇక్కడే పండుకొమ్మను ఒకపూట. రేపు కొంచెం నయమైనాక పంపించేస్తాను-కష్టంగా వుంటే నీకు.

ప్రభ—(కాఠిన్యం పోయింది. దీనంగా) బతిమాలుతున్నానండి. వద్దు. వద్దండీ వద్దు. నామాట వినరూ! వెళ్లి రండి. వచ్చిస్తే, ఎవ్వరైనా చూచుకుంటారు. అన్ని వుపాయాలూ ఏర్పాటు చెయ్యండి. సత్యనారాయణగారు కూడా ఉన్నారు కదూ. ఆయనికి లోక వ్యవహారాలన్నీ బాగా తెలుసును.

బ్రహ్మ—(కోపంతో) నాకూ తెలుసును. నేను చిట్టి చవటపెద్దమ్మను గాను. ఏమనుకున్నావో, బడి పంతులనైనా, నాయింటికి నేనే యజమాన్ని. ఇది నా యిల్లు, నా వాకిలి. నాయింట్లో నా స్నేహితుణ్ణి ఒకరోజు ఉంచుకోడానికి నా కధికారం లేదా? మహాపతివ్రత వని ప్రఖ్యాతిగడించినదానవు, నా కా అధికారం లేదంటావా?

ప్రభ—(అతిదీనంగా) రామరామ! అంతమాట అంటావా నోటితో. నేను బతిమాలుకొన్నాను. అంతే. భర్తను బతిమాలుకోవడానికి సహా భార్యకు అధికారం లేదా? వేడుకొంటున్నాను. ఈపని మానరూ?

బ్రహ్మ—మళ్లీ మొదలుకే వచ్చావూ? మానను. ముమ్మాటికీ మానను. నీవు గంటసేపు వాదించినా, ప్రార్థించినా మానను.

ప్రభ—(నిరాశతో) సరే. నా చేతనైనంత వరకు ప్రయత్నించాను. నామాట విన్నారుగారు. ఇంక నే నేమి చెయ్యను. మన కర్మ అనుకొంటాను.

బ్రహ్మ—ఏమైనా అనుకో. సత్యాన్ని అప్పుడే పంపించాను, తీసుకురమ్మని. డాక్టరు కూడా వస్తాడు. ప్రభా, నీ కిష్టంలేని కార్యం అని అశ్రద్ధచేయవు కదూ.

ప్రభ—అంతమాత్రం నమ్మకం లేదా?

బ్రహ్మ—(భుజంమీద తడుతూ) ఎందుకు లేదూ. మాటవరసకి అన్నానుగాని మరి కానీ. ఆ మంచంమీదే పడుకో పెడదాం.

ప్రభ—అలాగే. (అని లోపలికి వెళ్లి, తలగడలూ, దుప్పటి తెచ్చి పడక తయారుచేస్తూంటుంది).

(బ్రహ్మానందం బల్ల ఒకమూలకు లాగి, కుర్చీలు రెండు మంచందగ్గర వేస్తాడు.)

(సత్యం, బండివాడు చెరి ఒకప్రక్క పట్టుకొని మోహన్‌రావును లోపలికి ప్రవేశపెడతారు. మోహన్ కళ్లు మూతలుపడిఉన్నాయి. నల్లని పొడుగాటి జుట్టు చిందరవందరగా నుదుటిపై పడివుంది. కోలమొహం, కోటేర్చిన ముక్కు, లావు కనుబొమలు. చెక్కిళ్లు పలచనే, కాని ఎండిపోయిన ట్లున్నవి. పెదవులు మాటి మాటికి వంకరగా తిప్పుతూంటాడు. సన్నని జుబ్బా, లాగూ, కొంచెం మాసినవి.)

సత్యం—బ్రహ్మం! ఆమంచం మీదేనా?

బ్రహ్మ—(చకితుడై చూస్తూ, ఆఁ అని తల ఊపుతాడు.)

(సత్యం, బండివాడు మోహన్‌ని మంచంమీద పడుకోపెడతారు. ప్రభ లోపల్నించి శాలువా తెచ్చి కప్పుతుంది.)

బండివాడు—నే వెళ్లనా బాబూ!

సత్యం—(బాడుగ ఇచ్చి) వెళ్లు. దారిలో డాక్టరుగార్ని మళ్లీ హెచ్చరించిపో.

బండివాడు—చిత్తం. (వెళ్తాడు)

(సత్యం, బ్రహ్మం ఒకరొకరు చూచుకుంటారు మాట్లాడకుండా. ఆవెనక ఇద్దరూ మంచంవంక చూస్తారు. ప్రభ మోహన్ చెదరిన జుట్టు సరిచేస్తుంటుంది.)

ప్రభా—(నుదురు పట్టి చూచి) అబ్బ! ఎంత వేడిగా ఉంది! జ్వరం బాగా కాస్తోంది. ఉడుకు

—ంలో నుంచి చేతిరుమాలు కొసలమీద వెళ్ళ నాంకి? మంచి దంటావు.

(ఎవ్వరూ జవాబు చెప్పరు. ప్రభ వెళ్లి రుమాలు ఉడుకునీళ్లలో తడిపి తెచ్చి నుదుటిమీద వేస్తుంది.)

(ఇంతలో డాక్టర్ కృష్ణరావు వస్తాడు.)

కృష్ణా—హాలో బ్రహ్మం! గుడ్ ఈవినింగ్ సత్యం.

బ్రహ్మ—డాక్టర్! (మంచంవంక చూపిస్తూ) మోహన్ రావు మా స్నేహితుడు. ఈస్థితిలో వుంటే చూచి సత్యం ఇక్కడికి తీసుకొనివచ్చాడు.

(డాక్టర్ వెంటనే మంచందగ్గిరికి వెళ్లి, మోహనుని పరీక్ష చేస్తాడు; థర్మామీటర్ పెట్టి చూసి.)

డాక్టర్—మరి వేరే జబ్బు ఏమీ లేదు. జ్వరం ఉందిగాని అదీ ఒక లక్షణమే. ఆల్కహాల్ అమితంగా తాగడంచేత, సన్నిపాతంకూడా వస్తుంది ఒకప్పుడు. రాత్రిఅంతా మంచినీళ్లు తప్ప వేరే ఆహారం ఇవ్వకండి. సత్యం, నాతో రా. మందు ఇస్తాను. ఒక డోసు ఇప్పుడు, ప్రొద్దున్నే ఇంకొకడోసు ఇవ్వండి. ఎక్కువగా ప్రేలపం అదీ ఉంటే నిద్రపట్టడానికి ఒక స్లీపింగ్ డ్రాట్ పంపిస్తాను. ఇవ్వండి. రేపటికి ఆల్ రైట్ గా ఉంటాడు. గుడ్ నైట్.

బ్రహ్మ— సత్యం! వెళ్లిరా.

( డాక్టరు, సత్యం వెళ్లతారు.)

ప్రభ—(మంచం ప్రక్క కుర్చీమీద కూర్చుంటుంది.)

బ్రహ్మ—(మెల్లగా) ప్రభా.

ప్రభ—ఆఁ.

బ్రహ్మ—మోసేవాడికి తెలుస్తుంది కావడి బరువు. నా కేం? చాలా దయతో ఇంట్లో ఉంచుకుంటానని అన్నాను గాని, పాటుపడేదానివు నీవే కదా. నేను ఆలోచించలేదు. క్షమించు ప్రభా.

ప్రభ—అబ్బెబ్బే. మీరు పొరబడ్డారండీ. ఇంతో కొంతో నాకు పనిబడుతుందని కాదండీ నేను ఆక్షేపించింది. ఇదొక లక్ష్యమా నాకు? మీకు టైఫాయిడ్ జ్వరం వచ్చినప్పుడు ఇరవైరోజులు నరుసు మొస్తరుగా పని చేశాను. జ్ఞాపకం లేదూ?

(ఈ సంభాషణ జరుగుతూఉన్నప్పుడు మోహన్ మూలుగుతూ, గొణుగుతూ, చేతులు కదలిస్తూ ఉంటాడు. ప్రభ మాట్లాడుతూనే చేతులు అదిమి పట్టుకుంటుంది.)

బ్రహ్మ— కొంచెం నిమ్మళించగానే ఏదో విధంగా పంపించేస్తాను.

ప్రభ—ఆయనమాత్రం ఉంటాడటండీ.

బ్రహ్మ—(జవాబు నచ్చలేదు. కాని ఏమన డానికీ తోచక ఊరుకుంటాడు.)

ప్రభ—ఏమండోయి! చీకటి పడుతోంది. దీపం వెలిగించండి.

బ్రహ్మ—(దీపం వెలిగిస్తాడు) ప్రభా, నీవు మోహన్ని బాగా ఎరుగుదువా?

ప్రభ—అంటే?

బ్రహ్మ—మీ ఊరివాడు కదూ. ఫలానా అని మాత్రం తెలుసునా, లేక పరిచయం ఉందా అని?

ప్రభ—ఎప్పుడైనా మాయింటికి వచ్చేవాడు. మా నాన్న ఆయన్ని పద్యాలు చదవమనేవాడు.

బ్రహ్మ—అవును. బాగా చదివేవాడు-హైస్కూల్లో. (ఏదో ఆలోచన - కొంతకాలం మౌనం.) నిన్నానవాలు పడ్తాడా?

ప్రభ—(అపహాసం చేసి) ఆ ప్రశ్నకి నే నెలా జవాబు చెప్పగలనండీ?

బ్రహ్మ—అవునులే.

(సంభాషణ ఆగిపోతుంది. బ్రహ్మానందం పచారు చేస్తూవుంటాడు...ఇంతలో సత్యం వస్తాడు రెండు మందుసీసాలతో. సీసాలు బల్లమీద పెడుతూ—)

సత్యం—ఇదుగో, ఈ సీసాలో మందు ఒక డోసు ఇప్పుడే ఇమ్మన్నాడు ఇంకో డోసు రేపు ప్రొద్దున్న ఇస్తే చాలును. ఈ సీసాలో ఒక్కటే డోసు ఉంది. నెమ్మదిగా నిద్రపోతే ఇవ్వక్కరేదన్నాడు. నిద్ర పట్టకుండా, వెర్రిగా మాట్లాడుతూవుంటే ఇమ్మన్నాడు.

ప్రభ—(లేచి మొదటి సీసా తీసుకొని ఒక డోసు ఒక గ్లాసులో పోసి త్రాగిస్తుంది)

సత్యం—ఫస్ట్‌క్లాస్ నర్సు.

బ్రహ్మ—ఆలస్యమైంది. వెళ్లిపో సత్యం.

సత్యం—రేపు మార్నింగ్ ట్రెయిన్‌లో వెళ్లిపోవాలి. సెలవు. మోహన్ సంగతి వ్రాస్తావు కదూ.

బ్రహ్మ—ఆఁ.

(సత్యం వెళ్లిపోతాడు.)

ప్రభ—వెళ్లి భోజనం చేసి రండి.

బ్రహ్మ—నీవో?

ప్రభ—ఉపవాసం ఉండనులెండి. ఎవ్వరూ లేకుండా ఎలాగండి? నేను తరవాత భోజనం చేస్తాను. మీరే వడ్డించుకుంటారుగదూ?

బ్రహ్మ—ఓ. (లోపలికి వెళ్తాడు.)

ప్రభ—(వీధితలుపు గొళ్లెం పెట్టి వస్తుంది.)

(రంగస్థలంమీద దీపాలన్నీ ఆర్పి, మళ్లీ వెలిగించవలెను—కొన్ని గంటలతర్వాత అని సూచించడానికి.)

* * *

(అర్ధరాత్రి. మోహన్ మాత్రం మంచంమీద పడుకున్నాడు. ఇంకెవ్వరూ లేరు. మొదట అస్పష్టంగా మాటలు వినబడతవి. తర్వాత స్పష్టంగా, బిగ్గరగా.)

మోహన్—అబ్బ! దాహం! దాహం! జ్వాల, రక్తజ్వాల, రక్తధార, హోమకుండంలో రక్తజ్వాలలు, ఎర్రనాలుకలు, మంట, రక్తం. అబ్బా, బాధ. (కండ్లు తెరిచి తేరి చూస్తుంటాడు.)

(ప్రవేశం ప్రభ. కేకలు విని వచ్చింది. నిద్రపోతున్నట్లు కనబడెను. మంచం సమీపించి నిలబడుతుంది.)

మోహన్—(కండ్లు గట్టిగా మూసుకొని) చూడు. ఏమి చేశారో రాక్షసులు. ప్రభా!

ప్రభ—(ఉలికిపడుతుంది.)

మోహన్—నా గుండెల్లో పొడిచేశారు ప్రభా! హృదయేశ్వరీ! ఇప్పుడు నా హృదయంలో రక్తం లేదు. ధారగా పోశారు ఆ గుండంలో. అదుగో, అదుగో, వాళ్లని తరిమేయి. తరిమేసి ఆ రక్తం నీ చేతుల్తో నాగుండెల్లో మళ్లీ పోసేయి. (కండ్లు తెరుస్తాడు. ఒక్కక్షణం చూపు ప్రభమీద ఆనింది) ఎవరు నువ్వు?

ప్రభ—ప్రభను. మీ హృదయేశ్వరిని.

మోహన్—(వికలిచూపుతో వెర్రిగా నవ్వి) రాక్షసీ! నా ప్రభ చచ్చిపోయింది. నీకు తెలియదూ? నువ్వే చంపేశావు. నాకు తెలుసును. పోలీసువాళ్లతో చెప్పేస్తాను. (లేవబోతాడు)

ప్రభ—(ప్రయత్నంతో యథారీతి పడుకోబెట్టి) ప్రభ చచ్చిపోలేదు. పడుకోండి.

మోహన్—(మాటలు వినే స్థితిలో లేడు) దాహం, దాహం, దావాగ్నిజ్వాల, మంట.

ప్రభ—(గ్లాసుతో మంచినీళ్లు త్రాగిస్తుంది).

మోహన్—వచ్చావా. మళ్ళీ వచ్చావా? బాగా చూడనీ (అని కండ్లు గట్టిగా మూసుకుంటాడు.) ఏదీ ముద్దు. (ముద్దు పెట్టుకున్నట్లు పెదవులతో శబ్దం చేస్తాడు). అబ్బ, ఎంత తీపి, సుధామధురం, మధుమధురం, దధిమధురం, నీ అధరం మధురాతిమధురం. (బిగ్గరగా) అయ్యయ్యో, రాక్షసుడు నా ప్రభను బలాత్కారంగా, అబ్బా, ఎంతపోటు పొడిచావురా (అని చేతులతో గుండె గట్టిగా పట్టుకుంటాడు.)

ప్రభ—(చేతులు విడదీసి, బుజాలు పట్టుకొని) ఎవరూ లేరు. భయపడకండి. పడుకోండి.

మోహన్—(కండ్లు తెరచి) రాక్షసీ, ఇంకా ఉన్నావూ? నామీద కన్నువేశావూ? నా ప్రభను ఖూనీచేసి, నన్ను పెళ్లాడుతావుగదూ? పో, పో. (అని విదిలించి కండ్లుమూసుకుంటాడు.)

ప్రభ—(లేచి, తటాలున ఏదో స్ఫురించినట్లు నటించి, బల్లమీద ఉన్న ఇంకొక సీసాలో వున్న మందు త్రాగిస్తుంది.)

మోహన్—విషం! విషం! హాలాహలం..... పరమేశ్వరుని కంఠంలో వుండే హాలాహలం. ఎట్లా

దొరికిందయ్యా నీకు, డాక్టర్. (కండ్లు తెరచి) నాకు తెలుసు, డాక్టర్. శివుణ్ణి చంపేసి ఆ విషం తీసుకొచ్చావు కదూ? ఇంక శివుడు తాండవనృత్యం చెయ్యడు కదూ? (వెకిలి నవ్వుతో) ఓస్, మా సుబ్బిగాడు కూడా చేస్తాడు శివతాండవం. అరవపాటతో కూడా. పాడనా. కాలై తూక్కి నిండాడు దైవమే. మిగతా ముక్కలు రావు. నవ్వుతా వెందుకురా? నీ తల ముక్కలుముక్కలు చేస్తాను. డొక్క చీల్చేస్తాను. —(ఆవులిస్తాడు) అరే, అలా మేఘాలమీద వెళ్లిపోతున్నావేమి ప్రియా. ధూమజ్యోతిస్సలిలమరుతాం—(మళ్లీ ఆవులింత, కండ్లు మూతలు పడుతున్నవి.) ఏమి చల్లగాలి! (గొణుగుతో) మన్దం మన్దం నుదతి పవన శ్చానుకూలో యథాత్వాం - (ఆవులింత) గోదావరి, కృష్ణవేణి, అరుణారుణరేఖలు, తరుణీమణినూపుర ధ్వనులు, వరణాతరంగిణీదరవికస్వరనాళ్కకమలకషాయ గంధము వహించి... (ఆవులింత) చీకట్లు, గోధూళి, ధీరసమీరే, యమునాతీరే. అదుగో రాధ. రాధా- ప్రభా-(మాటలు నిల్చిపోయినవి. నిద్ర)

ప్రభ—(నుదుటిమీది జుట్టు వెనక్కుతోసి, తలగడ సవరించి లేచి కొంతసేపు చూచి మెల్లగా దూరంనుంచే ముద్దుపెట్టుకొని, చప్పుడుచేయకుండా వెళ్లిపోతుంది.)

(మళ్లీ రంగస్థలంమీద దీపాలన్నీ ఆరిపోతవి.)

(మర్నాటి ఉదయం. దాదాపు తొమ్మిదిన్నర. మోహన్ ఇంకా నిద్రపోతూవున్నాడు.)

ప్రభ—(ప్రవేశించి మంచందగ్గిర నిలబడి నుదురు పట్టి చూస్తుంది. వేడిగా లేదు.)

మోహన్—(మేలుకొంటాడు.) ఎవరు? ఎక్కడ, ఎక్కడున్నాను?

ప్రభ—ఇక్కడే. చెప్తానన్నీ మెల్లగా. ఎలా వుంది మీకు?

మోహన్—ఏమీ లేదు. (తల ఆడించి) కొంచెం తలనొప్పిగా వుంది, అంతే. ఇది హాస్పిటలా, నువ్వు నర్సువా?

ప్రభ—(నవ్వి) ఒకవిధంగా నర్సునే. ఇది మీ చిన్ననాటి నేస్తం, బ్రహ్మానందంగారి ఇల్లు.

మోహన్—(ప్రభ మాట్లాడుతూవుంటే తదేక దృష్టితో చూస్తాడు. తటాలున ఏదో స్ఫురిస్తుంది. వడిగా) నువ్వు! చూడు వెంకటశాస్త్రుల కూతురు ప్రభవు కావూ నువ్వు?

ప్రభ—అవును. ఇప్పుడు వీరి భార్యను.

మోహన్—ఆఁ. బ్రహ్మన్ని పెండ్లిచేసుకొన్నావు కదూ. ఎక్కడ బ్రహ్మం?

ప్రభ—స్కూలుకు వెళ్లేవేళ అయింది. భోజనం చేసి బట్టలు వేసుకుంటున్నారు. ఇప్పుడే వస్తారు.

మోహన్—మాస్టర్ కదూ. వాణ్ణి కాలేజిలో వున్నప్పుడే మేము మాస్టారండి అనేవాళ్లం. చాలా మంచి వాడు కదూ.

ప్రభ—(మందహాసంతో) బాగుంది! భార్యను భర్తకు సర్టిఫికెట్ ఇమ్మంటున్నారా?

మోహన్—చతురత్వం పోలే దింకా. (రెప్పవాల్చకుండా చూస్తూ) అరే, చిన్నప్పటికన్నా అందంగా ఉన్నావు సుమా!

ప్రభ—నాకేం తెలుస్తుంది?

మోహన్—ఆయన చెప్పడూ?

ప్రభ—స్కూలుమాస్టర్లు భార్యల్ని ప్రతిదినం వర్ణిస్తూవుంటారటండీ?

మోహన్—మంచి దెబ్బ! (మెల్లగా లేచి, గోడనానుకొని కూర్చుంటాడు) రాత్రి అసహ్యంగా ప్రవర్తించివుంటాను. అయితే ఈప్రపంచంలో లేను. క్షమించాలి. ఆ వెధవబ్రాందీ మంచిసరుకు గాదు.

ప్రభ—మొఖం కడుక్కొని కాఫీ పుచ్చుకోండి. నీళ్లు బేసిన్ పట్టుకొస్తాను.

మోహన్—వద్దు. నేనే లేచివస్తాను. (అంటూ లేవబోతాడు నీరసంగా).

ప్రభ—వద్దు, వద్దు. నీరసంగా వున్నారు. (అంటూ లేవబోతున్న మోహన్ భుజాలు పట్టుకొని కూర్చోపెడుతుంది. మోహన్ తటాలున తన చేతులతో

(ప్రభ చేతులు పట్టుకొని దగ్గరకు లాగుకుని ముద్దుపెట్టుకుంటాడు.)

మోహన్—పాపం చేశాను. క్షమించు. బాధపెట్టాను.

ప్రభ—(సర్వం మరిచిపోతూవుం—) లేదు, లేదు. (అంటూ సమీపించి, తన చేతులతో మోహన్ తల పట్టుకొని ముద్దుపెట్టుకుంటుంది. అక్షణంలోనే బ్రహ్మానందం లోపల్నించి వస్తాడు, స్కూలుకు వెళ్ళడానికి బట్టలు వేసుకొని. జరిగినదంతా చూడలేదుగాని ఏదో సందేహం హృదయాన్ని అల్లకల్లోలం చేస్తున్నది. పైకి కనబరచడు).

బ్రహ్మ—మోహన్ లేచాడా? ఎలా ఉంది?

ప్రభ—(ఖంగారు సర్దుకుంటూ—) ఆఁ, ఇప్పుడే లేచారు. తలనొప్పిగా వుందట. లేవబోయి పడిపోయారు.

బ్రహ్మ—మోహన్, ఇవ్వాళ కొంచెం విశ్రాంతి అవసరం. మంచంమీదే వుంటే మంచిది.

మోహన్—బ్రహ్మం, నాకూ విశ్రాంతికీ చాలా దూరం. అయినా మెనీథ్యాంక్స్, అనాథసంరక్షణ చేసినందుకు.

బ్రహ్మ—నిన్నరాత్రి చాలా చెడ్డఅవస్థలో వున్నట్లు చెప్పాడు సత్యం. తక్షణమే ఇక్కడికి తీసుకొనిరమ్మన్నాను.

మోహన్—సత్యం వస్తాడా ఇప్పుడు?

బ్రహ్మ—లేదు. ప్రొద్దున్నే వెళ్లిపోయాడు.

మోహన్—మరీమరీ థ్యాంక్స్. కాని, కాఫీ తాగి వెళ్లిపోతానోయి, సెల విప్పిస్తే.

బ్రహ్మ—నో, నో. (మళ్లీ ఆలోచించి) పోనీ నేను స్కూల్ నుంచి వచ్చాక చూద్దాం. వెళ్తాను. నీవు ప్రభను ఎరగవూ?

మోహన్—ఆఁ. ఏదో చిన్నప్పుడు కించిత్ పరిచయం. బందరువాళ్లే మేంగదూ.

బ్రహ్మ—ఆడేలే. టైమయింది, వెళ్తాను. (నిష్క్రమణ)

ప్రభ—వెళ్లి నీళ్లూ పేస్టూ తెస్తాను. (వెళ్తుంది)

మోహన్—(రెండు చేతులతో తలపట్టుకొని కళ్లుమూసుకుంటాడు.)

(తెర)

(మళ్లీ తెర ఎత్తేటప్పటికి సాయంత్రం నాలుగు గంటలు దాటుతుంది. ప్రభ మంచంమీద కూర్చుంటుంది. మోహన్ ఇటూ అటూ పచారుచేస్తూ వుంటాడు.)

మోహన్—అయిపోయింది. నాలుగు కూడా దాటింది. స్వప్నలోకంలోనుంచి యథార్థప్రపంచంలోకి దిగాలి. ప్రభా, ఇక గంటలో వెళ్లిపోతాను.

ప్రభ—అవును, గంటలో వెళ్లిపోతాము.

మోహన్—(మాటలు విన్నా మొదట అర్థం పూర్తిగా గ్రహించడు. తర్వాత హఠాత్తుగా స్ఫురిస్తుంది) ఆఁ! ఏమన్నావు?

ప్రభ—గంటలో వెళ్లిపోతాము అని.

మోహన్—అంటే?

ప్రభ—కవీశ్వరులకు మామూలు తెలుగుభాష అర్థంకావటం లేదు కాబోలు. గంటలో మీరూ నేనూ వెళ్లిపోతామని అన్నాను.

మోహన్—ప్రభా, పిచ్చిగా మాట్లాడుతున్నావు. స్వప్నప్రపంచంనుంచి ఇంకా బయటపడలేదా?

ప్రభ—ఏది స్వప్నప్రపంచమో, ఏది జాగ్రత్ప్రపంచమో నిర్ణయించడము నా కవసరం లేదు. మీరు వెళ్లేటప్పుడు మీతో వచ్చేస్తున్నాను. నాబట్టలూ అవీ సర్దుకున్నాను. వారు చేయించిన నగలు ఇక్కడే వదిలేశాను. ఇదంతా స్వప్నమే అంటారా?

మోహన్—వద్దు ప్రభా, వద్దు.

ప్రభ—ఎందుకూ? పాపకార్యమనా?

మోహన్—కాదు.

ప్రభ—లోకులు తిట్టిపోస్తారనా?

మోహన్—కాదు.

ప్రభ—స్నేహితుణ్ణి ద్రోహంచెయ్యడమనా?

మోహన్—కాదు.

ప్రభ—నేను కష్టపడతాననా? ఇల్లూ వాకిలీ లేక మీ రుంటే మీతో తిరుగుతూ అన్నపానాలుకూడా ఒక్కొక్కప్పుడు లేక బాధపడతాననా? ఆ భయం నాకు లేదు.

మోహన్—కాదు.

ప్రభ—మీ స్వేచ్ఛకు భంగంకలిగిస్తాననా?

మోహన్—కాదు, ప్రభా, కాదు.

ప్రభ—(నిశితంగా) అయితే, తెలిసింది కారణం. నామీద ప్రేమ లేదు. (లేచి నిలబడుతుంది.)

మోహన్—అయ్యయ్యో, ఎంత ఘోరంగా పొరబడుతున్నావు! నీమీద ప్రేమవల్లనే వద్దని వేడుకుంటున్నాను.

ప్రభ—(నీరసంగా నవ్వి) ప్రేమవల్ల!

మోహన్—(ప్రభను సమీపించి తొందరగా) అవును, ప్రేమవల్లనే. అసాధారణమైనటువంటి ప్రేమ, అపూర్వమైన ప్రేమ, పవిత్రప్రేమ, రాధమీద కృష్ణుకి ప్రేమవంటి అమోఘప్రేమ. ప్రభా! కించిత్ మోహానికి లోబడి అటువంటి మన ప్రేమను మలినం చేస్తావా? మోహం తాత్కాలికం. ప్రేమ శాశ్వతం.

ప్రభ—ప్రేమచేతనే మీవెంట వస్తానన్నాను. మోహంచేత కాదు.

మోహన్—నేను ఒప్పుకోను. ఎందుకంటే మోహం ఫలాన్ని అపేక్షిస్తుంది. ప్రేమ ఫలాతీతమైంది. సాఫల్యంతో మోహం నశిస్తుంది. ప్రేమానుభవానికి సాఫల్యమన్నదే లేదు. అందుచేత దానికి నాశ మెన్నటికీ లేదు.

ప్రభ—మరి కమలం, నిశ్శంకవారి కోడలు మీతో వచ్చేసి ఆనందం అనుభవించలేదా?

మోహన్—లేదు. మోహాగ్నిలో భస్మమై పోయింది. కొంత సౌఖ్యం అనుభవించిందేమోకాని, ఆనందం ఎన్నటికీ అనుభవించలేదు. ఆనందానికి హెచ్చుతగ్గులూ, సంతృప్తీ ఉండవు. మనుచరిత్ర, జ్ఞాపకం లేదూ, 'కుంభగతప్రదీపకళికాస్త్రీ దోపు.' అటువంటిది ఆనందం.

ప్రభ—ప్రేమించిన పురుషునకు దేహమూ, ఆత్మ అర్పించడంకన్నా స్త్రీకి వేరే ఆనందం ఉంటుందా?

మోహన్—మళ్ళీ కలిపేస్తున్నావు. ఆత్మనర్పించుకో. వద్దన్నానా? దేహాన్ని అర్పించుకున్న క్షణంలో దాని విలువ తగ్గిపోతుంది. ప్రభా, నీవు నా దేవతవు. నీదేహాన్ని నా కర్పించి సామాన్యవనితవైపోతావా?

ప్రభ—అయితే ఈప్రేమను ఎలా అనుభవించడం?

మోహన్—ప్రేమానుభవం నిష్కామకర్మ. ప్రేమంటే కోరిక కాదు,—తీరడానికి. ప్రేమకూ, భక్తికీ తృప్తి లేదు. అనుభవించడంవల్ల ఎక్కువవుతవి. అదీ పరమరహస్యం.

ప్రభ—ఏమీ తోచడంలేదు. బాధపడిపోతూవున్నాను.

మోహన్—నాకు తెలుసును. దేన్నిగాని చంపుతున్నప్పుడు బాధ సహజం. ఇప్పుడు మోహాన్ని చంపుకోడానికి ప్రయత్నిస్తున్నావు. అందుకే బాధ.

ప్రభ—(చప్పుడు విని) వస్తున్నారు.

(ప్రవేశం బ్రహ్మానందం.)

బ్రహ్మ—(ఇద్దరివైఖరీ చూచి కంగారుపడతాడుగాని అడగడానికి జంకు.) మోహన్...ఒంట్లో ఎలా ఉంది?

మోహన్—చూస్తున్నావుగా. ఓ. కే. గా వున్నాను. ఇంతవరకు లెక్చర్లతో మీయిల్లాలిని విసిగించేస్తున్నా. సెలవిప్పించాలి. మీ యిద్దర్నీ ఎలా థ్యాంక్ చెయ్యాలో ఊహించలేకుండావున్నాను.

బ్రహ్మ—అరే, దీనికేనా...అయితే వెళ్ళిపోతానంటావా?

మోహన్—నీవు వచ్చేవరకూ ఉంటానని చెప్పాను గదా అని ఇంతవరకూ ఉన్నాను.

బ్రహ్మ—సరేమరి. (అని జేబునుంచి పర్సు తీసి పదిరూపాయలనోటు ఇవ్వబోతాడు)

మోహన్—వద్దు, క్షమించు.

బ్రహ్మ—నీయిష్టం. (నోటు జేబులోపెట్టుకొంటూ.)

మోహన్—(ప్రభతో) ఏమండోయ్, సెలవు. మీ దయ, మీ అభిమానం మరిచిపోలేను. బ్రహ్మం, సెలవు. మళ్ళీ ఎన్నాళ్లకో!

బ్రహ్మ—(ప్రభతో) గుమ్మంవరకూ వెళ్ళివస్తాను.

(మోహన్, బ్రహ్మం నిష్క్రమిస్తారు.)

ప్రభ—(మొదట నిశ్చేష్టగా నిలబడుతుంది. తర్వాత మంచంమీద కూర్చుని చేతుల్తో ముఖం కప్పివేసుకుంటుంది.)

(పునఃప్రవేశం బ్రహ్మానందం)

బ్రహ్మ—(ప్రభను చూసి, సమీపించి మంచంమీద ప్రక్కనే కూర్చుని, భుజంమీద చెయ్యివేసి) ప్రభా! నీవు వద్దంటే విన్నానా గాను. అర్థంకాలేదు. నిన్నెంత కష్టపెట్టాను!

ప్రభ—(వెక్కివెక్కి ఏడుస్తున్న శబ్దంమాత్రం వినబడుతుంది.)

(మిగతా అంతా నిశ్శబ్దం.)

[తెర]

నరేంద్ర ప్రభ

పౌరాణికులును, కవులును,
పండితులును, నాట్యకళా
విదులు, చాటుకారు, లధిపు
వినోదార్థ ముం కురు గద.
తంత్రావాపమ్ములలో
ధర్మప్రతిపాలనలో
ఆఖేటములోన కాల
యాపనమ్మ భూధవులకు.

శ్రీ లేఖ

వ్యాయామములో వాహ్యాళులలో
మల్లక్రీడల మరతురు కాలము.
వనవిహారములు వారిక్రీడలు
పానగోష్ఠులును ప్రమదాకేళులు
ఎన్ని యున్న ధరణీశుల కెడనెడ
కాలయాపనము కష్టము సుమ్మా!

నరేంద్ర ప్రభ

అందులకే శ్రీలేఖా,
ఆందోళన మతిశయించు.
విభుడు సంతసింప నెట్టి
వినోదములు కూర్పగలమొ.

శ్రీ లేఖ

ఆందోళన పడ నవసర మేదీ?
సర్వము వైళమె సంపన్నం బగు.
మకుటము తాల్పని మహిపతి నీపతి,
ఆతడు తలచిన దగు త్రుటిలోపల.
పూర్వపరిచితుడు భూపతి నీపతి,
కగుకలమున లే దబ్బురపాటును.
శ్రీజన్మంబును చిన్నతనంబును
నిర్హేతుకముగ నిన్ను కలంచును.
సంభ్రమ మేటికి? జనపతి యైనను
ప్రజల నూరకే బాధింపడు గద!

నరేంద్ర ప్రభ

అది కా దే శ్రీలేఖా,
అవనివిభుడు మహాసరసు
డని యొక సందర్భములో
యజమానులు పలికినారు.
అట్టిసరసు మానసమున
కాహ్లాదము కలుగురీతి
నన్నివిధములందు మనము
యత్నింపగ వలయుగదా.

శ్రీలేఖ

అవును ప్రియసఖి, అటులే చేతము:
నేను వితస్తయు నీసహచరులము.

(వితస్త గంభీరగమనములో ప్రవేశించి యిటు నటు విలోకించి, మందముగా)

వితస్త

యజమాను లేరి! అగుపించ రేల?
ఎదు రేగినారో పృథివీశుకొరకె?

శ్రీ లేఖ

ఎదురు పోవలే దీప్రాంతమునన
స్వాగతయత్నమునలుపుచునుందురు.

వితస్త

ఇంక నెంతలోన ఏతేరగలడో
మను జేశ్వరుండు మనహర్మ్యమునకు!

శ్రీ లేఖ

ఎన్నివిఘటికల కేతెంతురో నే
గనుగొన నైతిని కార్తాంతికువలె.

(వితస్త మాటి ముకుచుకొనును)

త్వరితముగానే దయచేయుదు రని
మాత్రము తెలిపిరి మనయజమానులు.
నాయనుంగుసఖి నరేంద్రదేవికి
ఆంతోళన మిపు డతిశయించినది.

వి త స్త

ఎందు కమ్మ నీకు నిపుడు కలవరమ్ము ?
ప్రభువు నిన్ను గొనుచు పారిపోవ లేడు

శ్రీ లేఖ

(మందహాసముతో)

పరుగువారు నేడల పర్వతమ్ము వోలె
అధిపుత్రోవ నీవె అడ్డు నిలువ వొక్కొ!
నిపుణురాల వైన నిన్ను జూచి నేడు
చనును నిన్నె కొనుచు;
సఖికి భయము లేదు.

వి త స్త

(ముసిముసి నగవుతో)

అదరిపాటు తగదె అందకత్తె కాన !
జవ్వనంబు పిల్ల, శాశ్వతమ్ము కాదె!

శ్రీ లేఖ

నేను భయపడను నీచందంబున—
వచ్చిన రానీ వార్ధకభావము !
అయిన వితస్తా, అటు లందువు, నీ
జవ్వన మింకను జారనె లేదే.

(సఖితో పాటు నవ్వును. ఒకపార్శ్వమునుండి ప్రవేశించిన సోణకుని జూచి మౌనమువహింతురు)

సోణకుడు

మన ప్రతాపాదిత్య మనుజనాయకు డిచటి
కేతేర నున్నవా డించుమించుగ నర్ధ
ఘటికకాలములోన కాననస్థలినుండి
జాగరూకత యనుచు జాంఘూలికుడు చెప్పె.
అరుదెంచి యుదయాన యాఖేటకేళికై
మన సమీపారణ్యమండలమునకు నేడు
వచ్చుచున్నా డిటకు వాంఛ జనియింపంగ.
రెండుమూడు దినమ్ము
లుండనోపును రాజు
విస్మృతిం గని రాష్ట్రి
విషయాలు మనయింట.
అవకాశ మొసగగనే
అరుదెంచుచున్నాడు:
నృపుమనోరంజనం
బెటు చేయ నేర్తుమో
ఉదయ మొందుచునున్న
దొక్కింత సంశయము
జ్ఞప్తి వచ్చుటజేసి
గత మైనవృత్తంబు.

వి త స్త

రాజు వచ్చినను రానీ నిండుగ
పరివారముతో ప్రభాభవనమున,
కమరాణియు మటు లన్నివిధంబుల
వినోదములతో వేడ్కం దేలును.

సోణకుడు

ప్రభువునాహ్వానాన
ప్రాసాదమున నేను
పవలు రేయియు గడపి
పయనించు సమయాన
దరహాసమున రాజు
దరిసి యాదరముతో
సౌఖశాయకువోలె
సౌఖ్యమా, నిండుగా
నిద్ర పట్టెనె శ్రేష్ఠి,
నీకు గతరాత్రమున
అని యడుగ నిట్లంటి
నాలోచనము లేక—

నరేంద్ర ప్రభ

ప్రభువుమనసు చివుక్కనెడి
పలుకు నోట వచ్చినదా ?
దుర్లభక ప్రతాపుండు
దొడ్డవాడె యని వదంతి.

శోణకుడు
రసవంత మగు విందు, రాజోపచారముల్
విస్మరించుట కెపుడు వీలు కానివి దేవ!
కాని, సుందర మైన కక్ష్యలో దీపికా
తతనీలధూమాన తలనొప్పి పుట్టినది—

నరేంద్రప్రభ
ప్రాసాదమునందు ధూమ
పటల మేల యలముకొనెనో!
కుపితుడు కాలేదు గదా
కువలయేశు డీమాటకు?

శోణకుడు
మీహర్మ్యమున కెపుడో
మేము వత్తుము లెమ్మ
దివసత్రయము సేద
దేరగా నని రాజు.

విశస్త
మన భవనములో మణిదీపికలే
వెలుగును గావున విడువు విచారము.

నరేంద్రప్రభ
మణిదీపికలకాంతి మాట యొకటే కాదు,
రసికు డైనన్నృపాలు రంజనార్థం బిచట
సర్వశక్తులతోడ జతనంబు చేయవలె.

శోణకుడు
నిజము: లోపము లున్న
నృపతి సరసుడు గాన
అన్యథా భావింప,
డయిన సిగ్గగు మనకు

శ్రీ లేఖ
• రా జెటు లుండును? రసికుడు సరియే:
చక్కనివాడా, సాధారణుడా?

నరేంద్రప్రభ
తినబోవుచు రుచు లేటికి?
దేవరదర్శనము మనకు
సంప్రాప్తించుచు నుండగ
క్షణములోనె శ్రీలేఖా!

శోణకుడు
వ్యాయామకర్కశం బయ్యు మెత్తనియొడలు
భయదసంగరరంగ పరిచయంబును గాంచి
చెక్కు చెదరని మేను, స్నిగ్ధగండద్వయము
నిగనిగలనెమోమును నిండుయౌవనమూర్తి-
(సఖులు పరస్పరము ముఖావలోకనము చేయుదురు.)

విశస్త
నియమితస్థానాల నిలిచి యుండము ముందు
సపరివారమ్ముగా, చనుదు ద్వారముకడకు-
జనవిభుం డేతెంచుసమయ మాసన్నంబు.

(అందరు సింహద్వారముకడకు బోవునప్పటికి పూర్ణకుంభములు, పుణ్యాంగనలు, మంగళవాద్యముల వారు బారులు తీర్చి కానబడుదురు.)

శోణకుడు
(ముందరికి పరికించి చూచి)
అప్రమత్తులు కండు! అదుగో మహారాజు
అశ్వ మారోహించి అరుదెంచుచున్నాడు:
కొలది పరివారమే కూడ కానంబడును.

(శోణకుడు పురుషశ్రేణిలోనికిని, ప్రభాప్రభృతులు స్త్రీశ్రేణిలోనికినిబోయి, అగ్రమున నిలుతురు. తోడనే తూర్యధ్వని మువ్మారు వినబడును.)

పురుష బృందము
జయజయ కాశ్మీరరాజ్య
జలజ జాగరప్రదీప!
జయ జయ సంపూర్ణసమిత
శాత్రవనృపతిప్రతాప!
జయ జయ కీర్తిప్రమదా
స్తవనీయాఖిల జేతా!
జయ జయ నూత్నప్రతాప
నన్నగరీ నిర్మాతా!
జయ జయ రాజప్రతాప,
జయ జయ జయ.

(లాజలు, పుష్పములు చల్లుదురు. రాజు ముందరికి వచ్చి నిలుచును.)

స్త్రీ బృందము

(హారతి పళ్ళెరములతో)

మంగళము కాశ్మీర నాయక
మణికి, శ్రీమదనంగలేఖా
రాజ దుర్లభవర్ధనాత్మజ
రత్నముకు జయ మంగళమ్
ధర్మమార్గ ప్రవర్తకునకు,
దయావీరున, కంగనాజన
పంచబాణున, కస్మదీయ
ప్రభువునకు నన్మంగళమ్.

సోణకుడు

(ముందరి కడుగు వేసి)

స్వాగతమ్ము దేవా, నదయహృదయులౌ మీ
పదకమలస్పర్శచే ప్రాంగణమ్ము పొలిచె !
స్వగృహమ్ముగా ఈ సదనసీమ దేవా,
తలచి తాము నన్ను ధన్యు జేయవలయు!

(వినీతుడై చేతులతో మార్గము చూపును. రాజు మందహాసముతో నకేంద్రప్రభనంక జూచును. ఆమె చెక్కిలులు జాజావారును)

## ద్వితీయ రంగము

[మరునాడు ప్రాతఃకాలమున ప్రభాభవనములో రాజు నివణ్ణకమున నుపవిష్టుడైయుండును. సోణకుడు ప్రవేశించును]

సోణకుడు

సుప్రభాతము దేవ !
సుఖనిద్ర పట్టెనా ?...
ఇది యేమి నేత్రమ్ము
శత్రవారిన వేల ?

రాజు

సుప్రభాతము శ్రేష్ఠి !
సుప్తి తృప్తిగ లేదు,
కలతనిద్దురలతో
గడచి పోయె త్రియామ.

సోణకుడు

బాధ మయ్యెనె కుసుమ
పరిమళమ్ములు, దీప
కాంతిచే గలిగెనా
కన్నుదోయికి క్లమము ?

రాజు

సాంద్రమ్ముగా లేదు
సౌరభము, మణిదీప
కాంతిచే కనుగవకు
క్లాంతి యొదవను లేదు.
కాని బడలిక జెందె
కాయమ్ము, మానసము
కలతనొందెను, లేదు
గాఢమైన సుషుప్తి.

సోణకుడు

స్వప్నమే కద ? కాక
వైద్యుబిలిపించెదను
ఆజ్ఞ యిత్తురయేని
అధిపు, లీక్షణములో.

రాజు

స్వస్థమె దేహము స్నానానంతర,
మగదంకారున కవసర మేదీ ?
స్నానద్రోణులు చక్కని వోయీ
శ్రేష్ఠీ, ఎచ్చట చేయించితివో ?

సోణకుడు

దేవా, రోహితదేశ నిర్మితము,
లంపుదు కోటకు నానతి యగుచో.

రా జా

పంపకు, మూరకె ప్రశ్నించితి లే!
నీవిభవమునకు నిండుహర్ష మగు.

సోణకుడు

దేవరదయయే దీనికి హేతువు:
అంతయు స్వీయం బని భావింపుడు.
ద్వారముకడ తమదర్శనార్థమై
ప్రముఖులు కొందరు ప్రతీక్షించెదరు

రా జా

అస్వస్థత యుని అందర నెట్లో
చల్లనిమాటల సాగనంప వలె.

సోణకుడు

విప్రకవిని తమ వేడుకకొరకై
ఆహ్వానించితి ఆనతి యిత్తురె?

రా జా

మంచి దా కవినిమాత్రము రమ్మను:
అన్యులతో మాటాడం జాలను!

[రాజా కన్నులు మూసికొనును. సోణకుడు వెడలిపోయి, వర్ధనస్వామితో ప్రవేశించును]

కవి

స్వస్తి భవతే దేవ!
సంతోష మీనాడు
కశ్మీరనాయకుని
కనుగొనం గలిగితిని.

రాజా

కుశలమా తరుణకవీ?
కూర్చుండుము పీఠముపై,
నిలుచుండెద వేల శ్రేష్ఠి?
నిజనామం బేమి కవీ?

కవి

వరదు డైన దేవుబట్టి
వర్ధనస్వామి యనుచాని
పేరు పెట్టినారు నాకు
పెద్దవారు మహాప్రభూ!

రాజా

అంద మైనపేరు కవీ!
అట్టె కవిత్వమ్ము కూడ
సరస మైన దని తలంతు:
సంస్కృతమా, ప్రాకృతమా?

కవి

సంస్కృత ప్రాకృతముల
సమముగానె కవిత్వమ్ము
చెప్పగలను దేవవాణి
స్థిరము చేసికొంటి దేవ!

సోణకుడు

ప్రాకృతమ్మునందు కవిత
పామరులకు గూడ దెలియు.
స్వామి, మానుకొంటి వేమి
జనరంజక మైన వాణి?

కవి

తీరిపోవు నారోజులు!
దేవభాషకే ప్రశస్తి,
కవిశేఖరు లీవాక్కున
కావ్యములన్ గ్రథియింతురు.

రా జా

నీవు పలికినట్టి మాట
నిక్కువమ్ము కవిశేఖర!
కాశ్మీరమునందు మహా
కవులది గీర్వాణవాణి.
గాథ లైన, అనిబద్ధ
గ్రంథభాగ మైన కవీ,
జ్ఞప్తి యున్న వినిపింతువ
[illegible]

క వి

సంతరించుచున్నవాడ
 సర్గబంధ మొకటి, కాని
కలుగకుండ విసువు తమకు
 గాథలు పాడెదను దేవ !
తుహినసంఛన్న మై
 తోచు కశ్మీరమ్ము
నగరాజపుత్రికా
 నాథు దేహప్రభల.
పైభాగమున మహాపద్మనామకసరసి
 కశ్మీరశశికంఠు గళదీప్తి బోలుపారు.
తెల్లనై కశ్మీరదిశలుభస్మముదాల్చు
 వీరమాహేశ్వరులవిధమునం జెలువారు.

రా జు

నిర్మలం బైనవాక్కు-
 నీది కవీ! శివస్తోత్ర
పరిపూతం బైన జిహ్వ
 ప్రసవించును కవితాసుధ.

క వి

పక్షపాతము లేక పలుకుడీ సత్యమ్ము
 భరతవర్షప్రజల్, బాగుగా యోజించి
కశ్మీర సుందరీగణముకన్న మనోజ్ఞ
 మైన దెచ్చట నైన అవనిపైగలదేమొ
కశ్మీరముం గాంచి కాదె కవిశేఖరులు
 స్వర్లోకకల్పనము సలుప జాలినవారు?

రా జు

ఎంత దేశభక్తి నీది !
 ఈ హారము స్వీకరించు
కాశ్మీరప్రభువుచేతి
 కానుకగా కవిశేఖర !

క వి

ఈ యమూల్యహారము నే
 నేమి చేసికొందు ప్రభూ !

దేవరకంఠమునందే
 దీపించుచు నున్న శుభము.

రా జు

కానుక యన్నను కవు లెగబడుదురు,
 నిస్పృహ కలదే నీకు కవీశ్వర !
నీకు వలదులే, నీయిల్లాలిని
 తాల్పగ నిమ్మా తన కంఠమ్మున.

(కవి మందహాసము చేయును)

ఆహా తెలిసిన ! దవివాహితుడవ !
ఉన్నను ప్రియురా లొసగు మాయమకు.
కవి యగువానికి కాంతయొ ప్రియయో
ఉండుటనిక్కువ, మూహాముసరియా?

క వి

సర్వం బెరిగిన జగతీశ్వరునకు
 సత్యమె తోచుట సముచితమే కద!
అయినను నాప్రియురాలికి హారము
 గళమున నుంచుట కష్టమె దేవా !

రా జు

(ఆలోచించి)

అంతటి దుర్లభురాలా నీప్రియ !
 కవిశేఖర, నే కనుగొన వచ్చున ?

క వి

దేవరయాజ్ఞకు తిరుగు కలదె ! మరి
 ఉన్నది యిందుల కొక యాతంకము.

రా జు

దాపక తెలిపిన తగుసాయము నీ
 కగును కవీశా, అచిరముగా నే.

క వి

ప్రభువు క్షమింతుర్ ! పరకీయారతి
 అందురు దోషం బఖిలగృహస్థులు.

శోణకుడు

పరకీయనాయికా ప్రణయమ్ము దోషమే
సంఘవ్యవస్థలో సర్వసామాన్యముగ.

కవి

సామాన్యదృష్టిలో సంఘవ్యవస్థలో
కావచ్చు దోషమ్ము: కానియొక్కొక యెడల
తీవ్రబాధాదగ్ధదివ్యానురాగమ్ము
పరకీయయెడ నైన ప్రస్తుతింపందగును.

రాజు

వేగిరపడి కవి, వేడి రక్తమున
అనుచిత కార్యం బాచరించితివ ?

కవి

చేయలేదు మహాప్రభూ,
చిత్తవృత్తి ప్రకోపించె
ననుట నిక్కువంబె కాని
అణచుకొంటి ప్రయత్నమున.
కాని ఆమెమీద నిండు
కావ్య మల్లుచున్నవాడ,
వేడ్క గలుగునేని దేవ,
వినిపించెద రాత్రివేళ.

రాజు

వింత గొలుపుచున్నది నీ
విధానంబు! రాత్రి గాని
పవలు కానె కాద కావ్య
పఠనయోగ్య మైనవేళ ?

కవి

రాతిరివేళనె రచియించెడి నా
కావ్యము వినుటకు కాలము రజనియె.

రాజు

శ్రీనగరములో స్వేచ్ఛగ నుండువు
ఆస్థానమ్మున కడుగుదెరతువా ?

కవి

తమియింపుడు దేవా నా
సాహసమ్ము ప్రతాపపురము
విడిచి యన్యనగరమునకు
వెడలి పోవు శక్తి లేదు.

రాజు

మాకు తెలిసె కవీశా, నీ
మనసులోని మాట! ఏల
నిలువవలయు ప్రియురాలికి
నీకు నడుమ నెవ్వరైన ?
మనసు పుట్టినపుడు నీకు
మాసన్నిధి కెట్టివేళ
నైనను రావచ్చు కవీ!
అధికారం బిచ్చినాము.

కవి

చిత్తము, మహాప్రసాదము!
శ్రీనగరం బెపుడో వత్తు.

శోణకుడు

దేవర యెంతటి రసికులో
తెలిసికొంటివా కవీశ!

(రాజుకు వినతుడై)

స్వామి కవితయందె కాక
చతురంగమునందు గూడ
ప్రావీణ్యము కలుగువాడు
పరికింపగవచ్చు దేవ!

రాజు

చెప్పవు శ్రేష్ఠీ శీఘ్రమె పాళిక
హంసపదికచే సంపంగలవా ?

(శోణకుని ప్రస్థానము)

చిన్నవాడ వయిన నీకు
చెప్పవలతు రహస్యమ్ము

దాచి యుంచి మనసులోనె
తగువాక్కులు పలుకగలవ ?

క వి

శక్తికొలందిని స్వామి సేవనము
చేయుటకై నే సిద్ధ మెల్లపుడు.

(హంసపదిక వచ్చి వినతయై చతురంగపాళిక పీఠముపై నమర్చి, వెనుకకు నడిచి నిలిచి, మెల్లగా)

హంస పదిక

ఆతురముగ తమయనామయమ్మును
విన మాస్వామిని వేచియున్నయది.
అనతి యగుచో నరిగి తాయమకు
విభువాక్యంబులు విన్నవించెదను.

రా జా

(కొంచెమాలోచించి)

గత రాత్రమున నిచట కలతనిద్దురె కాని
గాఢమైన సుషుప్తి గననైతినని చెప్వు.
మాకోటలో నైన మణిదీపికాశ్రేణి
నేటివరకును లేదు నిజముగానని చెప్వు
దేహమ్ము నాకు స్వాధీనమే యెల్లపుడు
కానినామానసముకలక బారినదనుము

(హంసపదిక నమస్కరించి వెడలిపోవును. ఉభయులు చదరంగ మాడుదురు.)

క వి

దేవా, యేదో తెలుపుదు మంటిరి.
మాటలనడుమను మరపు కలిగినది.

రా జా

కాదు కవీ. నీకావ్యము వలెనే
విభావరిని నే వినిపింపంగల.
పగటివేళలో పలుకం జాలని
రహస్యవాక్కులు రాతిరి వెడలును
చంద్రకాంత మణిచాలున రసనయు
[illegible]

(ఎత్తు వేయును)

క వి

అదిగో దేవా, ఆట కట్టుటకు
సిద్ధంబైనది; చిత్తగించితిర ?

రా జా

గట్టివాడ వోయి కవీ !
కట్టిపోయె నాటః యిపుడు
ఏకాగ్రత లేదు సుమీ,
ఎత్తు వేయజాల కవీ !

హంస పదిక

(ప్రవేశించి)

ప్రభు, మాయజమానురాలు
బాధపడియె తమపల్కుల
నాలకించి, నను క్రమ్మర
నంపె సన్నిధానమునకు.
ఉపచారములో లోపము
లున్నను క్షమియింపు డనియె,
ఏలిక చేతోరంజన
కేమి చేయవలయు ననియె.

రాజా

హంసపదికా, నీదు యజమానురా లెంత
సదయహృదయయొనాకు చక్కగా దెలిసినది.
తెలుపుదువ తన్నామధేయ జాజ్వల్యమ్ము
లౌ సువర్ణమ్ముల, నాలకింపగ వలతు.

హంస పదిక

చిత్త, మానామమ్ము శ్రీనరేంద్రప్రభా—

రాజా

ఎంత మధుర మైననామ
మీయభిధమె శ్రేష్ఠి దివ్య
భవనమునకు నుంచినాడ
[illegible]

సకలవస్తుసంభృతమౌ
సౌధమ్మున లోప మేమి!
స్వస్థమ్మె యని చెప్పుము
స్వామిని కుశలప్రశ్నకు.

హంస పదిక

చతురులాలు మాస్వామిని నాట్యము
సం దని దేవర కవిదిత మేమో.
ఆనతి యగుచో నభినయించు నట
స్వామిరంజనకు శర్వరివేళను.

రాజు

సౌభాగ్యము! మీస్వామిని నాట్యము
స్వయముగ జేసిన స్వర్గోపమమే!
నాకభిమానము నాట్యం బన్నను:
నృత్యము చేయుదు నేను — నమ్ముదువ?

హంస పదిక

ఏటికి నమ్మను? ఎల్లకళలలో
ప్రభువులు మిక్కిలి ప్రగల్భులే కద?

రాజు

అరుగుదెంతువా యామినివేళను
ఆలోకింపగ అభినయమ్ము కవి?

కవి

చిత్తము దేవా! సెలవా ప్రకృతము?
పుస్తకమ్ముతో పునర్దర్శనము!

(కవి యథోచితముగా ప్రస్థానము)

రాజు

హంసపదికా, రాత్రి అద్భుతమ్ముగ నీవు
చేసితివి నాట్యమ్ము చిత్త మిగు రొత్తంగ.

హంస పదిక

ప్రభువునను గ్రహ పాత్రం బగునెడ
ధన్యురా లగును దాసి మహాప్రభు!

రాజు

నీస్వామినికి గూడ నేర్పు కల దంటివే
నృత్యమ్ములో, నెచట నేర్చికొన్నది దేవి?

హంస పదిక

చెప్పించినారు మాశ్రేష్ఠి తమయిల్లాలి
కెల్ల నాట్యము గురువు నేర్పాటు కావించి.

రాజు

నిరుపమసుందరి నీస్వామిని సుమి!
వైశ్యకులమ్మున వజ్రము పుట్టెను!

నిన్నటిపాటయు నేత్రద్యుతియును
అచ్చుపడెను నాయంతరంగమున
తలచిన కొలదిని తన్మయత్వమే!
స్వామిని కెంతటి సంతానంబో?

హంస పదిక

(మందహాసముతో)

నేటివరకును నెల తప్పదు మా
నరేంద్ర దేవికి- నమ్ముడు దేవా!
ఇచ్చట బడినది యేమి కర్మమో
రాచకొలమ్మున రంజిల దగినది!

రాజు

అవును, నిజమే హంసపదికా!
ఆమె రాచకొలమ్ములోనే
రత్నమట్లు విరాజిలం దగు
రమణియే సుమీ్మ!
నిజము పలికెద హంసపదికా,
నిన్న సాయంసమయమందే
మీనరేంద్రప్రభను గాంచిన
మీద మతి పోయెన్!

హంస పదిక

తెలియదనుకొంటిరా దేవ, యీమాత్రమ్ము?
గ్రహియించితిమి మోము కనుగొన్నతోడనే.

రాజు

నిజముగా నర్తకీ, నే బయట బడితినా ?
శ్రేష్ఠి కీ విషయమ్ము చెవి సోక లేదు గద!

హంస పదిక

మానసేంద్రా దేవి మాత్రమ్ము గ్రహియించె-

రాజు

ఆమె యే మన్నదో హంసపదికా, చెప్పు !

హంస పదిక

పయి కేమి యనకున్న బాధపడుచున్నయది
మానసేంద్రా దేవి మానసమ్మున ప్రభూ !

రాజు

మధురవార్త తెలిపితి వీ
మణిహారము కైకొమ్మా
హంసపదిక, ఆమెకడకు
నరిగి మరల నరుదెంతువ ?

హంస పదిక

చిత్తము దేవా! చెప్పెద దేవికి
వీలు చేసికొని విజనతలమ్మున

[బయలు దేరును]





శ్రీ శైలములోని మల్లికార్జునస్వామి ఆలయము



శేషాచలముమీద శ్రీనివాసుని సన్నిధి నున్న పుష్కరిణి

# 'అమ్మా, అమ్మా! వస్తున్నా!'

[కథానిక]

శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి

ఇప్పుడంటే ఎవరికీ లెక్కలేకుండాపోయిందిగాని, ఒకప్పుడు టెయిలరువీరాస్వామి అన్న పేరు మా ఊళ్లో నురెవ్వరికీ లేదు. అతనిది మొదట ఈ ఊరు కాకపోయినా, వచ్చిన ఆరునెల్లలోనే ఊరంతా అతని పేరు వ్యాపించిపోయింది. ఊళ్లోకి ఏ కొత్త ఫాషను వచ్చినా అతని చేతిమీదుగా రావలసినదే. అసలు ఎవరయినా కొంచెం వింతగా ఉన్న చొక్కాగాని కోటుగాని తొడుక్కున్నా, అది వీరాస్వామి కుట్టినదంటే మరి మాట్లాడ్డానికి వీల్లేదు. శంఖంలో పోసిన తీర్థం. అతని టెయిలరింగుహోము మెయినురోడ్డు మీదికి లేకపోతే నేం, ఫాషను పనివాడితనం కావలసిన వాళ్ళంతా అతనివద్దకే వస్తూండేవారు. అయితే అతనికి ఇంకొకకీర్తికూడా ఉండేది. పని ఒప్పుకున్నాడంటే అన్న నాటికి ఖచ్చితంగా చేసి ఇచ్చేసే దన్నమాటే. కాక, కేవలం మెషినుమీద పనిచెయ్యడానికే తనదగ్గర నలుగురు పనివాళ్ళూన్నాతప్ప, కత్తిరింపులూ-వస్తూ తను స్వయంగా చెయ్యవలసిందే. ఎవరయినా హితకాంక్షులు "ఏమయ్యా వీరాస్వామీ, ఇంతపని ఇలా నావల్ల కాదని విడిచిపెట్టేయ్యకపోతే మరొక ఇద్దరు పెద్దపనివాళ్లను పెట్టుకొని, నువ్వు పైన అజమాయిషీ చెయ్యకూడదా? అసలు నువ్వింకా ఈవీధిపట్టుకుకూర్చోడమేమిటి? నువ్వే వస్తానంటే మెయినురోడ్డులో స్థలమే దొరక్కపోతుందా?" అని అన్న సమయాల్లో, "ఏదో బాబూ, ఇలా నడిచిపోతే చాలదా, ఆ పరమేశ్వరుడి కటాక్షం, ఒకళ్ల చేత పని చేయించి, వాళ్ళకి రావలసింది రాకుండా చేసిన పాతకం ఎందుకు బాబయ్యా! ఇప్పు డీపట్టాళ్ళున్నారంటే వీళ్ళు పనిచేర్చుకొన్నాక, వా ళ్లుంటామన్నా నే నుండనియ్యను. ఏదో ఓమిషనుడొక్కు సంపాదించిపెట్టి నీమానాన నువ్వు బతకరా బాబూ అని పంపించేస్తాను. ఇక నాకేమిటిబాబయ్యా, ఈ వీధిలో కాదు ఊరవతల ఉన్నా చేసు చెయ్యగలిగినపాటి పని రాకపోదు. అంతకంటే నాకు మరి ఆశ లేదు. అంతా ఆ సర్వేశ్వరుడి కృప" అని ఒకతరహా వేదాంతిలా మాట్లాడేవాడు.

అటువంటి వీరాస్వామికొట్టు ఎక్కడుందో ఇటీవలివాళ్ళకి చాలామందికి తెలియదు. మొదటి నుంచీ తెలిసినవాళ్ళయినా, ఇప్పుడు వీరాస్వామి కొట్టంటే అదొకమాదిరిగా ఏమిటో తమకే తెలుసునన్నట్లుగా తల పంకించి పెదవివిరిచేవాళ్ళే. ఎంత అభిమానం ఉన్నవాళ్ళయితేమట్టుకు ఇచ్చిన బట్టలు కుట్టకపోతేమానె, ఆరునెలలనాడయినా స్వస్వరూపంలో అయినా తిరిగిరాకుంటే ఎలా భరించగలరు? పూర్వం వీధిఅరుగులమీద కుడితట్టున ఒక మెషీను, ఎడమవైపున రెండుమెషీన్లు ఫాక్టరీచక్రాలకంటె నియామకంగా తిరుగుతూఉండేవి. కుడితట్టు మిగిలిన జాగాను అతను కత్తిరింపుబల్ల పెట్టుకొని కూర్చొనే వాడు. సమీపంలో కాజాలు కుట్టే కుఱ్ఱవాళ్ళు ఒకళ్ళిద్దరు ఉండేవారు. ఆరోజుల్లో అతని కొట్టు ఆ వీధికి సినిమాహాలువంటి అలంకారంగా ఉండేదన్నా వింత లేదు. అప్పుడు కొందరు, "ఏమోయి, నువ్వు ఒక పెద్ద బోర్డయినా కట్టవు" అంటే వీరాస్వామి రాగవరుసని 'జగమెరిగిన బ్రాహ్మణునకు జంధ్యం ఏలా' అనేవాడు, ఇంటి చూరు బల్లకు కొంచెం వెనకగా వాసాలకు

వేలగట్టిన వి. వీరాస్వామి, టెయిలరు (ఇంగ్లీషులో) అన్న చిన్న నల్లటి బోర్డుతప్ప మరేవిధమయిన పటాటోపమూ ఉండేది కాదు.

అప్పుడతను చెప్పినట్టే బోర్డు అవసరం ఉండేది కాదు. ఇప్పుడు అందుమీది అక్షరాలు చాలా భాగం అస్పష్టంగా అయిపోయేయి; కాక వాటి ప్రయోజనమూ అట్టే లేదు. ఏమంటే అసలు మనిషంటూ ఇంటి దగ్గరఉండి ఎప్పుడయినా పనిచేస్తేకదూ. ఎడమవైపు చిన్న కొట్టూ అరుగూ కలిసి ఇప్పుడొక కిళ్లీసోడాదుకాణంగా పరిణమించాయి. వీరాస్వామి ఇంటిదగ్గర ఉన్నా లేక పోయినా, అరుగుకి అలంకారార్థం అన్నట్లుగా ఒక మెషీన్ మాత్రం కుడి కట్టు కనిపిస్తూ ఉంటుంది. అంతే కాని, ఎవరూ బట్టలు కుట్టడంమాత్రం కనబడదు. అయితే అప్పుడప్పుడు సాయంకాలాలను, రాత్రి పదిగంటలవరకూ ఇంటిలోపలనుండి మెషీనుశబ్దం వినిపిస్తూ ఉంటుంది. అటువంటిసమయాల్లోమాత్రం వీథిఅరుగుమీద మెషీన్ కనబడదు.

ఆవేళ రాత్రి పదిగంటలు దాటిపోయింది. కాని, ఇంకా మెషీనుశబ్దం వినిపిస్తూనేఉంది. గదిలో ఒక పెద్ద పందిరిమంచం, రెండు చిన్న మంచాలూ, ఒక బట్టలుకుట్టే మెషీన్, బీరువా, ఒక టేబిలూ ప్రధానంగా ఉన్నాయి. గది ఒకమాదిరిగా విశాలమయినదేకాని, ఉన్న సామానువల్లనూ మధ్యస్థలం అట్టే లేక కొంచెం ఇరుకుగా కనిపిస్తుంది. చిన్నమంచాలలో ఒకటి కిటికీకి దగ్గరగా ఉంది. ఆమంచంమీద తలగడ వేసుకొని, కిటికీకి ఆనుకొని ఉంది కాంతమ్మ. అసలే పాలిపోయిన మొగం, లోతుకు పోయిన కళ్ళు! ఆ మనిషి కిటికీలోంచి వచ్చిపడే వెన్నెలవెలుగులో మరీ బలహీనంగా కనిపిస్తూంది.

కిటికీలోంచి అలా చంద్రబింబంవంక చూస్తూంటే ఎందుకో సన్నని చిరునవ్వు ఆమె పెదవులమీద మెరిసింది. అంత లోతుకుపోయిన కళ్ళలోనూ ఏదో చిత్రమయిన వెలుగు వచ్చింది. అంతలో మెషీనుశబ్దం ఆగిపోయింది. నిశ్శబ్దంగా ఉండే చోట హఠాత్తుగా శబ్దం అయితే ఏలా గుంటుందో, ఎడతెగకుండా అయే శబ్దం ఆగిపోయినా అలాగే అనిపిస్తుంది. ఆమెదృష్టి చంద్రబింబంమీదనుండి మెషీనుమీద పనిచేస్తున్న కుమార్తె రేవతిముఖబింబంమీదికి ప్రసరించింది. కాని, అట్టేసేపు నిలవలేదు. మళ్ళీ చంద్రబింబంవంకకే దృష్టి తిరిగింది. కాని ఈమారు పెదవులు చిరునవ్వుతో వికసించలేదు. మీదిపెదవి కొద్దిగా కంపించింది. ముకుపుటాలు కొద్దిగా పెద్దవయేయి. కళ్ళలో ఇందాకటి వట్టి వెలుగు కాక, చంద్రబింబాన్ని స్పష్టంగా కనబడనీయని నీటితెర ఏర్పడింది. అయితే ఈ పరిస్థితిని ఆమె సర్దుకొని, నవ్వూ ఏడుపూ రెండూ లేని, మామూలు మనిషి అవడానికి అట్టేసేపు పట్టలేదు. కాని, అంతలోనే ఎప్పటికంటే నిబ్బరంగా మెషీను శబ్దం సాగింది.

ఆమెమంచంమీద కొంచెం ముందుకి వంగి, "అమ్మాయి, రేవతమ్మా, మరి పడుకోకూడదూ, మొదటి ఆట సినీమానుమనుష్యులు వెళ్లిపోయి చాలాసేపయింది. గుమ్మంలో రాజమ్మ కొట్టుకూడా కట్టేసి వెళ్లిపోయింది." అంది. అంత బలహీనమయిన మనిషికి అంత నిండయిన గొంతు ఉందని అనుకోడం కష్టమే. కూతురు ఏమీ మాట్లాడకుండా పనిచేసుకోడం చూసి, "అమ్మాయి, మరి పదిగంటలకల్లా పడుకొంటూ నన్నావు, ఇప్పుడు పదిన్నర దాటిఉంటుందికదా, రేపు ఉదయం మళ్ళీ లేవడం కష్టం" అంది.

తన పని ఆపకుండానే రేవతి, "రేపు శనివారం అమ్మా. అయినా, ఇదుగో అయిపోయింది. ఎలాగూ ఆరెండు చొక్కాలూ అయిపోయేయికదా. ఇదొక్కటి ఉండిపోవడం ఎందుకని. ఇదయిపోగానే పడుకొంటాను. రేపు ఉదయం నువ్వు కత్తిరించి ఇచ్చేనేదంటే, ఆ జాకట్లూ గౌనులూ ఆదివారం సాయంకాలంలోపుని అయిపోతాయి."

"ఆఁ, ఎప్పుడో అయినప్పుడే అవుతాయి, నీ కెందుకమ్మా. బాధ, నీచదువో, నీఆటో పాటో చూసుకోకుండాను"

"నా కిదే సరదాగా ఉందమ్మా, కాక, ఏం, ఇక మరికొన్నాళ్లలో న్కూళ్లలో అందరూ ఏదో

ఒక వృత్తివిద్య నేర్చుకోవాలని పెడుతున్నారటమ్మా. కాదుగాని, అమ్మా, రేపుఉదయం, ఆ జాకట్లూ వాట్లో రోజులో ఒక్కొక్కటయినా నువ్వు నాచేత కత్తిరింపించాలి."

"అలాగేలే అమ్మా, మరిప్పుడు పడుకో కూడదా. నే నెలాగూ కలవేకదా. ఆ మిగిలినది రేపు కుట్టకూడదా?"

"అంతా అయిపోయిందమ్మా, ఒక్క జేబు వెయ్యడమే ఉంది. రేపు పొద్దున కీపని మరి ఉంచకూడదని"

"మంచి పట్టుదలే. పోనీ, ఆకుట్టు ఏదో పూర్తి చేసి, కాజాలు కుట్టడం ఉదయానికి ఉంచెయ్యి."

"అలాగే ఉంచేస్తానుగాని, మరి నేను కుట్టుతూ ఉంటే, వింటూ పడుకొంటే నీకు నిద్రవస్తుందన్నావు?"

"నిజమే, ఇందాకా చిన్నకునుకు పట్టింది కూడాను. కాని, ఆ సినిమావాళ్లు తిరిగివచ్చేటప్పుడు గొట్టె సోడాల కుంయ్, కుంయ్ చప్పుడుతో మెలకువ వచ్చేసింది."

"అయిపోయిందమ్మా నాపని. పోనీ, ఇప్పుడేదయినా పుస్తకం చదువుదునా అమ్మా!"

"ఇంత రాత్రిప్పుడేం చదువుతావులే"

"ఎంతయితే నేమమ్మా. రేపు ఉదయం ఎన్నిగంటలకు లేచినా బాధలేదు. అమ్మా, అసలు రేపు వంటే ఆలస్యంగా చేసుకొందాము. ఒకవేళ వంటయిపోయినా నేనూ పన్నెండుగంటలదాకా తినను. నాన్న రోజూ పన్నెండుగంటలకిగదూ ఇంటికి ఒస్తున్నారు. నేను రేపు నాన్న వచ్చేదాకా ఉంటాను."

"అలాగే లే అమ్మా, రేపటిసురించి ఇప్పుడాలోచన ఎందుకు?"

"అందరూ ఎన్నో నెలలూ సంవత్సరాలగురించో ఆలోచిస్తారుకదా. అటువంటిది రేపటిగురించి ఆలోచించకూడదా? అయితే, మరేమిటి, తెలుగుపద్యాలు చదవమన్నావా? కథలు చదవమన్నావా?"

"పద్యాలెందుకులే శ్రమ. కథలే, మెల్లిగా చదువుకో. నీకూ నాకూ ఇద్దరికీ నిద్రవస్తుంది" అంది.

కాంతమ్మ ఉద్దేశం సరిఅయినదే. చదవడం మొదలుపెట్టిన పదినిముషాల్లో రేవతి చదవడంలో తడబాటుపడడం, చదివిన వాక్యమే మళ్లీమళ్లీ చదువుతూ ఆగిపోతూఉండడం జరిగింది.

కాంతమ్మ మంచం దిగివెళ్లి, నెమ్మదిగా పుస్తకం తీసుకొని, "పడుకో అమ్మా, చాలా రాత్రి అయింది" అంది. ఆమాట సరిగా తెలియనేలేదు రేవతికి. కాంతమ్మ దీపం తగ్గించి, దానిని యథాస్థానాన మిషినుదగ్గరగా పెట్టివచ్చి కిటికీలోకి చూస్తూ కూర్చుంది. చందమామ కిటికీకి అందనంత ఎత్తుగా వెళ్లిపోయేడు. అక్కడయినా మబ్బులు కమ్మినట్లున్నాయి; వెన్నెల ఏమీ కాంతివంతముగా లేదు. ఇందాకా చందమామ ఉన్నప్పుడు సరిగా కనబడని ఒకటిరెండు నక్షత్రాలు ఇప్పుడు స్పష్టంగా మినుకు మినుకు మంటున్నాయి. కొంచెంసేపు అలా చూసేసరికి తలనొప్పి వచ్చినట్లయింది.

లేచివెళ్లి దీపం తెచ్చి కిటికీలో పెట్టి, అమ్మాయి ఇందాకా చదివిన పుస్తకం తెచ్చుకొంది. కాని, తీరా తెచ్చుకొన్నాక చదవాలనిపించలేదు. పాపం, అమ్మాయి యింతరాత్రివరకూ కుడుతూనేవుంది. ఇక రేపొద్దున దానికోసమేకదా విడిచిపెట్టాలి. ఇప్పుడు ఎలాగూ నిద్రపట్టేటట్టు లేదు. ఆ కాజాలు కట్టేస్తే కాలక్షేపంగానయినా ఉంటుందనుకొని, వెళ్లి అమ్మాయి కుట్టిన చొక్కాలు తెచ్చి మంచంమీద పెట్టుకొని, కాజాలు ఒక్కొక్కటే కుట్టసాగింది. అలా కొంచెం కుడుతూ ఉండేసరికల్లా ఏదో ఆలోచన వచ్చేదికాబోలు, కొంతసేపు ఆగిపోతూఉండేది. కాని, ఇందాకా ఊరికే నక్షత్రాలవంక చూస్తూఉంటే వచ్చిన తలనొప్పిమాత్రం ఏమీ లేదు. న్యాయంగా తను పదినిమిషాల్లో చెయ్యవలసిన పనే కాని గంటపైగా అయినా పూర్తికాలేదు. అయినా కాంతమ్మకు విసుగు కలగలేదు. తను కాలక్షేపంకోసమేకదా ఈపని చేస్తున్నది......సుమారు పన్నెండున్నర అవుతూ ఉండగా నిద్రవచ్చినట్లయింది. అయినా చేతిలో ఉన్న

ఒక్కటే పూర్తిచేయ్యాలనుకొంది. కాని అది పూర్తి కావడమే కనబడలేదు. అలా చిన్న కునుకు వస్తూంది పోతోంది.

అంతలో వీథితలుపు చప్పుడయింది. ఆ చప్పుడామెకు హృద్గతమయినది. మొదటి మారు చప్పుడుతోనే ఆమెనిద్ర అంతర్ధాన మయిపోయింది. కాని, ఆమె లేచివెళ్ళి తీసేలోపునే, వరసగా అదేధోరణిని చప్పుడు ఎడతెరిపిలేకుండా కాసాగింది.

కాంతమ్మకు నిజంగా కోపమే వచ్చిందిగాని దానిని నవ్వులోకి మార్చుకొని, తలుపు తీస్తూ, "ఎందుకంతలా చప్పుడుచెయ్యడం, అమ్మాయి నిద్రపోతూంది. ఇరుగుపొరుగులవాళ్లుకూడా నడిరాత్రి నిద్ర పాడయిందంటారు." అంది సస్మితంగా.

వీరాస్వామి ఏమీ సమాధానం చెప్పకుండా ఆమెమొగంలోకి తీక్ష్ణంగా చూచి, ధర్రున వెళ్లి పెద్దమంచంమీద కూలబడ్డాడు.

కాంతమ్మ గడియ వేసుకొని, నెమ్మదిగా వచ్చి "ఒక్కమారు లేస్తే, దుప్పటి దులిపి పక్క పరుస్తాను" అంది.

వీరాస్వామి మంచంమీద అడ్డుగా గోడకు చేరగిలబడి, సగం కళ్లుమూసుకొని, "అవును, ఇప్పటివరకూ కానిది, ఇప్పుడు తీరికయింది. పక్క వేస్తుందట పక్క. చాలిందికాదేమిటి, హుఁ" అన్నాడు.

కాంతమ్మకు తెలుసును ఇటువంటి సందర్భాలలో తా నేమి మాట్లాడినా ధోరణి మరీ చెడుతుందనీ, ఆతను కోపం తెచ్చుకొని వీథిలోకి వెళ్లిపోతాడనీ. అంచేత మాట్లాడకుండా వెళ్లి తన మంచంమీద కూర్చుంది. ఇందాకా కొంచెం వస్తున్నట్లనిపించిన నిద్ర మాయమయిపోయింది. పోనీ, మళ్లీ కుదుటూఉంది, నిద్ర వస్తుందేమోనని. ఇందాకా ఆగిపోయిన పనిని అందుకొంది.

ఇంకా ఆమె ఆరంభించి ఒకనిమిషమయినా అయిందో లేదో, ఉరిమినట్లుగా వీరాస్వామి గొంతు వినిపించింది. "ఏం, పగలూ రాత్రీ ఇదే పని చేస్తున్నావని నాకు చూపెట్టడానికా? నిద్ర మానుకొని, ఇల్లాంటి తెలివితక్కువవెధవపన్లు చేస్తేనే ఆ దగ్గు మరీ ఎక్కువవుతుంది" అన్నాడు.

"నిద్రపట్టకపోతేనే ఇలా కూర్చున్నాను. ఇంతసేపూ, పాపం, రేవతే, నేను వద్దంటున్నా వినకుండా ఇది పట్టింది. నాకు నిద్రరాలేదు. అయినా ఉదయం మళ్లీ అది చెయ్యవలసినదేకదా అని ఇలా చేస్తున్నాను."

"అంటే నీమాటేమిటి? నే నేపనీ చెయ్యకపోయినా నువ్వూ నీకూతురూ ఇద్దరూ కలిసి, నన్ను పోషిస్తున్నారనేకదూ. నేను కష్టపడిచేసి, తెచ్చినదంతా ఎవడికీ కనబడదు."

"మరి లేకపోతే మేం తెస్తున్నామా? తెస్తామా? ఏదో ఇంట్లో ఊరికే కూర్చోలేక ఊసుపోక చెయ్యడం గాని."

"ఊసు పోకపోతే మరోపనీ మరోపనీ లేదూ? ఇదొక్కటేనా? అసలు నామెషీనూ బట్టాపెట్టీ తియ్యవద్దని ఇదివరకే కన్నోమార్లు చెప్పేను. ఇక నీ యిష్టం. అవతల అరుగుమీద రాజమ్మకిళ్లీదుకాణం ఉందికదూ. ఇవతలి అరుగుమీద కాంతమ్మ కిళ్లీదుకాణం, దానికూతురు పిపనుకొట్టూను. ఎలాగూ చేస్తూచేస్తూ దాన్లో దొంగతనం ఎందుకు?"

'మరికొన్నాళ్లకి' అని కాంతమ్మ ఏమో చెప్పబోయింది. కాని అంతలో దగ్గుతెర బలంగా వచ్చింది. ఎలాగో సర్దుకొంటూ పెరట్లోకి వెళ్లింది. వీరాస్వామికి ఒక్కసారిగా కొత్త చైతన్యం వచ్చినట్లయింది. తానూ లేచి పెరట్లోకి వెళ్లేడు. అప్పటి కింకా కాంతమ్మ దగ్గుతూనే ఉంది. అంతసేపూ మసకమసకగా ఉండి అప్పుడే వెలుగెక్కిన ఉమ్ములోని రక్తపు ఎరుపు మరీ భయంకరంగా కనిపించింది వీరాస్వామికి. నెమ్మదిగా ఆమెను పట్టుకొని, "అస్తమానం ఇంతవేరా రావడం ఎందుకు? అగడిలోనే ఇంత పొయ్యిబుగ్గి వేసిన మూకుడు ఒకటి ఉంచుకొంటే, మంచిదని చెప్పేను కదూ" అన్నాడు.

సగం ఎగఊపిరితోనే, కాంతమ్మ, "నాకేం బాధలేదు. అమ్మాయి భయపడుతుంది. ఇక్కడయితే

రెండుచెంబుల నీళ్ళు పోస్తే అవతలికి కదుక్కుపోతుంది" అని చెంబు కుండీలో ముంచుతూ ఉంటే, వీరాస్వామి చెంబు అందుకొని, తానే నీళ్ళుపోసి, ఆమెను నెమ్మదిగా తన ఒంటికి ఆనించుకొని, తీసుకొనివెళ్ళి మంచం మీద కూర్చోబెట్టి తాను పక్కనే కూర్చున్నాడు. కాంతమ్మ కొంచెం సర్దుకొని, "నిద్ర వస్తున్నది కాబోలు, పడుకోకూడదూ" అంది.

అతను "అలాగే, నా పడుకోడానికేముంది! నువ్వు పడుకో." అని తాను మంచంచివరకు జరిగి, తన తొడమీద ఆమె తల ఉంచి, "ఇలా పడుకో, మెల్లిగా. జోకొడుదునా, అసలే ఒంట్లో బాగులేదు కదా, ఇంత రాత్రిదాకా నిద్ర మానుకుంటావా, ఇదంతా నామీద కోపమేకదూ" అన్నాడు.

ఈ మంత్రంతో కాంతమ్మ తన కోపాన్నే కాదు, జబ్బునుకూడా మరిచిపోగలిగింది. పెళ్ళయిన కొత్త రోజుల్లో, తను బలంగా ఆరోగ్యంగా ఉండినప్పుడు, తనకు కోపం వస్తే భర్త అనునయిస్తూంటే పొందిన అనుభూతివంటి అనుభూతిని పొందగలిగింది ఆ మధురస్పర్శతో, ఆ మృదువాక్యాలతో.

అతను నిద్రపొమ్మన్నాడే గాని, ఆమె నిద్ర పోవడం అతనికి ఇష్టమా? ఆమెకుమాత్రం అంతటి ఆనందసమయంలో నిద్రవస్తుందా! చాలాసేపు అతి అన్యోన్యంగా, ఇటీవలి చిక్కుల లేశమాత్రం జ్ఞప్తికి తెచ్చుకోకుండా, వెనకటి రోజులలోని మధురిమను సంస్మరించుకొంటూ, భవిష్యత్తులో చెయ్యవలసిన కార్యక్రమంగురించి కలలుకంటూ, గడిపేరు. కలలంటే కొన్ని మరీ అసంభవంగా కనిపించేవి కావు. రాజమ్మ కిల్లీదుకాణం ఎత్తిపెట్టించేయడం, ఇల్లు కొనుక్కున్నాయనకు బాకీపడిన రెండు నెలల అద్దె చెల్లించేసి అవతలి గదిలో ఆయన పెట్టిన బస్తాలు తీయించెయ్యడం, అమ్మాయి చదువుకోవాలనుకున్నంతవరకూ ఎంతయినా సరే చదివించడం, మళ్ళీ కొద్దిరోజుల్లో పని బాగా సాగడంతో, ఒక రెండువందలరూపాయలు పట్టుకొని వెళ్ళి పెద్ద డాక్టరుగారి చేతిలో పెట్టి, బాబూ, అప్పుడు నాకు అంత చచ్చినంత జబ్బు చేస్తే, మీరే దేవుడిలా బ్రతికించేరు. ఇప్పుడు మీరే ఏట్లాగో మాట దక్కించుకోవాలనడం... ఇటువంటివే కలలు.

ఇద్దరికీ లోపల్లోపల ఇది మరి నయం అయే జబ్బుకాదేమో నన్న భయం ఉంది. కాని ఒకరి సముఖంలో ఇంకొకరికి ఆమాట అనడానికి ఇష్టంలేదు.

అత నింకా అలా మాట్లాడుతూ ఉండగానే ఆమెకు నిద్రపట్టింది. తనకూ కొంచెం నిద్రవస్తున్నట్టనిపించింది. మెల్లగా ఆమెతలను తలగడమీద ఉంచి తాను వెళ్ళి తన మంచంమీద పడుకొన్నాడు.

తరవాత ఒక గంటలోపునే మళ్ళీ దగ్గు వచ్చి లేచిన కాంతమ్మ తెల్లవారేవరకూ మేలుకొనే ఉండడం అతనికి తెలియనే తెలియదు.

ఉదయం నిద్రలేచిన వీరాస్వామి, తొలినాటి రాత్రి వీరాస్వామి కాడు. 'వెధవది కాఫీకుండకూడా లేకపోతే, ఇక ఇల్లెందుకు దరిద్రం' అని విసుక్కోసాగాడు.

కాంతమ్మ "ఇదిగో ఎంత, అమ్మాయిని లేపి, ఎదురింటి రామన్నగారింటి దగ్గరనుండి తెప్పిస్తా"నంటూ ఉంటే, "ఎందుకూ! అక్కర్లేదు, నేనే పోయి తాగి వస్తాను. దాన్ని లేపకు. పడుకోనీ. ఏమయినా చిల్లర డబ్బులుంటే ఇలా పారెయ్యి" అన్నాడు. అసలు నిజానికి వీరాస్వామికి కూతురు రేవతిదగ్గర ఒకరకం మొగమాటం ఏర్పడింది ఇటీవల తాను ఇంటికి సరిగా రాకపోయినదగ్గరనుంచీను. తాను వచ్చినా రాకపోయినా, స్కూలుకు వెళ్ళినప్పుడో రాత్రో నాన్న వస్తున్నారనీ, ఇప్పుడిప్పుడే మళ్ళీ వీధిలోకి వెళ్ళిపోయేరనీ కాంతమ్మ కూతురితో అబద్ధాలు చెప్తున్నట్టు అతని కేం తెలుసును? తొందరతొందరగా వెళ్ళిపోయాడు కాఫీక్లబ్బుకని. ఆ పోవడం అంతే. మళ్ళీ రెండురోజులనాడు రాత్రి ఒంటిగంటకే రాక.

* * * *

పెద్ద మంచమూ బీరువా టేబిలూ లేకపోవడం వల్ల ఆగదే ఇప్పుడు వెనకటికంటె విశాలంగా కనిపిస్తోంది. తల్లీకూతురు ఇద్దరూ మాత్రం యథాస్థానాలలోనే ఉన్నారు, కూతురు బెంచీమీద కుట్టుతూ,

తల్లి మంచంమీద కూర్చుని. అయితే అప్పటికంటె తల్లి మరీ బలహీనంగా తయారయింది. కూతురు పనిలో అప్పటికంటే ఎక్కువ నైపుణ్యం సంపాదించింది. అంతేకాదు, అప్పటిలాగ తల్లి కిటికీలోకి శూన్యదృక్కులతో చూస్తూ కూర్చోవటం లేదు. అప్పటికంటేకూడా బలహీనమయిన వేళ్ళతోనే కాజాలు కుట్టటం, పోగు పొయ్యడం మొదలయిన పనులు చేస్తోంది.

రేవతి చేతిలోని పని అయిపోయేక ఇంకొకటి తీస్తూ "ఎందుకమ్మా నీకు శ్రమ, పడుకోకూడదా, పొద్దున్న పొరుగువాళ్ళ జానకి చేసేస్తుందికదా, లేకపోతే నేనే చేసేస్తాను."

"బాగుందమ్మాయి నీమాట. నిన్ను ఒక్కర్తెను ఇలా రాత్రంతా పని చెయ్యమని చెప్పి, నన్ను హాయిగా నిద్రపొమ్మన్నావా?"

"మరి నాకు నువ్వు హాయిగా నిద్రపోవడమే కావాలి."

"అందుకయినా ఇప్పుడేదో ఇలా కొంత పని చేస్తే తరవాత కొంతసేపయినా నిద్రపడుతుంది. అయినా నువ్వు నీచదువుకూడా మానుకొని, రాత్రింబగళ్ళు తిన్నగా తిండయినా తినకుండా, ఇంతపని చెయ్యడం ఏమీ బాగులేదమ్మాయి."

"ఓస్, ఎంతపనికీ, ఏముంది. ఈ ఒక్కనెల్లాళ్ళే కదా. తరవాత పండుగ వెళ్ళేక, మనం చేస్తామన్నా అట్టే పనిరాదు. కాని, అమ్మా, ఒక్క సంగతి..."

"ఏమిటమ్మా? చెప్పు."

"మరి చేస్తావా, నేను చెప్పినట్టు?"

"ఏమిటమ్మా? చెప్పుదూ."

"ఏమీ లేదమ్మా, ఈ కుట్టుకూలి అంతా నాకే ఇచ్చెయ్యాలి. ఇందులో మరి నువ్వేమీ తీసుకోకూడదు. నే నేం చేసినా సరే అడగకూడదు. నాకు వేరేపనుంది."

"అలాగే కానీ అమ్మా"

"ఆఁ, అలాగే అంటావు. ఏదేదో ఖర్చుచేసేస్తావు. ఇప్పుడు నాకు ఈఉన్న బట్టలు చాలును. అయినా మరి స్కూలుకు వెళ్ళనుకదా. నువ్విప్పుడు నాదగ్గర అలాగే అంటావు, నాన్న వచ్చేసరికల్లా ఎక్కడెక్కడ మూల నున్నదీ తీసిఇచ్చేస్తావు. మరి ఈమారు ఇదేమీ ముట్టుకోడానికి వీల్లేదుసుమా. నేను అంతా బాగా లెక్కవేసేను. ఇప్పుడు నాచిన్నపెట్టెలో ఉన్న ఇరవైఎనిమిది రూపాయలూ, ఈపండుగలో పని ఇప్పటికంటే పని ఎక్కువే ఉంటుందిగాని తక్కువ ఉండదుగదా, మన ఇంటిఖర్చులు పోను, అంతా రెండువందలరూపాయ లవుతుంది. ఆ రెండువందలూ పెడితే......"

"ఒక చిన్న బంగారపుగొలుసు వస్తుంది నీకు"

"నాకు గొలుసెందుకమ్మా, ఇంకా కావాలంటే ఈ చెవుల జూకాలే అమ్మేద్దా మనుకొంటున్నాను. రెండువందలు పెడితే అక్కడి శానిటోరియంలో రెండునెల్లు నువ్వు ఉండవచ్చునట, పెద్ద డాక్టరుగారు చెప్పారు. తరవాత నెలనెలా వంద చొప్పున తెస్తాను."

"బాగుందమ్మా, ఇదా నీ ఆలోచన? అందుకయితే నువ్వేం కష్టపడకు. అక్కడికి వెళ్ళినందువల్ల ఏమీ లాభంలేదు. బాగా డబ్బున్నవాళ్ళు మరికొద్దిరోజులు బతకడానికీ, తాము బాధపడుతూ తక్కినవాళ్లను బాధపెట్టడానికీని."

"అదేమిటమ్మా నువ్వలా అంటావు. నేను పెద్ద డాక్టరుగారినే అడిగాను. ఆయన చెప్పేరు మీఅమ్మకేం భయంలేదమ్మాయి అని. అయినా అక్కడికి వెళ్ళి ఉంటే వేగం బాగయిపోతుం దన్నారు. అసలు ఇప్పటిలాగ అప్పుడు నేను కుట్టుపని మొదలుపెట్టిన దగ్గరనుండీ పనిచేసిఉంటేనా? ఈపాటికే రెండువందలూ వచ్చిఉండును."

"ఇప్పుడుమాత్రం రాలేదేమిటి? మరి ఇంటి ఖర్చంతా నీసంపాదనేకదూ." అంది కాంతమ్మ. ఈమాట అప్రయత్నంగా తననోటను రావడంతో కాంతమ్మ కళ్ళలో నీళ్ళు తిరిగేయి. చేస్తున్నపని అలా పక్కన ఉంచి కిటికీవైపు తిరిగింది. కాని,

రేవతికి మాత్రం ఆమాటతో మరికొంత ఉత్సాహమే కలిగింది. ఏదో మనసులో పాడుకొంటూ కుట్టసాగింది.

మరికొంతసేపటికి కాంతమ్మ పడుకొని మళ్ళీ పని ఆరంభించింది.

రేవతి చేతిలోపని అయిపోగానే, అప్పటికి కుట్టిన మూర్తులెన్నో, వాటికి రావలసిన మజూరీ ఎంతో లెక్క వేసుకొని అవి గుడ్డపీలికతో కట్టి, శ్యామలాంబగారి జాకెట్లు తీసింది.

అంతసేపూ ఇంక పని ఎత్తిపెట్టేస్తుంది కాబో లని ఆమెను గమనిస్తూఉంచిన కాంతమ్మ మరి ఊరుకో లేక, "పన్నెండుదగ్గర కావస్తోందికదా, మరి నువ్వు మేలుకొన్నంతసేపూ నేనూ ఇలా కూర్చుంటాను. నీయిష్టం" అంది.

రేవతి సర్దుబాటుగా "ఏముందమ్మా, ఇవి రెండే జాకెట్లుకదూ. రేపుదయం వాళ్ళబ్బాయి వచ్చేసరికి వాళ్ళింటివన్నీ ఇచ్చేస్తే—ఇంకా వాళ్ళ పిల్లలకి పంట్లాలూ కోట్లూకూడా కుట్టాలిట." అని కొంచెం ఆగి, "కాని, అమ్మా, ఆవేళ నువ్వు అంత పట్టుదలపట్టి మెషీను అమ్మేస్తే నువ్వూ నేనూ నూతిలో పడిపోతా మని అంత గట్టిగా చెప్పబట్టిగాని, లేకపోతే ఈసరికి ఇది తక్కువ బీరువా, పందిరిమంచం, టేబిలు, కుర్చీలు, బిందెలు, వీటితోపాటే అయిపోవును. ఈడబ్బుకూడా పట్టుకెళ్లి......" రేవతికి తన తండ్రి డబ్బుఖర్చుపెట్టే విధానాలు చూచాయగా తెలియకపోలేదు. కాని, తనే అనడానికి ఇష్టపడలేదు. అమ్మ ఏమీ మాట్లాడక పోవడం చూసి, "ఎప్పుడూ అంత నెమ్మదిగా ఊరుకొనేదానివి, ఆవేళ నీ కంత పట్టుదల ఎలా వచ్చిందో ?" అంది.

"పట్టుదలా! నీ కోసమే నమ్మా. అది లేకపోతే డబ్బుమాట దేముడెరుగును, నీ కసలే ఊసుపోదు. స్కూలుకుకూడా వెళ్లడం మానేసేవు. అయినా ఎలా వెళ్తావులే, ఒక నాలుగుజతల బట్టలయినా లేవుగదా."

"లేకేమమ్మా, ఉన్నాయి. ఇంకా ఆ పాతవి అక్కడక్కడ కొంచెం చిరిగినవి తీసి, ఎప్పుడయినా పని తక్కువగా ఉన్నప్పుడుగాని కుట్టేసుకుంటే నాకు కావలసినవన్నీ ఉన్నాయి, పరికిణీలూ జాకెట్లూనూ. వోణీలు రెండూ ఇంకా కొత్తగానే ఉన్నాయి. నీకే, అసలు ఉన్నవే రెండు చీరలు. ఇకనో ఈ పండుగ అయిపోనీ, అప్పుడు నిన్ను అక్కడికి దిగబెట్టేటందుకు కొనుక్కుందాం. అమ్మా, ఆ శానిటోరియంలోకి నన్ను రానిస్తారా ? అయినా మరి నా కక్కడ పని ఉంటుందిగాని, ప్రతి ఆదివారం పొద్దున్న బయలుదేరి వచ్చి సాయంకాలానికి తిరిగి వచ్చేస్తూఉంటాను. ఈ మెషీనంటూ ఉంటే చాలును. ఇదే మనని కాపాడుతుంది. నాన్న, ఆవేళ, ఎంతకి, రెండువందలకా బేరం కుదుర్చుకొనివచ్చారు ?"

"ఉఁహుఁ, పూర్తిగా రెండు వందలూ లేదు. నూటతొంభైఏ నట."

"ఎంతయితే నేమి, రెండువందలు కాదు, మూడువందలైతేమాత్రం మరి మళ్ళీమళ్ళీ రాదుకదా! ఆ డబ్బు ఖర్చయిపోవడంతో సరి. ఇందాకా నువ్వు చెప్పినట్లు ఇప్పటికే మనకు ఆ రెండువందలూ దీనిమీద వచ్చేసేయి. ఇది మన కింక ఉట్టినే ఉన్నట్టే. మా స్కూలులో పిల్ల సరస్వతి వీణ నేర్చుకొంటోంది. వీణ తీసినప్పుడల్లా దానికి దండం పెడుతుంది. అలాగే నాకూ పొద్దున్నే లక్ష్మీదేవిపటానికీ, తులసమ్మకూ, నీకూ దండం పెట్టేక మెషీనుకుకూడా దండం పెట్టాలని పిస్తుందమ్మా. ఏం, తప్పా ?"

"తప్పేమీ లేదుగాని, మెషీను కేం ప్రాణం ఉందా?"

"అయితే మరి సరస్వతి వీణకుమాత్రం ప్రాణం ఉండేమిటి? కాకపోయినా, మనకు దేవుళ్ళుగాని, కాగితానికి చెట్టుకూమాత్రం మన కున్నలాటి ప్రాణం ఉందా"

"ఏమోనమ్మా, నీతో నేను వాదించలేను. రైలుకూ, కారుకూ, సైకిలుకూ, మెషీనుకూ ఎవళ్లూ దండం పెట్టడం, పూజచెయ్యడం నాకు తెలీదు."

"లేదమ్మా, హాస్పిటలుకు వెళ్ళేదారిలో ఒక పెద్ద బొయిలరుంటుంది. అందులో అమిమను పక్కనే మన లక్ష్మీపటంలాటిదే, ఇంతకంటే చిన్నది

గాని, ఒక పటం ఉంది. రోజూ ఆ పటానికి నమస్కారంచేసి, హారతికర్పూరం హారతిచ్చి అగరువత్తి వెలిగించి పటానికి ఒకమూల తగిలించి, మెషీనుకి దండం పెట్టినతరవాతగాని అత డేపనీ ముట్టుకోడట. అందుకే అంత బాగా ఉంది అతని పని. పెద్దసీకిలో బట్టల షాపులో సగంవాటా తీసుకొంటున్నాడట. ముసలివాడేగాని, అమ్మా, ఎంత జోరుగా కత్తిరిస్తాడనుకొన్నావు! అసలు కొత్తలు చూస్తున్నాడా అనిపిస్తుంది. మళ్లీ అన్నీ ఒక అరంగుళమయినా అటూ ఇటూ కావుట. అతని దగ్గర కుట్టించుకొన్నది ఏదయినా సరిగా లేదంటే, మళ్లీ తనే స్వయంగా బట్ట కొని కుట్టిఇస్తాడట. అసలు ఎప్పుడూ ఇష్టపడకపోవడం అంటూ ఉండడట. ఎప్పుడూ ముగ్గురు పనివాళ్లు పనిచేస్తూనే ఉంటారు. అయినా పని ఎక్కువేనట. అక్కడ ఇచ్చిన బట్టలు నెల్లాళ్లలో వచ్చినా వేగం వచ్చినట్టేనట. అయినా అతను మరి చెయ్యలేక, కొంతపని ఒదులుకుంటున్నాడట. అప్పుడు నాన్న ఈ ఊరొచ్చిన కొత్తలోనూ అలాగే ఉండేది కాబోలు."

అంతసేపూ మాట్లాడకుండా వింటున్న కాంతమ్మకు ఎక్కడలేని ఉత్సాహంవచ్చింది. ఆదివరకు కొన్ని వందలమార్లు చెప్పుకొన్నవే అయినా, ఆ మొదటిరోజుల కబుర్లు తల్లీకూతుళ్లిద్దరికీ నిత్యనూతనంగా ఉండేవి. అలా వింటూండగా రేవతిపని తనకు తెలియకుండానే ఆగిపోయింది.

వినివిని రేవతి "అవునమ్మా. నాన్నకు ఆ ధర్మగుణం ఇప్పటికీ పోలేదు. ఎవడయినా అడుక్కొనేవాడు వస్తే, తన జేబులో డబ్బుండాలిగాని, అణో బేడో పావలో ఎంతో వాడి అదృష్టం, ఇచ్చేసేరన్నమాటే. కాక, తను ఇంటిదగ్గరున్నప్పుడు మనంగాని ముష్టివాడికి ఎవడికయినా బియ్యం నిండుకొన్నాయన్నామంటే, దగ్గర ఏది కనిపిస్తేఅది, గిన్నో, ముంతో, గ్లాసో, లేక తన బనీనో ఏదోఒకటి ఇచ్చి 'పోయి అమ్ముకోరా' అంటారు. అయితే అమ్మా అప్పటి రోజుల్లో ఇంతేసి మజూరీలెట్లు లేవుకదూ."

"ఇంతే పెక్కడమ్మా! అయితే ఆరోజుల్లో అన్నీ అంత చవకగానూ ఉండేవి."

"ఇప్పు డెంతరేట్లుంటే ఏంలాభం? మనకు బాగా పనిచేసే కుట్టావాడొకడు, మరొక్క మెషీనూ ఉంటే బాగుండును. ఈ ఒక్కదానిమీద ఏమాత్రం చెయ్యగలం. అప్పుడు నాలుగు మెషీన్లకూ నిండుగా పని ఉండేదికదూ!"

"నాలుగేమిటమ్మా, చెప్తే వింతగా ఉంటుందిగాని, పధ్నాలుగింటికయినా సరిపడే పని వచ్చేదంటే నమ్ము. అప్పుడేగాని, పెద్దబజార్లోకి మార్చేసి, ఆ రకంగా మరొక్క పదేళ్లు చేసిఉంటే..."

"ఈపాటికి మనకూ ఓ పెద్ద మేడ, బట్టలషాపు ఉండును. నీ జబ్బుకు మందుకూడా, ఇక్కడ కాకపోతే, మరెక్కడికయినా సరే, ఎంత ఖర్చయినా సరే..."

తన మనసులో ఉన్నమాట అనకుండా ఉండలేకపోయింది కాంతమ్మ. "మీనాన్న సరిగా పనిచేస్తూ మామూలుగా ఉంటూఉంటే, జబ్బింతవరకూ రాకనేపోనమ్మా" అంది. అనేసిందిగాని, ఎందుకన్నానా అని తరవాత నొచ్చుకొంది.

"ఇప్పుడయినా, అమ్మా అక్కడికి వెళ్ళినా బాగుకాదంటావా?"

తన సంగతి బాగానే తెలుస్తూన్నా, "ఎందుకు బాగుకాదమ్మా, అసలు నువ్వు మొన్న హాస్పిటలునుండి తెచ్చిన మందుతో చాలా గుణం కనిపించింది. దగ్గువచ్చినా, ఊపిరి హాయిగా తీసుకోబడుతూంది. గుండెల్లో తేలికగా ఉంది."

"ఇప్పుడు మరొక్క మోతాదు ఇస్తానుండమ్మా" అంటూ లేచింది రేవతి.

"ఇందాకా తాగానుకాని, పోనీ, తే, హాయిగా నిద్రపడుతుంది. మరి పడుకొంటావా? పన్నెండు అకైర్తయింది."

"అలాగేనమ్మా. ఇదుగో ఇంద, మరొక పది నిమిషాల్లో అయిపోతుంది. పడుకొంటే, నాకేం

నీలాగ కాదు, వెంటనే నిద్రపట్టిపోతుంది. మళ్ళీ ఉదయం అయిదుగంటలకుగాని లేచేది లేదు."

"అయితే మరింకా పడుక్కోవా? ఇంక, గ్లాసు. ఆ కొంచెంపనీ ఉండిపోతేనేమి? కావాలంటే తెల్లవారుజామున నాలుగుగంటలకు లేపుతాను."

"ఆఁ, అలాగే అంటావు. ఏడుగంటలదాకా లేపలేకపోయినా ఊరుకొంటావు. ఏమమ్మా అంటే నేనూ ఇప్పుడే లేచానంటావు."

"మరయితే నామాట నమ్మకం లేదా అమ్మాయి!"

"ఇప్పుడిప్పుడు అయిపోతున్నదానికి మరెందుకమ్మా. నువ్వే మునుపు చెప్పేదానివి నాచదువు గురించి, ఎప్పుడు చెయ్యవలసిన పని అప్పుడే వెంటనే చెయ్యడం మంచిదిగాని, వాయిదా వెయ్యకూడదని"

"అలాగని, ఒక్కమారే, ఎడతెరపి లేకుండా చేస్తారా? మరి నేను పడుక్కుంటున్నాను. నీయిష్టం, నువ్వెప్పుడు పడుక్కుంటావో," అని కళ్ళు మూసుకొని కిటికీతట్టు తిరిగి పడుకొంది కాంతమ్మ. నిజంగా అన్నట్లుగానే చేతిలో పని అయిపోగానే పదినిమిషాలలో కూతురు పడుకోడం గమనించి, తృప్తిగా లేచి, ఆకాశాన్ని చూస్తూ కూర్చుంది ఎందుకో ఎదురు చూస్తున్నట్లుగా.

* * *

రెండురోజుల్లో పండగ వస్తోంది. ఎంత చెప్పినా వినకుండా రేవతి, రాత్రి మూడుగంటల దాకా కుట్టి, ఇక మిగిలినవి రేపురాత్రిలోగా కుట్టి ఇచ్చేయగలనని నిబ్బరంగా అనుకొని, అప్పుడే పడుకొంది.

ఒంటిగంటప్రాంతంలో కొద్దిగా నిద్రపోయి లేచిన కాంతమ్మకు రేవతి మూడవుతున్నా ఇంకా కుట్టుతూండడం ఎంతో కష్టమనిపించింది. కాని, మరి వారించి లాభం లేదు. తన పట్టుదలే తనదితప్ప ఏం చెప్పినా వినిపించుకోదు అమ్మాయి.

రేవతికి బాగా నిద్రపట్టనిచ్చి లేచి, మిగిలి ఉన్న గుడ్డలు తీసి దగ్గర పెట్టుకొని, కుట్టడానికి కూర్చుంది. కూతురు కష్టపడతోందన్న విచారం అయితే తనకు ఎక్కువగా ఉందిగాని, తనకుమాత్రం ఈమధ్యను కొన్ని రాత్రులుగా, నిద్ర ఉండా? కాక, శరీరంలో ఏమయినా శక్తి ఉంటేకదూ. అయినా, ఏమో తాను భయపడినంత పాడుగా లేదు. అలా కుడుతూఉంటే, కొంచెంకొంచెం తొందరగా కూడా పని నడుస్తున్నట్టు కనిపించసాగింది. ఊరికే కూర్చుంటే ఊపిరితీసుకోడం కష్టంగా ఉన్నట్టుందిగాని, ఇలా పనిచేస్తూఉంటే ఏమీ లేదు, అనుకొని ఇంకా తొందరగా ఉత్సాహంగా కుట్టసాగింది.

నాలుగుగంటలప్రాంతంలో దగ్గు విపరీతంగా వచ్చింది. లేవాలంటే మామూలుగా లేచేట్టు లేవబడ లేదు. ఎలాగో పెరటిలోకి వెళ్ళింది. మామూలుకంటె ఎక్కువ రక్తం పడింది. వెంటనే కడగడానికి కుండిలో నీళ్ళు లేకపోయేయి. సరే, తెల్లవారేక కడుక్కోవచ్చని, మెల్లగా ఇంట్లోకి వచ్చి, ఎందుకయినా మంచిదని అమ్మాయి తెచ్చిన మందు మరోక మోతాదు తాగి, మళ్ళీ కుట్టడానికి కూర్చుంది.

తెలతెలవారుతూఉండగా రేవతికి మెలకువ వచ్చింది. తన మంచానికి ఎదురుగా ఉన్న లక్ష్మీదేవి పటానికి నమస్కరించి పెరట్లో తులసమ్మకు నమస్కారం చెయ్యడానికి వెళ్ళింది.

నూతిగచ్చుమీద, అబ్బ, రక్తం, ఎంత రక్తం, మరక కట్టేసింది. ఎప్పటికప్పుడు కడిగేసేది, రాత్రి కడగలేకపోయింది కాబోలు. ఎంత బాధపడ్డదో! ఇన్ని తలపులూ క్షణంలో మెరిసేయి. గబగబా అమ్మా అమ్మా అనుకొంటూ గదిలోనికి వెళ్ళింది.

మంచంమీద అమ్మ లేదు. ఎక్కడికి వెళ్ళింది చెప్మా? ఆఁ, ఏమిటిది? కిందను పడుక్కుందెంచేతో? పడిపోయింది కాబోలు.

"అమ్మా అమ్మా, లే, లే, కిందను పడుక్కున్నావేమిటి" అంటూ లేపబోయింది.

ఆసలు స్పర్శలోనే ఏదో కొత్తగా తగిలింది. కళ్లు నిద్రపోతున్నట్టూ లేవు, మేలుకొనిఉన్నట్టూ లేవు. మరేమనడానికీ తోచక ముందు మంచంమీదికి

తీసుకొని వెళ్ళాలని లేవబోయింది. ఎలాగో అతికష్టం మీద నిలబెట్టి, అటు కుడిచేతితట్టు వెళ్ళి నడిపిద్దా మనుకొంది. ఇంతలో తన పట్టు జారి శరీరము గుల్లగా ఉన్న కర్రవలె నేలను పడిపోయింది. అప్పటికీ రేవతికి ఇంకా జరగవలసిన దేదో జరిగిపోయిందన్న నమ్మకం కలగలేదు. మంచం కొంచెం దగ్గరగా ఈడ్చి, ఈసారు మరి నిలబెట్టకుండా 'అమ్మ ఎంత బరువుగనక, దూది కన్నా తేలిక' అనుకొని మెల్లగా ఎత్తి మంచంమీద పడుకోబెట్టి, "అమ్మా, మరి మాట్లాడవుటమ్మా. రాత్రి నేను పడుకొన్నాక నువ్వు కుట్టేవుకదూ. అందుకే ఇంతలా నిద్రపట్టింది. పోనీ పడుక్కో" అని కొంచెం ఏడంగా వచ్చింది.

అంతలో, "మరెక్కడి నిద్ర, ఇక ఒకటే పెద్ద నిద్ర, మీ అమ్మ చచ్చిపోయింది." అని ఎవరో తన చెవిలో చెప్పినట్టయింది.

"ఆఁఆఁ, నే నమ్మను. రాత్రి అంత బాగా మాట్లాడింది. అబ్బే, లేదు. నిద్రే. ఈమధ్యని నాతో పాటు మేలుకొంటున్నది. అసలే జబ్బు. అందుచేత నిద్ర బాగా పట్టింది. అంతే కదమ్మా, అవునంతే అనమ్మా, లేవవూ? లేవవూ? నా కేమిటో భయంగా ఉంది లేవవూ! ఇదుగో ఇవాళ వాళ్లు ఆ డబ్బిస్తే రెండువందలా పూర్తవుతుంది. ఇక్కడుండి మరి లాభంలేదు; అక్కడికే వెళ్లాలన్నారు డాక్టరుగారు. ఎప్పటిదాకానో ఎందుకు? ఇవాళే వెళ్దాము. అమ్మా, అమ్మా, లేవవూ, అయితే మరి మాటాడవూ? ఇంతేనా? ఉండు మరయితే, నేనూ నీలాగే పడుక్కొని నీదగ్గరకే వస్తాను. ఇదుగో పడుక్కొన్నానా, ఇంక వచ్చేస్తున్నాను. ఇప్పుడే. ఏమీ ఆలస్యంలేదు."

* * *

ఆసాయంత్రం వీరాస్వామి ఇంటికి వచ్చి, తలుపు పిలిచిపిలిచి విసిగి, గట్టిగా కాలితో తంతే అదివరకే సగం ఊడిపోతున్న గడియ పూర్తిగా ఊడిపోయి తలుపు తెరుచుకుంది. 'ఏం చచ్చేరా! ఎంత పిలిచినా పలకరు' అంటూ లోపలికి ప్రవేశించిన అతనికి ఎదురుగా కనబడిన దృశ్యంతో కళ్లు చీకట్లుకమ్మేయి.

ఎలాగో వెళ్లి మంచందగ్గర మోకరిలబడ్డాడు, ముట్టుకొని చూసేడు. అంతే. అయిపోయింది. మరి ఏ అనుమానమూ లేదు. లేకపోతే వస్తూనే అటువంటి నీచమయిన తిట్టు తననోట ఎందుకు వస్తుంది! అయినా ఇద్దరూ ఒక్కరూ రెలాగో! ఏమో ఏదయినా విషం పుచ్చేసుకొన్నారేమో తను పెట్టే బాధలు భరించలేక. ఏదో నిశ్చయంచేసుకొన్నవాడులా లేచి, పెరటిలోకి వెళ్లి నూతిదగ్గర రక్తంమరకలు చూసి, పాపం, ఎంత బాధ పడిందోకదా, సరే ఇక నేనూ ఉండనుకదా. ఈ వెధవ ఈత రాబట్టికదా ఇప్పుడీ తాడు విప్పుకొని ఇంతపని చెయ్యవలసివస్తున్న దనుకొని, కోపంగా బాల్చీ నూతిలో పడేసి గబగబ గదిలోకి వెళ్ళేడు.

అంతా సిద్ధమయి ఇంక క్షణంలో బుఱ్ఱ దూర్చేస్తాడనగా "అమ్మా, అమ్మా, వస్తున్నా, ఇదుగో, ఈవెధవ రైలింజను ఇంకా రాకుండాఉంది" అని కేక పెట్టింది రేవతి.

ఆ కేకతో వీరాస్వామి ప్రయత్నం పటాపంచ లయిపోయింది. గబగబా ముడివిప్పి, తాడు ఇంకా దగ్గరలో కనిపిస్తూఉంటే, మళ్లీ ఏం దుర్బుద్ధి పుడుతుందో అని, తీసుకెళ్లి నూతిలో పారేసివచ్చి, "నేనెంత తెలివితక్కువవెధవని! నా బంగారుతల్లి ఇంకా బతికి ఉండగానే నేను కాసుకో లేకపోయేను. నాతల్లికి అమ్మా, నాన్నా లేకుండా చేస్తానా? ఇక నే లోటయినా రానిస్తానా?" అని లేపే ప్రయత్నం చేసేడు. ఏమీ ఫలితంలేకపోయింది. కాని, ఊపిరి బాగానే తీస్తున్నది. ఒళ్లు మామూలుగానే ఉంది. మరేం భయం లేదు. గాఢనిద్ర అనుకొని, ఎత్తి మంచంమీద పడుకో బెట్టేడు.

తరవాత లేచివెళ్ళి ఎవరినయినా పిలుద్దామను కొన్నాడు గాని, ఈరకం జబ్బులో ఎవరూ రాకపో వచ్చును. కాక, వచ్చినా, ఉదయంలోపుని తీసుకొని వెళ్ళేది లేదుకదా అని అలా ఒక్కడూ నేలను మఠం వేసుకొని, తపస్సు చేస్తున్నట్టుగా కూర్చున్నాడు.

అదివరకు అతను మళ్లీ తాను దారిలో పడాలను కొని చేసుకొన్న నిశ్చయాలు ఎప్పటికప్పుడే నీటిమీది

రాతలాగ అంతరించిపోతూ ఉండేవి. కాని, ఆనాడు, కంటిమీద రెప్ప వాల్చకుండా రాత్రంతా కూర్చున్న దీక్షతో అతని నిశ్చయాలు హృదయంమీద శిలాక్షరాల లాగ అతుకుకొన్నాయి. వీరాస్వామి మళ్లీ మొదటి రోజుల వీరాస్వామి అయిపోయేడు.

"బాబూ, డాక్టరుగారూ, నా బుద్ధి తక్కువ వల్లైతేనేమి, దాని అదృష్టం లేక పోతేనేం అది పోయింది. ఇక నాకూతురుందే, ఇదే నా ప్రాణం. ప్రాణం ఏమిటి, అంతకంటే ఎక్కువది. నా పీక కోసి ఇచ్చేయమన్నా ఇచ్చేస్తాను. ఎంత ఖర్చయినా మీరు చూడకండి. ఎలాగోలాగ సంపాదిస్తాను. మీరుమాత్రం దీన్ని మామూలుమనిషిని చెయ్యాలి" అన్నాడు వీరాస్వామి.

"నువ్వింతలా చెప్పాలిటోయి. నీభార్య దురదృష్టవంతురాలు. ఒకవిధంగా అదృష్టవంతురాలుకూడా. ఆజబ్బు వచ్చేక ఎక్కువకాలం యాతనపడేకంటే, వేగం పోవడమే మంచిది. కాని, ఈపిల్లఅంటేనే నాకు ఎంతో విచారంగా ఉంది. పాపం, అప్పుడు మందుకు వచ్చినప్పుడల్లా, 'డాక్టరుగారూ! ఒక్క రెండువందలయితే చాలునుకదండీ మాఅమ్మజబ్బు నయంకావడానికి' అంటూ ఉండేది. అంత తెలివయిన పిల్ల-ఓపికా, పట్టుదలా, చాకచక్యం ఉన్న పిల్ల ఇలా ఐపోయిందంటే... అందులోనూ నువ్వు మళ్లీ నీ మొదటిపద్ధతికి వచ్చి, ఊళ్ళో పేరూ డబ్బూ తెచ్చుకొంటూ ఉంటే......"

"ఏమిటో బాబూ, ఆవేళ సాయంత్రం నేనూ ఐపోవలసినవాణ్ణే. అంతా ఊరికి సిద్ధం చేసుకొన్నాను. అసలీదీ చచ్చిపోయిందనే నాలెక్క. అంతలో ఇప్పటిలాగే 'అమ్మా, అమ్మా, వస్తున్నా' అని కేక పెట్టింది. అందువల్ల నేను బతికినా, అది ఇలా అయిపోయింది."

"ఇది చిత్రంగానే ఉంది. మామూలుగా కొందరికి నిద్రలోనే లేవడం, తిరగడం, మాట్లాడ్డం, పని పాటలు చేసుకోవడం, తరవాత ఇవన్నీ జ్ఞాపకంలేక పోవడం అన్నది ఉందిగాని, ఇలాగ ఆ మొనపటిపిల్ల కానేకాదన్నట్లుగా స్తబ్ధగా ఉండడం, ఉండుండి అంతా ఒక నాటకంలాగ చెయ్యడమూను. ఆవేళ బహుశః వాళ్లమ్మ తను నిద్రపోయిఉండగా కిందపడి చచ్చిపోయిఉంటుంది. ఆ లేపడమూ తనే, లేవడమూ తనే, దబ్బుమని నేల పడిపోవడం, మళ్ళీ ఎలాగో తీసుకొని వెళ్లి మంచంమీద పడుకోబెట్టడం, తను ఇంకా బ్రతికే ఉందనుకొని అప్పుడన్నటువంటి మాటలన్నీ అనడం.. ఇదంతా మళ్లీ తరవాత ఏమీ జ్ఞాపకం ఉండదుకదూ?"

"జ్ఞాపకం ఏమిటి బాబూ, అసలు మతి, ఆలోచన అన్నవే ఉన్నట్టనిపించదు. ఒకొకమాటు ఇదంతా నడిచిన పనులమూలంగా చేస్తుంది. మరొకప్పుడు తనలో తనే ప్రశ్న, జవాబు—అలా గంటలకొద్దీ మాట్లాడుకొంటూ కూర్చుంటుంది. ఉండుండి 'అమ్మా, రమ్మంటున్నావుకదూ. ఇదిగో రైలుపట్టాలు, అదుగో రైలు వస్తున్నది. అబ్బ, మనస్సులో ఎందు కాగిందో? అదుగో' అని పళ్ళు బిగకరుచుకొని ఉండిపోతుంది. మరి ఇది కుదరదా బాబూ?"

"ఏమిటో, ఏమీ చెప్పలేకుండా ఉన్నాను. కాని ఒక్కటి, ఆ మనలోకంజ్ఞానం వచ్చిన సమయంలో నయినా ఇంతకంటే కొంత నయంగా ఉంటున్నదా?"

"అప్పుడూ ఇంతే బాబూ. ఉండుండి, 'అమ్మా' అని పిలిచి, తను ఆరేళ్లపిల్ల లాగు, 'అమ్మా, అమ్మ ఉండేదే, నాకు బడికి వెళ్లడానికి అన్నంపెట్టి గౌను తొడిగేది. ఏమయిఉంటుంది? చచ్చిపోయిం దంటుంది అత్తయ్య (అంటే మా పెద్దక్కలెండి). ఏమో, నిజమే కాబోలు, ఎందుకు చచ్చిపోయిందో? నాన్న కొట్టే సేడు కాబోలు' అంటుంది బాబూ. దాని చిన్న తనంలో ఒక్కమాటు ఎందుకో కోపంవచ్చి వాళ్ల మ్మను కొట్టేను. అదీని, మా మేనమామకొడుకు కొకడు పరీక్షపోయిందని రైలుకింద పడి చచ్చిపోయేడని దాని ఆరోఏట ఉత్తరం వచ్చింది. బాబూ, అప్పటి నుండి రైలుపట్టాలన్నా, రైలుఇంజను కూతలన్నా కొన్నాళ్లు భయపడేది. ఆ రెండూ చిన్నప్పటి మనసి

పోయినవి ఇప్పుడు జ్ఞాపకం వచ్చేయి. తక్కినవన్నీ మాత్రం మరిచిపోయింది. రోజు కాక మూడునాలుగు మార్లేనా ఈఫిట్లు వస్తాయి బాబూ."

"అయినా అప్పటికంటే కొంత తగ్గినట్టేకదూ. మునపటంత ఉద్ధృతం లేదుకదా, కాని, ఆ మరుపూ అదీ ఆ జీవశక్తిప్రభావమే. లేకపోతే ఆ మామూలుగా కొంత ప్రపంచజ్ఞానం ఉన్న సమయంలో వాళ్లమ్మ జబ్బుగురించీ, చావుగురించీ, ఏమీ జ్ఞాపకంలేక పోవడం. అలాగే ఉంటే ఆ దుఃఖానికీ భయానికీ బ్రతికే లేకపోవును. నిజంగా కూడా ఆత్మహత్య చేసు కొనిఉండును. అయితే ఇది ఇన్నాళ్లలో కుదురు తుందని ఏమీ చెప్పలేను. ఆ యిల్లు మార్చెయడం మంచిపని చేసేవు. వీలయినంతమట్టుకు కొత్తకొత్త ప్రదేశాలనూ, మనుష్యులనూ చూసేలాగ చూడు. తనకు కావాలన్నా అక్కరలేదన్నా ఓ గ్రామఫోనో, రేడియోనో కొని, అది సంగీతం తరుచు వినేలా చెయ్యి. తరుచు సినీమాలూ అవీ చూపించు. అయితే అక్కడ ఈ ఫిట్లు వస్తే చిక్కేగాని. అయినా ప్రయత్నించి చూడు. ఎప్పుడోమళ్లీ మామూలుగా ఉన్నప్పుడు దానంతటదే జ్ఞాపకం రావాలి. వాళ్లమ్మ జబ్బూ' తను రాత్రింబగళ్లు బట్టలు కట్టడం అదంతాను. అంతవరకూ..."

అని ఇంకా ఏవో డాక్టరుగారు అంటూ ఉండగా, 'అమ్మా, అమ్మ వస్తున్నా, ఇదుగో, ఇప్పుడే' అంటూ వచ్చి, ద్వారబంధం రైలుకమ్మి అయినట్లుగా అందు మీద మెడ ఉంచి పళ్లు బిగించి, కళ్లు మూసుకొని, బోరగిలా పడుకొని, "ఇదుగో వచ్చింది ఇంజను, అమ్మో." అని పెద్దకేక పెట్టి మెడ పక్కకు వేలవేసింది.

డాక్టరుగారు లేవదీయబోతే, "వద్దు బాబూ, ఉండనియ్యండి. తీస్తే 'నేనూ చచ్చిపోయేను' అని గభీమని నేలకు పడిపోతుం" దన్నాడు పలికీ పలకని గొంతుతో శిరాస్వామి.

---

# సవరణ

గతసంచికలోని వ్యాసమందు నాగార్జునకొండశిల్పములను వర్ణించుచు ఒక యవనరూపశిల్పమును డైవానీసియసురూపమని చెప్పితిని. పండిత లాంగుహర్స్టుగారు ఆ చిత్రము డైవానీసియసుచిత్ర మయిఉండవచ్చునని అభిప్రాయమును సూచించిరనిసయితము వ్రాసితిని. కాని ఆచిత్రము డైవానీసియసుచిత్రము కాదు. చరిత్రలో ముగ్గురునలుగురు డైవానీసియసులు కలరు. వారందరు వేదాంతవేత్తలే. యవనదేవతలందు సయితము ఒక డైవానీసియసు కలడు. అతడు నాటకకళ కధిపతి యనుటయే కాక, సురాపానదేవత. ఈ దేవతను యువకుల దేవతగా సయితము వాళ్లు కొలుచుచుండెడివారు. అతని కొక శిష్యుడు కలడు. ఈ శిష్యుడు సిలేనస్. ఇతనిని ఒక ముదుసలి త్రాగుబోతుగా యవనులు చిత్రించెడివారు. ఆ నాగార్జునకొండశిల్పము ఈ సిలేనస్ చిత్రమని నా నమ్మకము.

మరొక చిన్న విషయ మేమన, అలెగ్జాండరు డైవానీసియసుయతిని దర్శించెనని ఒక కథ వ్రాసితిని. అది పొరపాటు. అతడు డయొజినీసు.

ఆమంచర్ల గోపాలరావు.

---

# నాడీజాతకములు

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

జాతకశాస్త్రమునుగూర్చిన గ్రంథములు మన దేశములో అనేకము లున్నవి. వానిలో నెల్ల నాడీగ్రంథములు అపూర్వము లయినవి. ఆశ్చర్యకరమైనవికూడ. లోకకల్యాణార్థమై మన ప్రాచీన మహర్షులు వీనిని రచియించినారని ప్రతీతి. మన దక్షిణదేశమందు ఈ నాడీగ్రంథములకు చాల ప్రచారము కలదు. చాలవరకు ఇవి అరవభాషలోనో, సంస్కృతభాషలోనో వ్రాయబడియున్నవి. తెలుగు, కన్నడము మున్నగు ఇతరదేశభాషలలో సయితము కొన్ని చూపట్టుచున్నవి. ఉత్తరహిందూస్థానములోకూడ ఇట్టివే కొన్ని గలవేమో! ఈగ్రంథములలో కొన్ని పద్యరూపముగా, మరికొన్ని ప్రశ్నోత్తరరూపమయిన వచనముగా నిబంధింపబడియున్నవి. వశిష్ఠవిశ్వామిత్ర సంవాదముగనో, నారదుడు పార్వతీదేవికి ఉపదేశించినట్లో, మరి ఎవ్వరో వేరొకరికి చెప్పినట్లో ఈగ్రంథములు వ్రాయబడియుండుట. భృగునాడి, శుక్రనాడి, బుధనాడి, చంద్రనాడి, నందినాడి, ధ్రువనాడి, కుమారనాడి, కౌశికనాడి, నారదనాడి ఇత్యాదులు మనము వినుచున్నాము.

ఈ నాడీగ్రంథములు శాస్త్రగ్రంథములు కావు. అనగా, బృహజ్జాతకము, బృహత్పారాశరహోర, జైమినీసూత్రములు, సారావళి మున్నగువాని వంటివి కావనుట. ఒక్కొక్క నాడీగ్రంథములో అసంఖ్యాకములయిన వ్యక్తిజాతకములు వ్రాయబడియున్నవట! అనుటచే ఇవి జాతకముల సంపుటములు. ఎన్నినూర్ల, అథవా, వేల సంవత్సరములక్రింద ఈ గ్రంథములు రచియింపబడినవో మనకు తెలియదు. తెలుసుకొను ఉపాయముసయితము కానరాదుకూడ!

ప్రపంచమందలి మానవుల జాతకములన్నియు ఈ నాడీగ్రంథములలో వ్రాయబడియున్నవని నమ్మువారున్నారు. జ్యోతిశ్శాస్త్రమునందు వలసినంత ప్రావీణ్యము సంపాదించుటకు తగినంత బుద్ధి, చాలినంత ఆయుస్సు, సరిపడునంత అవకాశము - ఇవి లేని ఈ పాపి కలియుగమునందలి మానవులు సులభోపాయముతో తమతమ జాతకఫలములను తెలుసుకొనుటకై లోకహితైషులగు మన ప్రాచీనమహర్షిపుంగవులు ఈ నాడీజాతకసంపుటగ్రంథములు వ్రాసియుంచిరట! అనగా, గడచిన ౫౦౫౦ సంవత్సరములనుండి పుట్టి గిట్టినవారియొక్కయు, ఇకముందు కలియుగాంతముదాక జనించువారియొక్కయు జాతకములన్నియు ఈ గ్రంథములలో ఉన్నవనుట! ఈసంఖ్య ఎంత గొప్పది అగునో, మన అల్పబుద్ధికి అందని విషయము. ఇది అసంభవమని భావించునంతటి ప్రాపంచికవిజ్ఞానము కలవారు కొందరు ఒకవిధముగా దీనికి సమన్వయము కల్పించెదరు. ఖండాంతరముల గొడవ మాని భరతఖండపుమహర్షులు భారతదేశవాసులకుమాత్రమే యీ జాతకసౌకర్యములు కల్పించినారట! వీరి యుక్తి రమ్యముగానే యున్నది. దీనిచే మన మహర్షుల శ్రమ నూటినుండి పదునారింటికి తగ్గించిన ట్లయినది. మంచిదే! మునుపటి కాలముమాట అట్లుండగా నూరేండ్లక్రింద జనించిన మనుష్యులిపుడు సాధారణముగా లేరనవచ్చుకదా! అప్పటికి భారతదేశములో అధమపక్షము ౨౦ కోట్లయినా జనసంఖ్య ఉండునను కొనవచ్చును. ఆ ఇరవై కోట్ల జాతకము లిపుడు పనికిరావుకదా! ఇప్పటి జనసంఖ్య రమారమి ౩౬ కోట్లు. నూరేండ్లకు ముందు గతించినవారెన్ని కోట్లో! ఇక ముందు రాబోవువారెన్ని కోట్లో! ఇది గమనించితిమేని, ఎన్ని జాతకములు నాడీగ్రంథములలో వ్రాసియుండవలయునో, ఊహాతీత మగుచున్నది.

ఇది ఇట్లుండ, ఇన్ని జాతకములను సిద్ధపరచుటకు కాల మెంత కావలయునో! వశిష్ఠవిశ్వామిత్రులు సమావేశము కావలయును. ఆసభకు పార్వతీదేవి అగ్రాసనాధిపత్యము వహించవలసియున్నది. ఈ సభలోనే వశిష్ఠుని సిద్ధాంతము, విశ్వామిత్రుని పూర్వపక్షము, వశిష్ఠుని జవాబు, పార్వతీదేవితీర్పు ఈపద్ధతితో నడచినది కౌశికనాడి. పార్వతీనారదుల సంవాదముతో నడచినది నారదనాడి. ఇట్లే ఇతరనాడులు కూడ. ఇట్టి సభాకార్యక్రమముతో ఒక్కొక్క జాతకునికి పండ్రెండుభావముల ఫలములు నిర్ధరింపబడుట! ఇంతకథ జరుగుటకు జాతక మొకటింటికి కనీసము ఒక గంటకాలమయినా కావద్దా? త్రికాలస్నానసంధ్యలు, జపతపములు, వైశ్వదేవబ్రహ్మయజ్ఞములు, అతిథిపూజాభోజనసత్కారములు మొదలగు నిత్యవిధులను సక్రమముగా జరిపినతరువాతకదా మన మహర్షులు ఇట్టిసభలకు రాగలరు! ఇక, పార్వతీదేవికిమాత్రము వేరుపనులే లేవా? దిన మొక్కటింటికి గరిష్ఠపక్షము మూడుగంటల కాలము ఈ జాతకనాడీసభాకాలక్షేపమునకు ఈమహనీయులు అవకాశము కల్పించుకోగలరనుకొందము. అయినచో, దినమొక్కటికి మూడు నాడీజాతకములు సిద్ధమయినట్లు. నెలలో రెండుమూడు దివసములు అనధ్యయనాదులను వదలి లెక్కించితిమేని, సరాసరి ఏడాదికి ఒక్క వేయిజాతకములు తయారగును. అనగా, కోటిజాతకములు వ్రాయుటకు రమారమి పది వేల సంవత్సరముల కాలము పట్టునని తేలుచున్నది! మహానుభావులగు మహర్షుల కింతకాల మక్కరలేదని వాదింతురేమో! పోనిండు. దినమునకు నూరు జాతకములచొప్పున గుణించి చూడుడు. నేడు భారతదేశములో నున్న ౩౬కోట్ల వ్యక్తులకుమాత్రము జాతకములు సిద్ధమగుటకు ౧౦వేల సంవత్సరము లయినా పట్టును. ఇక, కలియుగాదినుండి గతించినవారి, ముందు రాబోవువారి గతి ఏమో!

యుక్తిశాలురగు కొందరు మరియొకవిధముగా సమాధానము చెప్పుదురు. దివ్యదృష్టిసంపన్నులగు మహర్షులు తమ నాడీగ్రంథములను చూచుటకు ఎవ్వరు రాగలరో, ముందుగా నిర్ణయించుకొని, అట్టి భక్తులకు ఆశాభంగము కలుగకుండ, వారి జాతకములు మాత్రమే వ్రాసినారని వీరి యుక్తి. కావచ్చునేమో! నాడీగ్రంథాధికారులకు పూర్వజన్మములో, ఏకారణమువలననైనా సరే, ఎవ రెవరు అప్పుపడియుండిరో, వారి జాతకములు మాత్రమే ఈ నాడీగ్రంథములలో వ్రాయబడియున్నవని ఎవరైనా వాదించినా, మనము కాదనలేము.

ఎట్లయిననేమి, ఎటు చూచినా, ఇది తీర్పరాని సమస్య అనుటకు సందేహము లేదు. ఈగ్రంథముల రహస్యము అభేద్యమైనది. ముద్రాలయములు నేటిదాక ఈ వాఙ్మయమును స్పృశించుభాగ్యమునకు నోచుకోలేదు. ఈ గ్రంథములన్నియు తాళపత్రములలోనే వ్రాయబడినవి. వంశపారంపర్యముగనో, దానపరివర్తనముల మూలముగనో, హస్తలాఘవమువలననో, ఇవి సంపాదించుకొనగలిగిన పుణ్యవంతులు వీనిని మూలధనమువలె గుప్తపరచి కాపాడుచున్నారు. తమ జాతకమునకు ప్రాచీనమహర్షు లేమి ఫలాదేశము చేసిరో, కనుగొనవలయునని కోరి తమ్మాశ్రయించినవారినుండి సందర్భానుసారముగా, పాతికరూపాయలో, నూటపదార్లో స్వీకరించి నాడీగ్రంథాధికారులు పృచ్ఛకుని హస్తరేఖలనో, జాతకకుండలినో పరీక్షించి ఆయాధారమున తమ నాడీగ్రంథము నందలి జాతకములలో పృచ్ఛకునికి తగిన జాతకము నెత్తి చదివి, వినిపించి వ్రాసుకొమ్మనుట సామాన్యాచారము. అనేక సమయములలో సర్వసాధారణముగా, అయిదారు జాతకములను చదువుటయు, వానిలో చెప్పబడిన ఫలములను తన జీవితానుభవముతో పృచ్ఛకుడు పోల్చుకొని, ఏజాతకపు ఫలములు తనకు సరిపోయినవని తోచునో అదే తన జాతక మనుకొని దానిని వ్రాసుకొని సన్తుష్టుడైనని సంతోషించుటయు సంభవించుచున్నది. విశేష మేమనగా, ప్రతిజాతకమునకును జాతకుని జన్మగ్రామాదుల వర్ణనము, పూర్తిగా పేరు, తల్లిదండ్రుల నామములు, అన్నదమ్ములయొక్కయు, అక్కచెల్లెండ్రయొక్కయు వివరములు, వారిలో గతించిన అభాగ్యుల సంఖ్య, ప్రశ్నించిననాటిదాక జరిగిన ముఖ్యసంఘటనలు ఇత్యాదులు స్పష్టముగా, ఆశ్చర్యకరముగా వ్రాయబడి

యుండును. ఇట్టి పరిస్థితులలో నాడీగ్రంథముల మాహాత్మ్యములపై జనులకు అపారవిశ్వాసము కలుగుట వింత కాదు. త్రికాలజ్ఞానసంపన్నులయిన వశిష్ఠ నారదాదిమహాతపోధనులచే, ఎన్ని వేల యేండ్లకు పూర్వమో, తమ జాతకములు గుణింపబడి, గ్రంథస్థము చేయబడి, తమకొరకై కాచుకొనియున్న వని నమ్మకము వచ్చినప్పుడు, జాతకులకు కలుగు ఆశ్చర్యానందములకు పారము లేదు. వారి భాగ్యమే భాగ్యము!

ఇంతే కాదు. కొన్ని నాడీగ్రంథములలో జాతకుల పూర్వజన్మవృత్తాంతములు, పునర్జన్మముల పరిణామము, ఎన్ని జన్మములకు ముక్తియో, కైవల్యమో రాగల దను సూచన మున్నగు విచిత్రాంశములు చెప్పబడియున్నవి. ఈజన్మములో ఊరు, పేరు, వృత్తి మున్నగు వివరములు మనస్సునకు నచ్చునట్లుగా, సరిపోయిన వని తోచినప్పుడు, పూర్వజన్మపునర్జన్మముల కథలు సయితము విశ్వాసపాత్రము లేల కారాదు? మహర్షుల సూక్తులు అమోఘములు కదా?

నా మిత్రులలో సోదరు లిద్దరు (దాదాపుగా పాతికసంవత్సరములనాటి మాట) ఒక నాడీగ్రంథము నుండి తమ జాతకములను వ్రాయించుకొనిరి. మామూలు పద్ధతిలో పేర్లు, సంబంధములు, అనుభవములు, ఇంచుమించుగా, అప్పటిదాక సరిపడుటచే, ఆ జాతకఫలములపై అపారవిశ్వాసము వచ్చినది వారికి. స్నేహితులు నలుగురు చేరినచోట్ల తమ పూర్వజన్మపునర్జన్మకథలను విస్తారముగా అభివర్ణించుచు సంతోషించుట వీరికి అలవాటు. వారిలో జ్యేష్ఠునికి ఆధ్యాత్మికవిద్యపై ఎక్కువ అభిమానము. తమ్ముడు మంచి ప్రాపంచిక విద్యావంతుడు. అపారమైన సంపత్తి, కొల్లలుగా భోగభాగ్యములు ఇతనికి రాగలవని నాడీగ్రంథము జాతకఫలము చెప్పినది. అన్న గొప్ప పుణ్యపురుషుడనియు, ఈ సృష్టిక్రమములో రాగల జన్మమే అతనికి కట్టకడపటి దనియు, అప్పుడు తప్పక మోక్షము సిద్ధించు ననియు నాడీగ్రంథములో ఏర్పడినది. అపారమైన సంపత్తితో భోగభాగ్యములు సామాన్యపద్ధతులతో, సర్వసాధారణవృత్తితో వచ్చుట అసాధ్యమని వివేకశాలియగు తమ్ముడు నిర్ధరించుకొని, అభివృద్ధిసూచకమై, నెలకు అయిదువందల రూపాయల నిచ్చుచున్న వృత్తిని పరిత్యజించి, గుర్రపుపందెముల లాటరీలను వాడుకచేసుకొని, ఆవృత్తిలో సర్వస్వము కోలుపోయి, వేలకొలదిగా అప్పులు చేసి, కుటుంబభరణసామర్థ్యము నశించగా, మతిభ్రమపాలయి, దేశద్రిమ్మరిగా పడరానిపాట్లు ననుభవించి, హీనపరిస్థితులలో, నడివయస్సు వచ్చీరాకయే, ఇహలోకయాత్ర చాలించుకొన్నాడు. అతని పునర్జన్మ మెట్లున్నదో తెలుసుకోగల భాగ్యము మనకు లేదు. ఇతని అన్న మాత్రము అతికష్టముతో శరీరయాత్ర గడపుచు, మోక్ష మతిసన్నిహితముగా నుండుటవలన, తా నొక అవతారపురుషు డనియే విశ్వసించుచు, ముక్తికొరకై యెదురుచూచుచున్నాడు. ఒకవిధముగా ఇతడు యోగియే. అది యట్లుండె.

ఈ నాడీజాతకములలో ఒక వైచిత్ర్యము చూపట్టుచున్నది. గ్రంథమును చదివించి, జాతకమును వ్రాసుకొనువరకున్నదాక ఫలములు సమగ్రముగా చెల్లి వచ్చుటయు, అటుతరువాతి ఫలములు చాలవరకు తారుమారగుటయు అనేకుల అనుభవము. మహర్షుల వాక్యములు అసత్యము లగుట ఈ కలికాలప్రభావమనుకొని వారిలో పలువురు తృప్తిచెందుచున్నారు. ఇదేమో మోసమో, కనుకట్టో కావచ్చు ననుకొను వారు మరికొందరు. భావిఫలములు చెప్పుసందర్భములో "పూర్వజన్మపాపము శాంతించినచో [ఇది] జరుగును, [అది] జరుగును" అనుమాటలు నాడీగ్రంథములలో వ్రాయబడియుండుట సామాన్యాచారమగుటచే, తమ పాపఫలము పరిహారము కాలేదేమో అని కొందరు నెమ్మదిపడుచుండుటయు కలదు. మొత్తముమీద ఈ నాడీగ్రంథములు అర్థముకాని వ్యాసఘట్టములు.

కాని, ఈ గ్రంథములను వ్రాసినవా రెవరో, వారు వాస్తవముగా మహానుభావులే! వారి శక్తి సామాన్యమానవులు ఊహింప వీలులేనట్టిది. నారదుడు, విశ్వామిత్రుడు, వశిష్ఠుడు, పార్వతి, నందీశ్వరుడు మున్నగు వారు అరవభాషలోనో, ఆంధ్రభాషలోనో జాతకఫల చర్చ జరిపిరనికాని, జాతకములు వ్రాయించిరనికాని

విశ్వసించుట సాహసకార్యముకదా? ఈ కథాకలాపమంతయు దేవభాషలోనే జరిగియుండవలయును. అయినచో, దేశభాషలలోనికి ఆ గ్రంథములను ఎవరు, ఎందరు ఏ కాలములో పరివర్తనముచేసిరో? ఆ మూలగ్రంథము లెం దున్నవో చెప్పువారు లేరు. ఒక వేళ, ఇవే మూల గ్రంథము లేమో?

ఏది ఎట్లయిన నేమి, ఈ నాడీజాతకములలో చెప్పబడిన ఫలితములు మాత్రము ఆశ్చర్యకరము లయినవి. కాని, ఏయే గ్రహస్థితియోగములు కారణముగా, ఇంత సూక్ష్మఫలములు సాధింపబడినవో, ఆ రహస్యము మన మీ గ్రంథములనుండి తెలుసుకొనజాలకున్నాము. మనకిపుడు లభించు జ్యోతిశ్శాస్త్రగ్రంథములలో చెప్పబడిన గ్రహయోగాదులవలన ఊరు, పేరు, బంధువుల కథలు మున్నగా, నాడీగ్రంథములు వర్ణించురీతిగా సాధించుట సాధ్యము కాని పని. అగుటచే, ఏ కొందరు భాగ్యశాలురకో ఇవి ధనార్జనమునకు పనికివచ్చుచున్నవేకాని జిజ్ఞాసువులకైనా, విద్యార్థులకైనా ఉపయోగపడుట కష్టము.

అనుభవములేనివారికి తాత్కాలికముగా నాడీ గ్రంథములపై కలుగు విశ్వాసమును కనిపెట్టిన కొందరు ఇటీవల "నాడీజ్యోతిషము" చెప్పెదమని బోర్డులు తగిలించి జనులకు భ్రమకలిగించుచున్నారు. తన పేరు ప్రకటించుకొనక, మీనమో, మేషమో అను పేరు పెట్టుకొని, "నాడీజ్యోతిషము" అను పేరుతో కొన్ని పుస్తకములు ఈమధ్యనే ప్రకటించి, ఒకానొక గ్రంథకర్త డబ్బు గడించినాడు. అతతో ఈ గ్రంథములను కొని చదివిన విద్యార్థులు మోసపోతిమని నోరు చప్పరించుచున్నారు. ఇదికాక, ఈ నాడీగ్రంథములవలన జ్యోతిశ్శాస్త్రమునకే కీడువచ్చిన దనవచ్చును. ఏలందురా? జాతకఫలములు తెలుసుకొనగోరువారు ప్రాచీన సంప్రదాయము ననుసరించి హోరాశాస్త్రవేత్తలతో జాతకములు వ్రాయించుకొనుటకు మారు నాడీజాతకములకు ప్రాకులాడుట పరిపాటి అయినది. నాడీజాతకములు అనుభవమునకు రానివారు శాస్త్రములపైననే విశ్వాసమునుకోలుపోవుచున్నారు. జ్యోతిశ్శాస్త్రముపై జనాదరము తగ్గుటచే, జ్యోతిష్కులకు సాధారణముగా జీవిక నశించినది. శాస్త్రాభ్యాసమునకు కావలసిన ఉత్సాహము విద్యార్థులలో తగ్గుట ఈ పరిస్థితుల ఫలము. శాస్త్రాభివృద్ధికి ఇది అంతయు గొప్ప ప్రతిబంధక సామగ్రికదా!

ఒక్క ఉదాహరణమును చూడుడు.

౧౯౧౩వ సంవత్సరమున ఏప్రెలు నెలలో ౭వ తేదీనాడు (౧౫ ఉత్తరాషాంశలో, ౮౧ పూర్వో ఖాంశలో) జనించిన నా మిత్రు డొకడు కలడు. సాయంకాలము ౬ గంటలవేళ జననమని అతని పెద్దలు వ్రాసియుంచినారు. పసితనముండే, ౧౯౨౪వ సంవత్సరమున ఏప్రెలు నెలలో, నా మిత్రుని తండ్రి ఇహలోకయాత్ర చాలించుకొన్నాడు. ౧౮ వయస్సులో (౧౯౩౧ డిసెంబరు) వివాహమైనది. ౧౯౪౪వ సంవత్సరమున ఫిబ్రవరి నెలలో (౩౧వ యేట) బంగారువంటి భార్య కాలధర్మము నొందుటచే నామిత్రుని జీవితమునకు అంధకార మావరించెను. ఆంగ్ల భాషాభ్యాసము చేసి, ఉపాధ్యాయవృత్తిలో పట్టభద్రుడై, నిర్మలమయిన జీవయాత్ర సాగించుచున్న సాధుశీలుడితడు.

పైసామగ్రితో వలసినవారు సాయనముగనో, నిరయనముగనో జాతకకుండలి గుణించి, తమతమవాడుక ననుగుణముగా, దశాపద్ధతులతో పైఫలములను సాధించుకోవచ్చును.

చిన్నవయస్సులోనే గృహిణి గతించినది. ఆమె వలన కలిగిన సంతానమునందతము చేతి కందలేదు. ఇట్టి పరిస్థితులలో పునర్వివాహసమస్య బయలుదేరకమానదు కదా? కాని, భావిజీవితములోనయినా సుఖ మున్నదో లేదో యని నా మిత్రునికి భయము. మిత్రుల ప్రోద్బలము వలన, తన జాతకమునకు ప్రాచీనమహర్షు లేమి ఫలము చెప్పినారో కనుగొనవలయునను బుద్ధి నా మిత్రునికి కలిగినది. నారదనాడి నాశ్రయించి, ముకుపుల్లించి, తన జాతకమునకు సప్తమ (కళత్ర) భావమునుమాత్రేమ చదివించి వ్రాయించుకొన్నాడు. అరవభాషలో నున్న ఆ గ్రంథమునకు తెలుగు తెలిసిన ఒకానొక తమిళసోదరుని భాషాంతరీకరణమిట్లున్నది:

నారదుడు:—"పార్వతీ! భూలోకము, భువర్లోకము, సువర్లోకము, జనలోకము, తపోలోకము, మహాలోకము, సత్యలోకము అను లోకములలో, వానికి పైనుండు లోకములలోనహా ఇక్కడ అక్కడ ఎక్కడైనా, క్షణక్షణము సంచరించుచు, దేవతల కోరతలను తీర్తును. దైవభక్తిగల మనుష్యుల సందేహములు తీర్తును. దైవభక్తి లేనివారికి నేను చెప్పను. రాక్షసులకు చెప్పను. దేవతలకు, మానవులకు, ఉపకారసంబంధములు తెలియజేతును. ఏవిధముగానైనా భిన్నముండదు.

కన్యాలగ్నము. దానిలో సుఖముగా కేతువున్నాడు. గురువు నాల్గింట, కుజుడు, బుధుడు అరింట, రవి రాహువులు ఏడింట, శుక్రచంద్రులు ఎనిమిదింట, శని తొమ్మిదింట ఉండగా జనించినబాలుని ఫలము చెప్పుచున్నాను:—

| | | | |
|---|---|---|---|
| ర<br>రా | శు<br>చ | శ | |
| కు<br>బు | రాశి<br>కుండలి<br>—<br>(నారదనాడి) | | |
| | | | |
| గు | | | ల<br>కే |

ఆంధ్రనగరములో పుట్టినను, కీర్తిగా ఇతని పేరు చెప్పుకొంటారు. 'చిన్నకృష్ణ' అని చెప్పవచ్చును. దానికి తరువాత—అని యుండును. అతని తండ్రి వైకుంఠవాసుని, నేను ఎప్పుడూ పూజ చేయుచుండే విష్ణుని పేరుతో—అని పిలువబడును. ఇతని పేరు కడపట—అని యున్నది. తల్లి రాముని భార్య అను సీత అని పిలువబడును. పంచపాండవుల స్నేహితుడయిన శ్రీకృష్ణుని ఇతరనామము కలిగినవాడు ఇతని అన్న. ఇతని తమ్ముని పేరు వైకుంఠవాసుని మరియొక పేరు.

పూర్వీకధనము పాడయిపోయినది. పూర్వీకనగరములో ఉండడు. ఇతని అన్న సహా పూర్వీకనగరములో ఉండడు. కడపటి తమ్ముడు ఇంకొక్క నగరములో నున్నాడు. ఈ జాతకుడు యోగవంతుడు.

పార్వతి:—నారదా! ఏవిధమైన యోగము?

నారదుడు:—వినుము. కడపటి తమ్మునికి తండ్రిధనము కొంచెము అయినా ఉండదు. ఇంకొకరికి ఇతడు కుమారుడై, అనగా దత్తుపోయినాడు. ధనము ఎక్కువ లేదు. సుఖము లేదు. ఇతడు అక యోగము కలిగినవాడు. ఉద్యోగపు చదువు ఎక్కువ లేదు. ఈ జాతకుడు యోగవంతుడు. అన్న ఇతరులను ఆశ్రయించి గంభీరముగా యోగము జరుపుకొనును. అన్నదమ్ములలో జాతకునికి ఎక్కువ యోగము. యోగవంతుడే! సందేహము లేదు. భార్య వచ్చినతరువాత మంచియోగము. ఆ భార్యగుండా యోగము అనుభవించినాడు. తరువాత యోగము పాడయిపోయినది. భార్య పోయినది. పరితాపముతో పోయినది. లక్ష్మి అని పేరు కలిగినది. ఆమె మహాలక్ష్మివలె ఉండినది. ఆభార్య కొన్ని దినములే సంసారము చేయును. ఎప్పుడూ రోగిగానే ఉండినది. శ్వాసరోగము. గర్భము ధరించినది. ఆ గర్భము పాడయిపోయినది. ఫలితము కాలేదు. అవస్థ అయినది. దగ్గరసంబంధము కాదు. రెండవభార్య ఇంకా దూరమునుండి వచ్చును. ఆ భార్యవలన వచ్చిన యోగము పోయినది. అవస్థ సంభవించినది. భార్య పోయి కొంతకాలము గడచినది. సంవత్సరము జరిగినది. 3౦ సంవత్సరములవయస్సులో, మకరరవిమాసములో గండము. ఏమందు ఇచ్చినా ఉబ్బసము, శ్వాస ఎక్కువ అయి, కడుపు పెద్దదై, ఆ స్త్రీ తపించినది. పెండ్లి అయిన ఒక సంవత్సరము లోపలనే రోగము ప్రారంభమైనది.

పార్వతి:—పూర్ణముగా రోగము ఎక్కువ అయి శ్వాసతో చనిపోయినది అని చెప్పితివే, నారదా! రెండవభార్య ఎవరు?

నారదుడు:—రెండవభార్య శీలము కలిగినది, ఆమె అందమైనది. లక్ష్మికి సమానమైన పేరు.

పార్వతి:—ఆపేరేమి? నారదా! బాగా చెప్పుము. శంకరుని పేరా, ఏ దేవత పేరు? ఎవరి పేరు? సరస్వతి పేరా? న్యాయముగా చెప్పు.

నారదుడు:—లక్ష్మివలె అందమున్నా, లక్ష్మి అని పేరు కాదు. సరస్వతి పేరు కాదు. సాధారణముగా కలియుగములో ఉండే పేరు. భార్య ఎట్లు వచ్చును? ఎవ్వతె వచ్చును? అని యోజించి, ౧౧ వ భావమును గురించిన కాండలో శీలవతి అయిన కన్యను గురించి చెప్పియున్నాను. ఆ కాండ జాతకుడు వినవలయును. ఇంకెవ్వరూ వినకూడదు. ఆ కాండలో భార్య పేరు, ఆమె జాతకము సరిగా చెప్పుచున్నాను. ఆ స్త్రీనే ఇతడు వివాహమాడవలయును. దానిలో మర్మము చెప్పియున్నాను. వివరములు పూర్ణముగా చెప్పినాను.

పార్వతి:—ఏ సంవత్సరము వివాహము జరుగునో, చెప్పుము.

నారదుడు:—శారణ నామసంవత్సరములోనే వివాహము జరుగును. ౧౧ వ కాండలో వివరములు చెప్పినాను, సమృద్ధిగా.

పార్వతి:—భార్యలు ఇద్దరా, ముగ్గురా? ఎంతమంది? నాకు సందేహమున్నది. తీర్చు నారదా! పూర్ణముగా ఏడవభావాధిపతి స్వక్షేత్రములో ఉండినా కూడా, కళత్రదోషము ఎట్లు వచ్చినది? ఇంకొక్క సందేహము కొంత ఉన్నది. చంద్రకేంద్రములో శుక్రుడు ఉండుట మంచిదయినది. ఎనిమిదింట ఉండిన చెడుపు పూర్ణముగా లేదు. ఈ సందేహము తీర్చు నారదా!

నారదుడు:—అమ్మా! విను చెప్పుచున్నాను. ఏడింట రవిరాహువు లుండుటచేత భార్య చనిపోయినది.

పార్వతి:—రెండవభార్యకూడా చనిపోవునా? దాని విధమెట్లు?

నారదుడు:—గర్భలగ్నము చూచి ౧౧ వ కాండలో చెప్పుదును. భార్యలు ఇద్దరో, ముగ్గురా అనే సందేహము దానిలో తీర్తును. ఈ భావములో ఈ సందేహము తీరదు అని నేను చెప్పుచున్నాను.

పార్వతి:—ఈ భార్యవలన యోగమున్నదా?

నారదుడు:—దీనిలో చెప్పను. జాతకుడే ౧౧ వ కాండ విని తెలుసుకోవలెను. కళత్రదోషము పోవుటకు కళత్రములు రెండు కూడయిన దోషము పోవలెను. ౧౧ వ కాండలో రెండవభార్యవిషయము చెప్పబడును. ఇంతే ఏడవభావఫలము."

ఈ నారదు డెక్కడో బలే అసాధ్యుడుగా నున్నాడు. కలియుగానికి తగినవాడే! జగన్మాత పార్వతి గ్రుచ్చిగ్రుచ్చి అడిగినా, చెప్పనని మొండి చేయుచున్నాడు! భార్యలవిషయము కళత్ర (సప్తమ) భావములో పూర్తిగా చెప్పడట! పదునొకండవ భావ ఫలములోనే ఆ విషయము నిర్ధరించునట. ఎందుకో, కారణమయినా చెప్పలేదు. తన నాడీ గ్రంథమును సంపాదించుకొన్న అదృష్టశాలికి రెండవమారు ముడుపు నిప్పించుటకా ఈ నారదుని కుట్రయుక్తి? మరి యొక్కటింకే విన్నారుకదా? జాతకు డొక్కడే వినవలయునట! ఇతరు లెవ్వరూ వినకూడదట! ఇదేమి చిదంబరరహస్యమో? ఇతరులు విన్నచో ఫలములు చెల్లి రావని కూడా దీని అర్థము? అట్లయినచో, ఇది శాపమో, జాతకమో?

రత్నమువంటి అర్ధాంగిని పోగొట్టుకొని దుఃఖించుచున్న నా మిత్రునికి నారదమహర్షి మరింత ఆందోళనము తెచ్చిపెట్టినట్లయినది. రెండవమారు వివాహము చేసుకున్నా, లాభము లేదేమో అని. తనకు కళత్రసౌఖ్యము లేదని తలవ్రాత యున్నప్పుడు, ఏ కర్మము నెరుగని మరియొక కన్యను రెండవభార్యగా తెచ్చుకొని, తన దురదృష్టమును ఆమెకు సయితము పంచియీయ నేల? ఇంతకు, తన ఆయుర్దాయ మెంత యున్నదో? అల్పాయుస్సని యేర్పడినచో, ఈ ప్రసంగములే అనవసరముగునుకదా?

ఆయుర్దాయమును తెలుసుకొనుట ముఖ్యమని నా మిత్రునికి తోచినది. మరల నారదనాడి శాస్త్రియుంచి

దక్షిణ సమర్పించి అష్టమభావకాండము చదివించి వ్రాసుకొన్నాడు. 'పునః శ్రావన, ప్రావన' ఆరంభ మైనది. మామూలుపద్ధతితో, మరల ఆదే రాశికుండలి, అవే పేర్లు, అవే సంబంధములు ఏకరువుపెట్టబడినవి. విశేష మేమనగా ? ఇతనికి గండము ఉండి ఆ ఫలము ప్రథమభార్యమైన వెళ్లిన దనియు, ఇంకను కొన్ని కష్టములు వచ్చునవియు, ఇతని ఆయుస్సునుగూర్చియు, ఇతని రెండవభార్య గండములనుగూర్చియు, ఇతర యోగములననుసరించియు ౧౧వ కాండలో విస్తారముగా చెప్పదుమని నారదుడు ఇంతటితో పార్వతీదేవిని నిరుత్తరను కావించినాడు. ఎనిమిదవ భావకాండను చదివించుకొన్న తరువాత, నా మిత్రుని సందేహములు తీరుటకు మారుగా శంకలు అధికమయినవి. ఇక, ౧౧ వ కాండకు ముడుపు చెల్లించి చదివించినచో, ౧౨ వ కాండను చదువనలె నని నారదుని ఆజ్ఞ అవునేమో అని నామిత్రుడు భయపడినాడు. నారదుని కొక్క నమస్కారముపెట్టి నా మిత్రుడు అంతటితో చాలించుకొన్నాడు.

ఏడెనిమిది నెలలు గడచిపోయినవి. నారదుడు తెచ్చిపెట్టిన సందిగ్ధావస్థతో కాలము గడచుట నా మిత్రునికి చాల కష్టమయ్యెను. కొంత విరక్తిని తెచ్చుకొన్నాడు. కాని, ప్రాపంచికముగా ఎంతో కథ జరుపవలసిన చిన్న వయస్సు. గౌరవాస్పదమైన విద్య, విద్యకు తగిన వృత్తి, నీతినియమముల కలవాటుపడిన జీవనము, జీవనమునకు వలసిన ఆర్జన. కాని, ఇంట గృహలక్ష్మి లేదు. ఇట్టి పరిస్థితులలో మనస్సునకు శాంతి లభించినది కాదు. ఏదో, బంధపగలగొట్టినట్లు, ఖచ్చితముగా తేల్పక నారదుడు సందిగ్ధావస్థ తెచ్చిపెట్టినాడు. అథమో, శుభమో తేల్పనిచో నెమ్మది లేదు. ఎంతవ్యయమయినా కానిత్తు మనిపించినది. మరల రెండు మాటపదార్థు ముట్టచెప్పి, నామిత్రుడు నాడీగ్రంథమును ఆరాధించినాడు. ౧౧ వకాండమాత్రమే కాక, ఇతర కాండములుపయితము మరి కొన్నింటిని ఆమూలాగ్రముగా నారదవాక్యములను చదివించి, వ్రాయించుకొన్నాడు. ఇపుడు కొంత నయమే. రెండవభార్యకు గండము లేదని నారదమహాముని ఈతూరి తేల్చినాడు.

ఆమె పేరు 'సుశీల' అట. తారణసంవత్సరములోనే వివాహము జరుగునట ! వెంటనే సంతానారంభమట ! కలుగబోవు ఇద్దరుకుమారుల జాతకములుకూడ నారదమహాముని వర్ణించి చెప్పినాడు. వారికి నామకరణమహోత్సవముసయితము వచించినది. విశేష మేమనగా, గొప్పయోగ మబ్బి, ఉన్నతపదవి లభించి, నా మిత్రుడు మోటారుకారులో తిరుగుననియు, రాగల అక్షయసంవత్సరమున (౧౯౫౬ A. D.) మకరసంక్రమణపుణ్యకాలములో సూర్యోదయకాలమందు యోగాభ్యాసముతో (౭౩ సంవత్సరముల వయస్సులో) జాతకుడు శరీరయాత్ర చాలించి, పునర్జన్మక్లేశము లేకుండ ముక్తిని పొందుననియు నారదమహాముని సెలవిచ్చినాడు. పూర్వజన్మములో నామిత్రుడు క్షత్రియవంశమున జనించి, ఒకానొక రాజునకు సహచరుడుగా వేటాడుచు, ఒక హరిణిని బాణముతో కొట్టి చంపెనట! ఆ పాపమునకు ఫలముగా, ఈ జన్మములో అతని ప్రథమజాయ ఆ కాలమృత్యువుపాలయ్యెనట!

నారదనాడినుండి నామిత్రునికి తెలిసిన రహస్యము లివి. అతని అనాకాంక్షితమనస్సునకు కొంత శాంతి లభించినది. ఉన్నతపదవి, మోటారుకారు వాహనయోగము, యోగాభ్యాసమువలన పరమపదప్రాప్తి, వీని మాట ఎట్లయినా, ఆ తారణసంవత్సరమునందే రెండవ వివాహము జరుగగలదనియు, ద్వితీయకళత్రమునకు గండము లేదనియు, తనకు దీర్ఘాయుర్యోగ మున్నదనియు మహర్షి ఆశీర్వాదము వచ్చుటచే నామిత్రుడు కొంత నెమ్మదిపడినాడు.

కాని, అదో, ఇదో, అనునంతలోనే మెల్లగా తారణసంవత్సరము జారుకొనిపోయినది. 'సుశీల' రాలేదు. మామచున్నట్టి పార్థివ, వ్యయ, సర్వజిత్తు, సర్వధారి, విరోధిసంవత్సరములు, అడుగకయే వచ్చి, చెప్పకయే చల్లగా వెడలిపోయినవి. వికృతిసంవత్సరములో కొంత అప్పుడే గడచినది. రెండవభార్య వచ్చు పొలకువ కానరాలేదు. జాతకుడు చక్కని శీలవంతుడు. నియమబద్ధమైన నిర్మలనైతికజీవన మతనిది. ఉపాధ్యాయవృత్తిలో ఉన్న అవిద్యను సాధించి, అతడు

విధిలేక బ్రహ్మచర్యముతో ఒంటరిగా కాలమును వెళ్లబుచ్చుచున్నాడు.

రజాకార్ల అరాజకప్రభుత్వమువలని అవ్యవస్థను రుచిచూచిన హైదరాబాదుసంస్థానమున ౧౯౪౮ వ సంవత్సరమున ఆగస్టు నెలలో ౧౩-వ తేదీనాడు ఇండియన్ యూనియన్ సేనలు పోలీసుచర్యకై ప్రవేశించిన తరువాత రమారమి ఏడాదికి పైగా మిలిటరీగవర్నరు రాజ్య మేలినాడుకదా! ఆకాలములో సంస్థానమున గొప్ప మార్పులు వచ్చినవి. ముఖ్యముగా, రాజ్యాంగపు ఉద్యోగపదవులలో త్రాసు తలక్రిందైనది. అనేకులు గొప్ప ఉద్యోగములను పోగొట్టుకొనిరి. స్వప్నములో నయితము ఆశించలేనంతటి గొప్పపదవులను అదృష్టవంతులు కొందరు సులభముగా సంపాదించుకొన్నారు. బేహార్లు, బ్యాంకర్లు, కంట్రాక్టర్లు మున్నగువారిలో సయితము భాగ్యరేఖ తారుమారైనది. ఇట్టిపన్నివేశములలో, తాత్కాలికముగనయినా, అనేకులకు జాతకఫలములపై అభిమానము వచ్చుట వింతకాదు. ఈసమయమును గమనించి, ఉపజ్ఞాశాలియగు ఒక నాడీగ్రంథాధికారి భాగ్యనగరము చేరుకొని, పెద్ద బోర్డు తగిలించి కరపత్రములను విరివిగా పంచిపెట్టినాడు. ఇకనిది 'కౌశిక నాడి'. పార్వతీదేవిసభలో వశిష్ఠవిశ్వామిత్రుల వాదోపవాదములతో ఆగ్రంథములో జాతకఫలములు వ్రాయబడినవి. ఇక అడుగవలయునా? నాలుగయిదు నెలలకాలము విరామము లేక, వడగండ్లవాన కురిసినట్లు, కరెన్సీ నోట్లవర్షము కౌశికనాడిపైన కురిసినది. ఇతరుల మాట ఎట్లుండినా, నాడీగ్రంథాధికారికిమాత్రము, నిస్సంశయముగా, అపూర్వమయిన శుక్రమహాదశ వచ్చియుండును. క్రొత్త ఉద్యోగములు వచ్చునేమో అను ఆశతో కొందరు, ప్రాతవి ఊడిపోవునేమో అను భయముతో కొందరు, ఊడిపోయినవి మరల సంపాదించవచ్చునేమో అను ఊహతో కొందరు, క్రొత్తవ్యాపారము గిట్టునా యని కొందరు, వచ్చిన క్రిమినలుకేసులు తేలిపోవునా యని కొందరు, వ్యాపారపుపర్మిట్లు దొరకునా యని కొందరు—ఒకరిని చూచి ఇంకొకరు, వారి ప్రేరేపణతో ఇంకొకరు, వారి మిత్రులు మరి కొందరు, ఇదేమో తమాషా చూతమని కొందరు, విద్యావంతు లేమి, ధనవంతులేమి, కులమతవివక్షలేకుండ, అహమహమికతో నూర్లకొలది, వేలకొలది, ముడుపులు సమర్పించుకొని, జాతకములు వ్రాయించుకొన్నారు. దాదాపు లక్షరూపాయలుదాక వశిష్ఠవిశ్వామిత్రులకు సంభావన ముట్టియుండునని పలువురు అంచనా వేయుచున్నారు.

ఈమహాప్రవాహములో నామిత్రుడుసహా దొరకకొనకతప్పినది కాదు. అతని కంత సరదా లేకుండినా, అతని ఆప్తమిత్రులు, హితైషులు వదలలేదు, మహర్షులకు మరల సంభావన సమర్పించుకొని, తన జాతకమునకు సప్తమభావఫలమునుమాత్రము నామిత్రుడు వ్రాసుకొన్నాడు. యథాప్రకారము కులగోత్రనామాదులు చెప్పబడినవి. ఉదయాదిగా ౨౯ ఘడియలు, ౧౩ విఘడియలు, ౫ లిప్తలకు నామిత్రుని జననమట! ఇంత నికరముగా జన్మకాలమును తెల్పి, కడకు ఇచ్చినదేమో కేవలరాశికుండలిమాత్రమే! ఇదే ఆ కుండలి:—

| | | | |
|---|---|---|---|
| ర బు రా | చ శు | శ | |
| కు | రాశికుండలి — (కౌశిక నాడి) — | | |
| | | | |
| గు | | | ల కే |

ఇచట పాఠకమహాశయులు గమనింపవలసిన విశేష మొక్కటి కలదు. నారదుని కుండలిలో బుధుడు కుంభరాశిలో ఆరవభావములో నుండెను. వశిష్ఠుని కుండలిలో ఆబుధుడు మీనమునకు పోయి సప్తమభావమును చేరుకొన్నాడు. ఇది యీ మహర్షుల గణితసిద్ధాంతములలోని వ్యత్యాసమువలని ఫలమేమో! ఇద్దరును జ్యోతిశ్శాస్త్రమున కాచార్యులే. కాని భిన్నరాశికుండలుల నుపయోగించి ఈ ఇరువురును ఒకే

వ్యక్తికి జాతకఫలాదేశము చేయగలుగుట ఎట్లు సంభవమో, మన కర్థముకాని దేవరహాస్యము! ఉండనిండు.

ఇక ఫలములకు వత్తము. ౧౮వ సంవత్సరములోగా జాతకుని తండ్రి గతించినాడనియు, ౨౮ వ సంవత్సరములో వివాహమై తరువాత ౬, అథవా ౭ సంవత్సరాలకు ప్రథమభార్య గతించు ననియు, పూర్వజన్మ పాపపరిహారమయినచో, అప్పటినుండి ఒకసంవత్సరములోపుగనే, గురువు కుంభములో నున్నప్పుడు, రెండవ వివాహ మగుననియు, ఆ చిన్నది పరాయిసంబంధమనియు, పేరు 'లక్ష్మి' అనియు ఫలము చెప్పబడినది. నారదమహర్షి చెప్పిన 'సుశీల'ను మరువవలసినదే! ఈమె దక్షిణదిక్కునుండి వచ్చునట! అనగా, ఆగ్నేయదిక్కునుండి నైఋతిదిశవరకు అర్థమని నాడీగ్రంథాధికారి వ్యాఖ్యానము చెప్పినాడట. మకరములో శని, మిథునములో గురువు, కరరాశిలో కుజుడు, స్థిరరాశిలో రవి ఉన్న కాలములో ఆమె జనించియుండునట. అనగా, ౧౯౩౦ వ సంవత్సరములో కాబోవు రెండవభార్యజనన మని అర్థము. నామిత్రునికి ౭౫ సంవత్సరములు ఆయుర్దాయమని వసిష్ఠుడు నిర్ణయించినాడు.

మొత్తముమీద, నారదునికంటె వశిష్ఠుడు కొంత నయమే! ౧౧ వ కాండనో, ౧౨ వ కాండనో చూడమనలేదు. కాని, పూర్వజన్మపాపపరిహారమైతే ద్వితీయవివాహమట! అది అగునో, కాదో చెప్పలేదు. ౧౯౫౦ మార్చినుండి ౧౯౫౧ మార్చి నెలదాక గురువు (నిరయనముగా) కుంభములో ఉండగలడు. ఆలోగా పాపపరిహార మగునో, కాదో నిరీక్షించుట మాత్రమే మన కర్తవ్యము.

అది యట్లుండె. లగ్నాధిపతి బుధుడు ఆరింట నున్నాడని నారదుడు, ఏడింట నున్నాడని వశిష్ఠుడు జాతకఫలములను సాధించినారుకదా? ఈ రెండు జాతకములు ఒకే వ్యక్తికి ఎట్లు చెల్లునో బోధపడుట కష్టము. వివాహమైనతరువాత ఒక సంవత్సరమునుండి ప్రథమజాయ రోగముపాలయిన దనియు, ౩౦ వ సంవత్సరములో ఉబ్బుసవ్యాధితో గతించిన దనియు, గడచిన తారణ (౧౯౪౪-౪౫) లోనే రెండవ వివాహము జరిగితీరుననియు నారదమహర్షి తీర్మానముకదా? వాస్తవస్థితిలో, ఆమెకు వివాహానంతరము పదిసంవత్సరములకే రుగ్మత ఆరంభించుట. ఆమె బాధపడినది శ్వాసవ్యాధితో కాదు, జలోదరవ్యాధితో! ఇక, తారణ సంవత్సరములో రెండవ వివాహముకూడ కాలేదు. ఇది యిట్లుంచి కాశిక నాడీఫలములను చూతము. జాతకుని తండ్రి లోకాంతరగతుడగుట ౧౧వ ఏటనేకాని ౧౮ వ సంవత్సరములో కాదు. మొదటి వివాహము ౧౭ సంవత్సరముల వయస్సులో జరిగినదేకాని, ౨౮ ఏండ్లకు కాదు. వివాహానంతరము ౧౨ సంవత్సరములకు కళత్రనష్టము జరిగినదేకాని, ౬ అథవా, ౭ ఏండ్లకు కాదు. ఇక, భావిఫలము లెట్లుండగలవో?

ఈ రెండు నాడీగ్రంథములలో భిన్నకుండలులు ఉపయోగింపబడినవి. కావుననే, ఫలములు కొంత వ్యత్యస్తమైన వనవచ్చునేమో? కాని, కులగోత్రనామాదులు, బంధువుల కథలు మున్నగు వివరములు సరిగావచ్చుట కేమి హేతువో? ఈ కేవలరాశికుండలులనుండియే అవి సాధింపబడినవని నమ్ముట అసాధ్యము. సూక్ష్మగ్రహస్థితినుండియే ఇవి సాధింపబడినవని నమ్మినయెడల, ఆ సామగ్రిని మన కీయక రహస్యముగ దాచి, మహర్షులు మనలను వేలపుచ్చినారా? ఎట్లయినా, ఇంత సూక్ష్మఫలములు చెప్పిన మహర్షులు తప్పుచేసినా రనజాలము. అగుటచే, ఆ యాఫలములను నికరముగా, పూర్తిగా అనుభవించిన వ్యక్తులు వేరే ఉండకతీరదు. కాని, వారికి ఇవే కులగోత్రనామాదులు సరిపోవలయునుగదా? ఇది అసాధ్యమని తోచుట సామాన్యముగా సహజమే కాని అసంభవము కాదేమో! కోట్లకొలది మానవులలో ఏకొందరిని మాత్రమో మన మెరుగుదుము. ఆ కొంచెపు సామగ్రి చాలునా! నామిత్రుని పేరు గలవా రనేకు లుండవచ్చును. వారిలో తలిదండ్రుల పేర్లు మున్నగు వివరములు సరిపోవువారు కొందరుండరాదా? వారి జీవితము లెట్లున్నవో? నామిత్రుని అనుభవములతో అతకని దశాఫలములు కొన్ని చెప్ప

డినవికదా! అవి వారిలో నెవరి కయినా చెల్లునేమో!

ఈ నాడీజాతకముల ఫలములు తప్పనుట నా ఆశయము కాదు. నిస్సంశయముగా, ఇవి అపూర్వగ్రంథములు! వానిలోని ఫలములు సత్యముగానే ఉండును. ప్రాచీనకాలములో మన దేశమునందు జ్యోతిశ్శాస్త్రము సాధించిన ఫలము ప్రపంచములో అనన్యసామాన్యమయినది. కాని, వచ్చిన చిక్కేమనగా, ఈసంపుటములలోని జాతకములలో, ఫలానా జాతకము తనదే అని నిర్ధరించుకొను బాధ్యత జాతకునిదే! శాస్త్రజ్ఞునిది కాదు! నాడీగ్రంథాధికారులు శాస్త్రజ్ఞులను కొన్నచో, మనదే పొరబాటు. కొన్ని జాతకములను చదివించుకొని, వానిలో అప్పటికి తన అనుభవములకు సరిపడినదానిని జాతకుడు వ్రాసుకొనుట కార్యక్రమము. నాడీగ్రంథములో పృచ్ఛకుని పేరు రాగానే, నమ్మకము వచ్చుచున్నది. అనుభవములో కొన్ని ముఖ్యఘట్టములు సరిపోయినపుడు విశ్వాసము భద్రపడును. కాలములో కొంత తేడా వచ్చినా, దాని నంతగా గమనించువా రుండరు. గమనించినా, ఏదో విధముగా వారే తమంత సమన్వయము చేసుకొనుట జరుగును. లేదా, నాడీగ్రంథాధికారి సహాయపడి వ్యాఖ్యానము చేసి సమన్వయపరచును. ౧౮ వయస్సు వచ్చువేళకు తండ్రి మరణమని నాడిలో వచ్చిన దనుకొందము. తన తండ్రి ౧౦ సంవత్సరములవయస్సులో గతించినాడని పృచ్ఛకుడు చెప్పినచో, "సరే! ౧౮ లోగానే జరిగినది. మీదే ఈ జాతకము." అని నాడీగ్రంథాధికారి సమన్వయపరచును. శ్రీరాముని భార్యపేరు కలది తల్లి అని నాడీగ్రంథములో విన్నప్పుడు, సీతమ్మకుమారుడైనా, జానకమ్మకుమారుడైనా, పృచ్ఛకుడు 'వాస్తవమే' అని ఒప్పుకొనునుగదా! నికరముగా పేరు రాలేదని ఆక్షేపించినచో, నాడీగ్రంథాధికారి మహర్షుల సంప్రదాయ మిదే అని కాని, మనము మహర్షులు చెప్పినదానిని సమన్వయము చేసుకొనవలెనని కాని ఉపన్యసించి పృచ్ఛకుని నిరుత్తరుని చేయుటసయితము కలదు. అడిగినవానికి జాతకము నిచ్చి ముకుపులు సంపాదించుటే వారి వృత్తి. స్వల్పవ్యత్యాసము కానవచ్చినా, మరల వేరొక జాతకమును వెదకుచుకాని, అనేకజాతకములను ఒకేవ్యక్తికి వినిపించుచుకాని, కాలయాపనము చేయుచు కూర్చున్నచో, వారికి వ్యాపారము గిట్టదు. అనుటచే, కొన్ని అనుభవములు, పేర్లు సరిపడిన జాతకము దొరకగానే, దానిని ఏదోరీతిగా సమన్వయపరచి పృచ్ఛకునికి అంటగట్టుటకే వారు ప్రయత్నించుట వారి వ్యాపార నీతి. ఇట్టి సన్నివేశములలో నికరమయిన జాతకము నాడీగ్రంథములో ఉండినా, అది లక్షించుట కష్టము. అనుభవముల దశాకాలము వ్యత్యాసమయినచో, జాతకమే మారవచ్చునని అనేకులు ఊహించుకొనలేరు.

చెప్పవచ్చిన దేమనగా, నారదనాడిప్రకారము దశాఫలమును అనుభవించిన వ్యక్తి వేరు; కౌశికనాడి ప్రకారము ఫలముల ననుభవించిన వ్యక్తి వేరు; వీరు నామిత్రులకంటె భిన్నులుగా ఉండితీరవలె ననుట! ఇంతే కాదు. పైఇద్దరు ఈశతాబ్దములోనివారే కావలయు నను నిర్బంధము కూడ లేదు. మహర్షులు మనకాలమునకే ఈజాతకములు వ్రాసిఉంచినా రనుకొనరాదు కదా? గడచినశతాబ్దములలోనో, రాబోవు శతాబ్దములలోనో ఇట్టి కుండలిగలవారు ఉండరాదా?

కౌశిక నాడిలోనుండి తన జాతకమును వ్రాసుకొన్న నామిత్రుడు మరియొక డున్నాడు. కొన్ని జాతకములను చదివించి, పేర్లు, అనుభవములు సరిపడిన దానిని వ్రాసుకొనెనట. తాను చదివించినవానిలో మరియొక జాతకములోసయితము పైవివరము లన్నియును సరిపోయినా, ఏకకళత్రమని వచ్చుటచే, అది తనది కాదని నిరాకరించగా, మరికొంత కాలయాపన జరిగినతరువాత వేరొకజాతకము లభించినదట! నా మిత్రు డిపుడు కాపురముచేయుచుండుట మూడవ భార్యతో, తా నిపుడు వ్రాసుకొన్న జాతకములో ఈ ఫలముసహా వచ్చినదని అతడు చెప్పినాడు, కాని, ఒక్క విశేషము. ౧౨ సంవత్సరముల వయస్సులో తండ్రి గతించునని జాతకములో వ్రాయబడినది. నామిత్రుని

తండ్రి కుమారుని ౨౮ ఏటనే మరణించుట. ఇంకను కొన్ని జాతకములను చదివించి యున్నచో, ఈఫలము కూడ సరిగా వచ్చు వేరుజాతకము లభించియుండెడి దేమో! భావిఫలములు నాడీ గ్రంథములలో చెప్పినవి నిశ్చయముగా జరుగకపోవుటకు పృచ్ఛకుల అశ్రమో, అశ్రద్ధయో కారణముగా నుండునని నాయూహ. అనగా ఎప్పటిదో, ఏవ్యక్తిదో జాతకము వ్రాసుకొని పూర్తిగా ఫలము రమ్మనగా, ఎట్లు వచ్చును?

ఏది ఎట్లయినా, ప్రాచీనజ్యోతిశ్శాస్త్రవేత్తలు మన కిచ్చిపోయిన అమూల్యమయిన ఆస్తి ఈ నాడీ గ్రంథములు. ఇవి ఇపుడు యేకొందరు స్వార్థపరుల చేతులలోనో నిలిచిపోయినవి. జిజ్ఞాసువులకు వలసినంత ఉపయోగపడక పోవుటే కాక, అనవసరమైన ఆశలు కొందరికి కల్పించుటమూలముగా ఇవి పతనహేతువు లగుచున్నవి. వీని ప్రచారము శాస్త్రాభివృద్ధికి సయితము ప్రతిబంధక సామగ్రిగనే పరిణమించుట విచారకరము. అనేక నాడీగ్రంథములు ఖిలములగుచున్నవికూడ. ఉన్నవి అసమగ్రములు. లాభదృష్టి గలవారు కొందరు ఆగ్రంథములలోని పుటలను విక్రయించుటకూడ కలదట. అమెరికా దేశములోనో, జర్మనీలోనో ఇట్టి గ్రంథము లుండినచో, ఎప్పుడో అవి రాజ్యాంగమువారి చేతులలో పడి జాతీయగ్రంథాలయములలో కాపాడబడి యుండును. భారతరాజ్యాంగమువారికి ఈ శాస్త్రముపై అభిమానము లేదు. ఉన్నచో, వీనిని సులభముగా సంపాదించియుందురు. విశ్వవిద్యాలయములయినా వీనిని సంపాదించి పరిశోధకుల అందుబాటులోనికి తెచ్చినచో, ప్రపంచమునకే హితమగును. ప్రాచీనభారతదేశ విజ్ఞానము జగద్విఖ్యాతి నార్జించును.

మన స్వతంత్రభారతభూమి అంతటి భాగ్యమును నోచుకొన్నదో, లేదో!

"బోద్ధారో మత్సరగ్రస్తాః,
ప్రభవః స్మయదూషితాః,
అబోధోపహతా శ్చాన్యే,
జీర్ణ మంగే సుభాషితం." (భర్తృహరి)



# హాసంతి

[కథానిక]

శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

నాన్నపురం మార్కెట్టుప్రాంతంలోకి వచ్చేటప్పటికి—కుర్రవాడు "ఇదేకదా తాతయ్యా మార్కెట్టు! ఇక్కడనేగా—చెట్టు పడిపోయి చెట్టుక్రింద కాపుర మున్న బిచ్చగాళ్లు చాలామంది చచ్చిపోయింది!" అని తాతయ్యను ప్రశ్నించాడు.

"అవునుగాని—నీ కీసంగతి యెవరు చెప్పారురా బాబూ" అన్నాడు తాత.

"లక్ష్మడు—ప్రొద్దున్న నీతో చెప్తున్నాడుగా- మనం మార్కెట్టులోనుంచి పోదాము తాతయ్యా! ఆ పడిపోయిన చెట్టూ—అదీ చూద్దాము."

"వద్దురా! బాబూ! కాలవగట్టునుంచి పోదాము—అక్కడ మీనాయన చిన్నప్పుడు చదువుకున్న స్కూలు ఉన్నది దాన్ని చూద్దువుగాని"— అన్నాడు తాతయ్య.

"కాదు—నేను మార్కెట్టులో పడిపోయిన చెట్టూ—దానిక్రింద పడి చనిపోయిన దీనవాళ్లనూ—చూడాలసిందే!— లక్ష్మడూ! మన బండీ ఆ చెట్టు ప్రక్కనుంచితోలరా—తాతయ్యకూడ ఒప్పుకున్నట్టే" అని మంకుపట్టు చూపించాడు కుర్రవాడు. సాధారణంగా ముసలివాళ్ళకూ—పసివాళ్ళకూ అభిప్రాయ భేదాలు వచ్చినప్పుడు—పసివాళ్ల మాట నెగ్గుకున్నట్లుగానే— యిప్పుడుకూడా ఆరేళ్ల మనుమడు—అరవై యేళ్ళ తాతయ్యమాటను తోసిరాజన్నాడు.

ఆ మనుమని—ఆ తాతయ్య యేయే పరిస్థితులలో పెంచుకుంటూ వస్తున్నాడో తెలిసినవాళ్ళంతా తాతయ్య మనుమని కోర్కె తీర్చివుంటాడనే వూహిస్తారు.

ఆ తాతయ్య వయస్సులో వుండగా—లేక లేక—పదేళ్ల సంసారసౌఖ్యానుభవంఫలితంగా—వొక్క కొడుకుని ప్రసవించి—భార్య చనిపోయింది. ఆ పసికూనను చూచుకుంటూ మళ్లా పెళ్లిసంగతి తలపెట్టకుండా—రోజులు వెళ్ళబుచ్చాడు—కొడుక్కి యిరవై యేళ్ళు రాగానే పెండ్లిచేసి—ఆస్తి వప్పగించి తాను 'కృష్ణా—రామా' అంటూ కూర్చున్నాడు. కాని దురదృష్టవశాత్తూ — తరువాత రెండేళ్లకు—కోడలు—యీ పసికూనను ప్రసవించి చనిపోయింది. మళ్లా దుఃఖసాగరం—కొడుక్కి పునర్వివాహప్రయత్నం—రెండో పెళ్లి లగ్నం పెట్టుకొని—సర్వసన్నాహాలూ సాగుతుండగా—కొడుకు మహావ్యాధి సోకి మరణించడం—మళ్లా తాను పుట్టెడంత దుఃఖమూ దిగమ్రింగుకుంటూ—యీ పసికందును సాకుతూ ఆస్తివ్యవహారాలు చూచుకొంటున్నాడు. అధిక దుఃఖవ్యవసాయమైన తన జీవితంలో—యీ చిన్న మనుమణ్ణి చూచుకుంటూ తాతయ్య రోజులు గడుపుతున్నాడు. తానే చనిపోయి తన కుమారుడు బ్రతికివుంటే బాగుండేదని నిత్యమూ భావిస్తున్నప్పటికీన్నీ మనుమడికెదుటమాత్రం—నిత్యసంతోషిగా — తాత అగుపిస్తూవుంటాడు— లేకపోతే— యిప్పటినుంచీ— తన దుఃఖాలు మనుమనికి వెళ్ళబోసుకుంటే—కుర్రవాడు బేజారెత్తిపోతాడని తాతయ్యఅభిప్రాయం. తను అనుభవిస్తున్న అనంతదుఃఖాన్ని— తన గుండెలమీది కుంపటిని తన పసికందుకి తెలియకుండా, కనపడకుండా రోజులు గెంటుకొస్తున్నాడు.

కుర్రవాడిని వాడి మేనమామలు పెంచుతామన్నారు—కాని వాడిని మామకొలికదా తాను బ్రతుకుతున్నది. వాడు యెదురుగా వుండటంవల్ల తను దుఃఖాన్ని దిగమ్రింగగలుగుతున్నాడు. తను జీవితం వెళ్లబోస్తున్నాడు. కుర్రవాడు తనదగ్గర లేనివాడు తనకు దుఃఖం నిత్యప్రసన్నంగా వుంటుంది. తన జీవితం వెళ్లదు. తన మనస్సు కుమిలిపోతుంది. తన గుండె మీది కుంపటి ప్రజ్వలిస్తుంది. తన కళ్లు వర్షభ్రమ కలిగిస్తవి. తన గుండె ఆగిపోతుంది.

కాని ఆరోజు వుదయం—ఉప్పెన తగ్గిన మరునాడే—తన యెంటెద్దుబండీమీద—కుర్రవాడిని మేనమామల యింటికి తీసుకువస్తున్నాడు తాతయ్య.

ఉప్పెనగాలివల్ల సముద్రకెరటం తమ ఊళ్లోకి వచ్చింది. అధికంగా పశునష్టమూ, జననష్టమూ కలిగింది. ఎవళ్ల పసువులు యేమైందీ—ఊళ్లో యెవరేమైందీకూడా తెలియకుండా వున్నది. చిన్నచిన్న యిళ్లన్నీ నేలమట్టమయినాయి. ఊరంతా సకలబీభత్సంగా వున్నది. తమ గడ్డివాములన్నీ పోయినాయి. దుక్కిటెద్లు యేమైందీ తెలియదు. పాడిగేదెలు కనబడటం లేదు. భూములు యెంతవరకు 'ఉప్పు' చేసి పోయినవో తెలియదు. ఇవన్నీ పరిమాయకు సేటప్పటికి నెలరోజులు పట్టేటట్లుగా వున్నది. ఈ నెలనాళ్లూ—తను భూముల పనీ—పసకాలలపనీ చూస్తూవుంటే—కుర్రవాడికి పోషణ తగ్గుతుంది. అందుచేత అయిదు మైళ్ల దూరంలో వున్న అతని మేనమామల యింట్లో దింపివద్దామని అవాటి ఉదయం లక్ష్మడుచేత పుటెద్దుబండీ కట్టించుకుని తాతయ్య బయలుదేరాడు.

లక్ష్మడు తాతయ్యగారి పాలెకాపు. ఇరవై యేళ్ల యౌవనంలో వున్నాడు. తాతయ్య అరవయ్యోపడి దాటినవాడు. కుర్రవాడు, యిప్పుడిప్పుడే ప్రాపంచికవిషయాలు ద్యోతకాలు చేసుకుంటూన్న ఆరేళ్ల బాలుడు. ఈ ముగ్గురూ—ఉప్పెనగాలి తగ్గిన మర్నాడే—క్రొత్తప్రపంచంలోనికి బయలుదేరారు. బండి వడిగానే సాగుతూన్నది. నాలుగయిదురోజుల నుంచీ గడ్డిమొఖము యెరుగని దైనప్పటికిన్నీ—జలం మీద వున్న యెద్దుకవళ—బాగానే సాగిస్తూవున్నది.

“అదిగో పడిపోయిన చెట్టు” అన్నాడు కుర్రాడు, అల్లంత దూరంలో మార్కెట్టులో పడివున్న చెట్టు కనుపించగానే. “అదిగో, అచెట్టుకొమ్మక్రింద చచ్చిపోయిన మనిషి” అన్నాడు యింకా కొంచెం సమీపంలోనికి రాగానే.

మార్కెట్టులో మఱ్ఱిచెట్టు తలక్రిందులై వున్నది. దానిక్రింద అనాథలైన బిచ్చగాళ్ల శవాలు వున్నవి. ఉప్పెనగాలి ఆరోజువుదయమే తగ్గింది. జనం గుంపులు గుంపులుగా చెట్టుచుట్టూ మూగివున్నారు.

“అదిగో యింకోమనిషి—యింకోటి—చాలామంది చచ్చిపోయారు”—అన్నాడు బాలుడు, చెట్టు మరీ సమీపంలోకి రాగానే, దానిక్రింద పడివున్న పదీ పదిహేనుశవాలు కనుపించడంతోటే.

“అదిగో—అప్పుడే—ఆ అమ్మి పచ్చగడ్డిమోపు అమ్మకానికి తెచ్చింది. మన యెద్దుకు కావాలి—అటు చూడు!” అన్నాడు తాతయ్య.

“ఆ పచ్చగడ్డి అమ్మికూడా చచ్చిపోయిందా!” అన్నాడు కుర్రాడు.

“లేదు లేదు—చచ్చిపోలేదు. బాగానే సుఖంగానే వున్నది” అని సమాధానం చెప్పాడు తాతయ్య.

“అయితే నేను చచ్చిపోయినప్పుడు కూడా—యిట్లాగా పడివుండి మాస్తారా?” అన్నాడు కుర్రాడు.

“నీవు చనిపోవురా బాబూ!” అని ఆందోళనగా సమాధానం చెప్పాడు తాతయ్య.

“చనిపోతే — తరవాత నన్నేం చేస్తారు?” అన్నాడు కుర్రవాడు.

“అసలు నీవు చనిపోవంటూంటేనూ! మళ్లా అదే ప్రశ్నా?...త్వరగా పోనివ్వరా బండీ...”

“మన దొడ్లో మోటబావిలో పడి పిల్లికూన చచ్చిపోలేదూ? నేనుమాత్రం మోటబావిలోకి దూకితే చచ్చిపోనూ—”

ఒక్కసారిగా — మోటబావి — పిల్లికూనా — మోటబావిలోతూ — కుర్రాడు దానిఒడ్డున నుంచున్నట్లూ — దానిలో దూకినట్లూ — పదిమంది చేరినట్లూ — కుర్రాణ్ణి పైకి తీసినట్లూ — లాభం లేదన్నట్లూ కళ్ళముందు — తాతయ్యకు మెరిసిపోయింది. మనస్సు భ్రమించిపోయింది.

"అవును!" అన్నాడు తాతయ్య దుఃఖపూరితకంఠంగా. బండీ గబగబా నడచింది. మార్కెట్టు దాటి మామూలురోడ్డుమీదకు పోయింది. మృత్యుప్రసన్నత నుంచి, దూరదూరంగా జీవప్రపంచాలవంటి రహదారుల్లోకి పోయింది.

కుర్రవాడి మేనమామల యిల్లు వచ్చింది. వీళ్ళ క్షేమసమాచారాలకోసం ఆందోళనపడుతున్న మేనమామలు అకస్మాత్తుగా వచ్చిన వీళ్లను చూచి ఆనందించారు.

తాతయ్యనుకూడా ఆరోజు అక్కడే ఉండమన్నారు. కాని తాతయ్య పనితొందరలమూలంగా వెంటనే తిరిగిపోతానన్నాడు. మనుమని, 'జాగ్రత్త జాగ్రత్త' అని పదిసార్లు చెప్పాడు.

మేనమామలు కుర్రాడు చాలా తెలివిగలవాడవుతాడనీ — తాతయ్యను చాలా సుఖపెడ్తాడనీ అన్నారు.

తానుకూడా అట్లాగే అనుకుంటున్నాడని తాతయ్య సమాధానం చెప్పాడు.

చదువు బాగా చదువుతాడని మేనమామలు అభిప్రాయపడ్డారు.

ప్రతీదీ పరీక్ష చేసిచూడా లంటాడు యిప్పుడు కొంచెం చెప్పినమాట వింటున్నాడు" అని తాతయ్య అన్నాడు.

"అట్లా అయితే మంచిదే — గొప్ప శాస్త్రజ్ఞుడు కాగలడన్నమాట" అన్నాడొక మేనమామ.

"అట్లాగయితే ప్రతివస్తువునీ — ప్రమాదాలు గుర్తించకుండా పరీక్ష చెయ్యాలంటారా" అన్నాడు ఆందోళనగా తాతయ్య.

"స్వయంగా పరీక్ష చేసి ఆర్జించిన విజ్ఞానం చాలా గొప్పది" అన్నాడా మేనమామ.

అప్పుడే కుర్రాడు మేనమామలగారి మేడమీదికి గెంతుతూ యెక్కబోవడం - కాలు జారి మెట్లమీద పడటం — చూస్తూనేవున్నాడు. తాతయ్య'

ఇహ ప్రొద్దెక్కుతున్నదనీ, యెండలో ప్రయాణం కష్టమనీ త్వరగా బయలుదేరాడు తాతయ్య. తన మనస్సూ — దృష్టీ అంతా మనుమడిమీదనే ఉండిపోయింది. కాని తిరుగుముఖంప్రయాణంలో యెద్దు యింకా తొందరగా నడిచింది. రెండు నిమిషాల్లో మళ్లా మార్కెట్టులోకి వచ్చి చేరింది. ఇంకా జనం అట్లాగే మూగివున్నారు. ముసలాయనమనస్సులో మనుమడు కనబడుతూ నేవున్నాడు. లక్ష్మడు — మళ్లా ఆత్రోవనే బండీ తోలుకువచ్చాడు.

జనం గుంపులుగుంపులుగా మూగివున్నారు. శవాలు అట్లానే పడివున్నాయి. పచ్చగడ్డి అమ్మి — మోపు క్రిందకు దించుకుని — చూస్తూ నుంచునివున్నది. యౌవనారంభంలో వున్న లక్ష్మయ్యమనస్సు — బలిష్ఠమైన అవయవసౌందర్యంతో నిలబడివున్న పచ్చగడ్డి అమ్మిని చూచి కలవరపడింది.

లక్ష్మయ్యయెద్దు క్రిందవున్న పచ్చగడ్డిమోపు మీదకు బండీ లాగుకొన్నది.

ముసలాయనమనస్సులో మనుమడు కనబడుతూనేవున్నాడు. మేనమామలగారి మేడమీదకు యెక్కినట్లుగా — మేడమీదనుంచి క్రిందకు దూకితే యేమవుతుందో తెలుసుకుందామని — దూకినట్లుగా అనిపించింది.

ముసలాయన "హా!" అని ఒక్క కేక వేసి నిశ్చేష్టితుడై బండిలో పడిపోయాడు.

లక్ష్మయ్య — పచ్చగడ్డి అమ్మిని — మోపు యెంతని పలకరించాడు.

ఎద్దు — మోపుమీద కలబడింది.

---

# ఎడారిబ్రతుకు

[కథానిక]

శ్రీ నందివాడ పుతలీబాయి

నా జీవితం తలుచుకొంటే నాకే అసహ్యం వేస్తుంది. ఆలోచించినప్పుడల్లా యిలాంటి జన్మ ఎందుకు ఎత్తానా అని బాధపడ్తాను. అసలు యిలాంటివాళ్లని ఎందుకు పుట్టిస్తాడో దేవుడు! నాలాటిదురదృష్టవంతు డింకొక డీప్రపంచంలో ఉండడేమో! ఉండద్దు కూడాను. పగవాడికైనా వద్దు నాలాటి జన్మ.

మానవుడు ప్రతివాడికీ కొద్దో గొప్పో చీకూ చింతా ఉంటుందికాని నాలాగ అసలు సంతోషించ దగ్గ విషయమే ఉండకుండాపోదు. ఏదో ఒకటి చూసి సంతోషిస్తాడు — గర్విస్తాడు. తాను జీవితంలో ఏదో మహాకార్యం సాధిస్తానునే ధీమాతో — ఆశతో బ్రతుకుతాడు. నా కది లేదు. మనస్సుకో — శాంతి లేదు. దేహారోగ్యమా — అది అసలే లేదు. మరి ఎందుకు బ్రతుకుతున్నానో నాకే అర్థంకాదు.

మాఅమ్మ కాపరానికి వచ్చిన పదిహేనేళ్లకు నేను పుట్టాను. ఈ నాకోసం మా అమ్మ ఎన్ని నోములు నోచిందో, ఎన్ని దేవుళ్లకు మొక్కిందో లెక్క లేదు. వాటన్నిటి ఫలమే నేను. కృష్ణాష్టమినాడు రోహిణీ నక్షత్రయుక్తలగ్నమందు నేను భూమిమీద పడ్డాను. మేనమామను సాగనంపాను. పిడుగులాటి మనిషి — నల్లరాయిలాటివాడు — నడివయస్సులో పోయాడు. అందరూ నాజన్మఫలితం అన్నారు. అందుకే నేను పుట్టానన్న సంతోషం మా అమ్మకు లేదు. సరిగ్గా అదే పాదం అదే నక్షత్రం అయినందుకు మేనమామను సాగనంపగల్గానుకాని ఆ కృష్ణుడికున్న అదృష్టం, సంతోషం నాకు లేదు. నేను పుట్టిన ఏడాదిలోనే క్రొత్తగా కొన్న కపిలగోవు పురుడు పుట్టి చచ్చిపోయింది. కొండా ముకున్న నాళ్ళైనా అది మా యింట్లో ఉండలేదు. నాపుట్టుకతోనే ఆరంభమైంది మాఅమ్మకు జబ్బు. అందుకనే మా అమ్మ నన్ను 'నష్టజాతకంవెధవ' అని తిట్టేది. ఇంటిల్లిపాదికీ — ఒక్క మాబామ్మకుతప్ప, అందరికీ — నామీద అదే అభిప్రాయం. ఎవరేమన్నా ఆవిడ నన్ను వెనకేసుకొచ్చేది.

నేనంటే ప్రాణం ఆవిడకు. నాకు పెట్టకుండా ఎప్పుడూ ఫలహారం చేసేదికాదావిడ. మాతాతపేరు లెండి నాది. నాతోబాటు ఆవిడకూడా బ్రతికివుంటే నా కిన్నిపాట్లుండేవి కావేమో! ఏదేనా పగల గొట్టినా, అల్లరిచేసినా మాఅమ్మ బుగ్గలు గిల్లేది. కొట్టే ఆవిడకు చేతులు నొప్పెట్టాయని ఎప్పుడూ గిల్లేది. లేకపోతే నెత్తి చిల్లుపడేలాగ మొట్టేది పాపం, మా బామ్మ ఎక్కడున్నా యిట్టే వచ్చి మాఅమ్మనదగ్గించి నన్ను పక్కకు లాగి "ఎందుకే అంత ఆక్కసు! పిల్లాడు చేయకపోతే నువ్వూ నేనూ చేస్తామా అల్లరి! అదే అందం. యింకెన్నాళ్లు చేస్తాడు వాడుమాత్రం! పెద్దవాడయిపోతున్నాడుకదా!' అనేది.

మా అమ్మ "వెధవ, నష్టజాతకం వెధవ! వాడు పెద్దవా డవడం ఒకేసారి. తెలుస్తోనే ఉంది ఎంత అదృష్టవంతుడో. మేనమామను పొట్టన పెట్టుకున్నాడు. పుట్టుక కుండెడుపాలిచ్చే ఆవు అయ్యగారు కాలెట్ట గానే పోయింది. కుడిసెధవ" అని తిట్టేది.

ఐదో ఏడు రాగానే అక్షరాభ్యాసం చేశారు నాకు. పలకదగ్గర పట్టుమని పదినిమిషాలైనా కూర్చునే వాణ్ణి కాదు. ఎక్కడికి పోతానో అని మాఅమ్మ నన్ను వంటింట్లో కూర్చోపెట్టి తను పనిచేసుకొంటూ నాచేత అక్షరాలు దిద్దించేది. ఎలాగో తంటాలు పడగా పడగా పుస్తకం చదవడం వచ్చింది నాకు. అప్పుడే నాకు తమ్ముడు పుట్టాడు. ఇదివరకుకన్నా పని ఎక్కువవడం, ఒంట్లో కులాసా లేకపోవడంవల్ల మా అమ్మ నా చదువుసంగతిలో మునుపటంత శ్రద్ధ తీసుకోలేకపోయింది. కాని చదువుకోకుండా పాడై పోతున్నావనీ, చిల్లిగవ్వకేనా చెల్లకుండా తయారవుతా వేమోననీ మాఅమ్మ బెంగపెట్టుకుంది. మాఅమ్మకు నేను జడ్జీనవాలని కోరిక.

మా బాబాయికి పిల్లలంటే ఎంతో సరదా. తన తర్వాత మళ్లీ యింట్లో పసిపిల్లాడు ఇరవై ఏళ్లకు మసిలాడు. మాఅమ్మ కాపరానికి వచ్చినప్పటికి మాబాబాయికి అయిదేళ్లు. మా అమ్మే పెంచింది బాబాయిని. ఎంతో కాలానికి బయల్దేరిన పిల్లాడి నవడంవల్ల, అందులో మొగనలుసునవడంవల్ల మా బాబాయికి నేనంటే ఎంతో ముద్దుగా ఉండేది.

పిల్లలంటే ప్రాణమిస్తాడు కాని పాపం ఆయ నకు పిల్లలు లేరు. బాబాయి నన్ను పంపించమన్నాడు. అక్కడ ఉంటే నాచదువు పాడవదు. ఎందుకంటే మా ఊరు లాగా బాబాయిగారిది పల్లెకాదు. మా అమ్మ యిక్కడ ఉంటే బామ్మగారాబం వల్ల పాడైపోతున్నావనీ, బాబాయిదగ్గరయితే భయ భక్తులతో బుద్ధిగా ఉంటావనీ పంపడానికి ఒప్పు కుంది. నన్ను వదలడం మా అమ్మకు కష్టమైనా మా బాబాయిమాట కాదనలేదు.

మాపిన్నికి నారాక ఎంతమాత్రం యిష్టంలేదు. ఆవిడ తన అన్నగారి కొడుకును పెంచుకోవా లను కుంది. మాబాబాయి ఒప్పుకోలేదు. అసలు ఎవర్ని పెంచుకో నన్నాడు. కాని రోజూ జరుగుతోన్న పోరు పడలేకపోయాడు. ఆవిడమాట వింటేకాని యింట్లో సుఖం ఉండదని గ్రహించి బావమరదికొడు కును పెంచుకోడానికి ఒప్పుకొన్నాడు. ఆమె అన్న గార్ని అడగడానికి పుట్టింటికి బయల్దేరింది. పిల్లాణ్ణి పంపడానికి వదినగారు ఒప్పుకోలేదు. మాపిన్నికి అభి మానం ఎక్కువ. పెంపివ్వననగానే ఆమెకు ఎక్కడ లేని కోపం వచ్చింది. మర్నాడే పుట్టింటినించి వచ్చేసింది.

స్వతహాగా ఆమె చాలా మంచిమనిషి. పుట్టింటి మీద అభిమానం ఉండడం సహజం. తనవాళ్లు ఆస్తి అనుభవిస్తే ఆమెకు తృప్తి. కాని ఆమె అనుకున్నట్టు జరగలేదు. మాబాబాయి నన్నే పెంచుకుంటానని ఆమెను అన్నగారింటికి పంపకుండా ఉంటే నిజంగా నన్ను బతకనిచ్చేది కాదు. కాని భర్త ఒప్పుకున్నాక వదినగారు కాదనడం ఆవిడకు అవమాన మనిపించింది. తనమాట అన్నగారు కాదన డనే ధీమాతో నన్ను పెంచుకోడానికి వీల్లేదని నానాహంగామా చేసి, తీరా వెళ్లి అడిగితే వాళ్లు కాదంటే మరి ఆవిడకు కష్టమని పించదూ! తన భర్త అడగగానే కాదనకుండా ఆయన వదినగారు పంపేసింది. అమాత్రం తనవదినగారు చేయ లేకపోయింది. కననంతమాత్రాన బిడ్డల్ని పెంచడం చాతకాదూ! కావాలని తెచ్చిపెట్టుకున్నాక వాళ్లను కష్టపెట్టుందా! మా పిన్నికి తన పుట్టి ల్లంటేనే అసహ్యం వేసింది. అన్నగారిమీద మనసు విరిగింది.

అప్పట్నించీ నన్ను మాపిన్ని కన్నకొడుకు లాగ చూసింది. వాళ్లింట్లో ఉన్నకాలమే నాజీవి తంలో సుఖంగా గడపిన దినాలు. రోజూ బాబాయి తోపాటు నాకు ఫలహారం, కాఫీ. మాఅమ్మ అయితే ఇంత ఆవకాయ వేసి చద్దన్నం పెట్టేది. మా పిన్ని ఉద్దేశంలో అవన్నీ పల్లెటూరి అలవాట్లు, పల్లెటూరి పద్ధతులు. నన్ను నవీనపద్ధతిలో పట్నవాసపుకొరని చేయాలని మాపిన్నిఉద్దేశం. బాబాయి ఆఫీసుకి

వెళ్తోంటే ఆయనబండిలో నన్ను బడికి పంపించేది. అక్కడ రాజభోగం అనుభవించా ననుకోండి. అలాగ పదేళ్లు గడిచాయి.

నేను బి. ఏ. చదువుతున్నాను. మా ఎదురింటివా రమ్మాయి ఉమ నాక్లాసు. చాలా చురుకైన పిల్ల. బాగా చదివేది. మా బాబాయీ, ఉమతండ్రీ ప్రాణ స్నేహితులు. చిన్నప్పట్నించీ ఒకే చోట ఆడుకుంటూ అన్నదమ్ములకన్నా ఎక్కువగా ఉండేవారు. మాబాబాయితోపాటు నేనూ వాళ్లింటికి వెళ్ళేవాడిని. అప్పుడప్పుడు ఉమతో మాట్లాడడం తటస్థించేది. మాటలు గాఢమైత్రిగా మారింది. ప్రథమంలో మాయిద్దరి మధ్యా ఉన్న స్నేహం చివరికి ప్రేమగా మారింది. ఉమఅమ్మమ్మ ఈసంగతి గ్రహించింది. ఎలాగైనా ముసలివాళ్ళు అవులిస్తే ప్రేగులు లెక్కపెట్టగలరు. ఒకరోజున ఆమె మాయింటికి వచ్చింది. ఉమకూడా వచ్చింది. మాటలసందర్భంలో ఆమె 'ఊరికే చెప్పులరిగేలాగ తిరిగి చివరికి ఏగోతిలోనో దిగకుండా ఉమను బాబు కిద్దామని ఉంది శ్యామలాంబా! ఈడూ జోడూగా ఉంటారు. పిల్లాడు కష్టపెట్టాడేమోనని బాధపడక్కర్లేదు. నువ్వు యోగ్యురాలివి. చిన్నప్పట్నించీ ఎరుగున్నాను. ఆమాత్రం గ్రహించలేనా! నీకళ్లముందర పుట్టి నీయింట్లోనే ఎగిరి గంతులేసిన ఉమను నువ్వసలు కష్టపెట్టవుకదా! అత్తారింటి కెళ్లినా ఎదురుగుమ్మమేకనక పిల్ల కళ్లకు అగుపడ్తూనే ఉంటుంది. అన్నివిధాలా బాగుంటుందమ్మా. ఏమంటావ్? నలుగురం కలిసి ఆలోచించి తథాస్తు అంటేమా-" అంది.

"బావమ్మగా రిలా అన్నారని ఆయ కొల్పో చెప్తా" అంది మాపిన్ని నవ్వుతో.

గదిలో ఉండి ఈమాటలు వింటూన్న నాకు ఏదో అయిన ట్టనిపించింది. అదోవిధమైన సంతోషం వచ్చింది. ఉమ ఎలా ఉందో చూద్దామని పనిఉన్నట్టు యివతలకు వచ్చాను. ఉమ నన్ను చూసింది. ఆమె మొహం సిగ్గుతో ఎర్రబడింది. నాలో విద్యుత్తు ప్రవహించినట్టయింది. ఆలోచించుకుంటూ లోపలికి వచ్చేశాను.

మా పిన్ని చెప్పింది కామాల్సు మా బాబాయి నాన్నకు ఉత్తరం రాశాడు. మర్నాడు నన్నురమ్మని మానాన్న మనిషిచేత కబురంపాడు. నేను వెళ్లాను.

అన్నట్టు చెప్పడం మరిచిపోయాను. నేను పుట్టాక పోయా డని చెప్పానే—ఆ మేనమామకు ఒక కూతు రుంది. మాఅత్తయ్య నా కిచ్చి పెళ్లిచెయ్యాలను కుందిట ఆ అమ్మాయిని. ఇంట్లో అందరూ ఒప్పుకున్నారు. నాకు తెలియబరచడానికి కబురంపాడు మానాన్న. నే నింతకుముం దెప్పుడూ ఆ అమ్మాయిని చూడలేదు. ఇదే మొదటిసారి చూడ్డం. ఆ అమ్మాయి పేరు లక్ష్మి.

లక్ష్మి పుష్టిగా ఉంటుంది. చామనచాయ. తీరైన ముక్కు. పెద్ద కళ్లు. పెద్ద జుట్టు. చదువు లేదు. హార్మోనియం ఏడాదినించి నేర్చుకుంటోంది. మొహంలో అమాయకత్వం ఉట్టిపడుతూ ఉంటుంది.

ఉమతో పరిచయం లేకపోతే లక్ష్మిని చేసుకునేవాడినే. ఉమ లక్ష్మికన్నా బాగుంటుంది. సన్నగా, పచ్చగా బంగారుతీగలాగ ఉంటుంది ఉమ. నా కందమంటే పెద్ద లెక్కలేదు. చదువు లేదని లక్ష్మిని పెళ్లాడకపోవడం లేదు. తెలివి ముఖ్యంగాని చదువెందుకు? లక్ష్మిని పెళ్లాడితే ఉమకు ద్రోహం చేసినవాడి నవుతానని బాధపడ్డాను.

మా యింటికి వచ్చాక యింట్లో అందరూ 'మీఆయనకు మంచినీళ్లు కావాలిట, తేవే లక్ష్మీ' అని లక్ష్మిచేత యిప్పించేవారు నాకు. అందరూ దాని మొగుణ్ణని అంటూంటే నాకు ముళ్లమీద నిల్చున్నట్టుండేది. ఆమె నన్ను భర్తగా భావించి ఎంతో గౌరవించేది. నేను వచ్చేటప్పటికి కూర్చున్నదల్లా గబుక్కున లేచి నిల్చునేది. నేను తిన్నతర్వాత నా కంచంలో తినేది. నాకు ఏంచెయ్యాలో తోచలేదు. లక్ష్మిని చూస్తే జాలేసేది. ఎంత అమాయికహృదయం! ఎంత నిష్కల్మషమైన ప్రేమ! మమ్మల్ని యింటో

అందరూ భార్యాభర్తలక్రింద జమకట్టేశారు. పల్లెటూరివారు పిల్లల్ని అలా తయారుచేస్తారుకాబోలు ఎప్పుడేనా ఒక్కత్తే ఉన్నప్పుడు పనుండి నేను గదిలోకి వస్తే లక్ష్మి సిగ్గుతో తలవంచుకొని లేచి నిలబడేది! నాకు వెర్రెత్తినట్టయింది. యింక చెప్పకపోతే లాభం లేదనుకున్నాను.

ఒక రోజున లక్ష్మి తల దువ్వుకొంటోంది. ఎవరూ లేరు. ఇదే సమయం అనుకొని 'లక్ష్మి, నీతో మాట్లాడాలి. ఇలా రా' అన్నాను.

ఆమె ఖంగారుపడింది. అటూ యిటూ చూసింది ఎవరేనా చూస్తున్నారేమో నని. తర్వాత హడావిడిగా 'ఇప్పుడు కాదు. ఎవరేనా చూస్తే బాగుండదు. భోజనాలయాక తోటలోకి రండి. అక్కడికి ఎవరూ రారు.' అంది. ఆమెమొహం లజ్జతో కందింది.

అనుకున్నప్రకారం యిద్దరం తోటలో కలిశాం. చెప్తా మనుకున్న విషయం ఎలా మొదలెట్టాలో తెలియక తికమకపడ్డాను. ఆఖరుకు ఎలాగో చెప్పాను. లక్ష్మి వెక్కి వెక్కి ఏడుస్తుం దనుకున్నాను. కాని ఏడవలేదు. ఏమైనా అంటుందేమో, ఆమెబాధ ఎలాగ చూడగలననుకున్నాను. కాని అలాటి దేమీ జరగలేదు. ఏదేనా అంటే ఆమెను చేసుకుందా మనుకున్నాను. ఎందుకోగాని ఆమెహృదయం గాయపరచడం నా కెంతమాత్రం యిష్టంలేదు.

లక్ష్మి అంతా విన్నాక మెదలకుండా కూర్చుంది. మొహం పరకాయించి చూశాను. నా కేవిధమైన భావమూ ఆమెమొహంలో గోచరించ లేదు.

'కోపమొచ్చిందా లక్ష్మీ' అన్నాను చేతి గాజులు సర్దుతూ.

'కోప మెందుకు' అని నవ్వింది. చాలా తియ్యగా నవ్వింది. ఆ నవ్వెన్నటికీ మరచిపోలేను. ఆమెను వివాహమాడితే ఎంతో సుఖపడతా ననుకున్నాను. ఆమెను ముద్దెట్టుకోవా లనిపించింది. పెళ్లాడడాని కిష్టపడని నా కిది ఉచితమేనా! మొదట వారించినా, తర్వాత అంగీకరించింది. కాని నేను చేస్తోన్న అన్యాయం—ఈ అన్యాయానికి నే నెంతవరకు బాధ్యుణ్ణి! ఆ అమాయకహృదయం ఎంత బాధపడుతుంది? రాత్రంతా ఈ ఆలోచనలతో గడిపాను.

మర్నాడే యింటిదగ్గిర్నించీ బయల్దేరాను. వచ్చేసేప్పుడు మా నాన్నతో చెప్తా మనుకున్నాను. చెప్దామని ఎంతో ప్రయత్నించాను. కాని నోరు పెగల్లేదు. నేను వట్టి పిరికివాణ్ణని నాకు అప్పుడు తెలిసింది. నేను చెప్పకపోయినా ఈ పెళ్లి జరగదని నాకు తెలుసు. ఎందుకంటే నాకంటె లక్ష్మి ధైర్యం కలది. మనస్థైర్యం కలది. ఆమె తప్పకుండా చెప్పి పెళ్లి మాన్పిస్తుంది.

నేను బయల్దేరేరోజున లక్ష్మికి కొద్దిగా జ్వరం వచ్చింది. ఆరోజున లక్ష్మి అన్నం తినలేదు.

'వెళ్తున్నాను లక్ష్మీ' అని చెప్పాను. ఎవరూ లేకుండా చూసి కాళ్లకు దణ్ణం పెట్టి వెళ్లిపోయింది. ఆమె బాధపడ్తోందని గ్రహించాను. వెళ్లిపోయేటప్పుడు లక్ష్మికళ్లలో నీరు తిరిగింది. నాకు ఏడుపు వచ్చింది. రత్నాన్ని చేజేతులా జారవిడుస్తున్నా ననిపించింది. ఏదో పెద్ద పొరబాటు చేసినవాడిలాగ బాధపడ్డాను.

'లక్ష్మీ' అని పిలిచాను. లక్ష్మి వచ్చింది. 'ఏడుస్తున్నావా'! అన్నాను గాద్గదికస్వరంతో. నా కంఠంలోనే ఆగిపోయింది ఏడుపు. పూడుకుపోయి మాట రాలేదు. ఆమెతల నిమిరాను. 'నే నింక బతకను బావా' అంది ఏడుస్తూ. 'ఛీ ఏం మాటలవి' అన్నాను. లక్ష్మిమొహం చూస్తే ఏదో తీరని అపచారం చేశా ననిపించింది. ఏమైనాసరే లక్ష్మినే పెళ్లాడుదా మనిపించింది. ఉమకు ఈ మాత్రం సంబంధం రాకపోదు. నేను చేసుకోకపోతే లక్ష్మి విచారంలో గుండెపగిలి చచ్చిపోతుం దనుకున్నాను. 'నేను చెప్పిందంతా అబద్ధం లక్ష్మీ' అన్నాను.

'నిజంగానా' అంది లక్ష్మి ఆశ్చర్యంగా-కళ్లు పెద్దవిచేసి.

'నిజమే' అన్నాను నీరసంగా నవ్వుతూ.

'అయితే ఫర్వాలేదు. బ్రతుకుతాను. నామీద ఒట్టేసుకు చెప్పండి. నిజమేనా' అంది.

'ని-జ-మే' అన్నా తడబడుతూ. లక్ష్మి నిట్టూర్చి లోపలికి వెళ్ళిపోయింది.

వారంరోజులతర్వాత వంటనే రమ్మని మానాన్న పాలేరుచేత కబురంపాడు. నేను తక్షణం బయల్దేరాను. పాలేరు దారిలో చెప్పాడు లక్ష్మికి జ్వరం ఎక్కువగా ఉందని. నా మనస్సు మనస్సులాగ లేదు. పరిపరివిధాల ఆలోచిస్తున్నాను.

ఇల్లు చేరగానే సరాసరి లక్ష్మిగదిలోకి వెళ్లాను. లక్ష్మికి స్పృహ లేదు. మా నాన్నను పిలిచి రహస్యంగా అడిగాను 'డాక్టరుగా రేమన్నా' రని.

నాన్న కళ్లు తుడుచుకుని 'దాని పనేం బాగా లేదు. ఎప్పుడూ నిన్ను గురించే పలవరింతలు. దానిలో అన్ని ఊహ లున్నా యనుకోలేదు. ఇవాళ మరీ మీరిపోయాయి పలవరింతలు. డాక్టరు 'మెదడు ఎక్కువ పనిచేసింది. మనశ్శాంతి లేక వచ్చిం' దన్నాడు. నువ్వేమైనా అన్నావా?' అన్నాడు.

'అబ్బే! నేనేం అనలే' దన్నా.

'లక్ష్మి 'చదువుండాలమ్మా. చదువుకున్న వాళ్లకు చదువుకున్న పెళ్లాలుంటే బాగుంటుంది. నా కెందుకు చెప్పించలేదు?' అంటే నువ్వు చదువులో మన్నావేమో ననుకున్నాను' అన్నాడు నాన్న.

'నేనేం అనలేదు నాన్నా'. అని గదిలోకి వెళ్ళిపోయాను. చదువు తక్కువని చేసుకోదలుచుకోలే దనుకుంది లక్ష్మి! అత్తయ్య నన్ను చూసి కంటినీరు తుడుచుకుంది.

'లక్ష్మీ' అని పిలిచాను, అతికష్టంతో కళ్లు విప్పింది. ఆయాసంగా 'వచ్చావా! వస్తా వనుకున్నా.' అంది.

మా అత్తయ్య లోపలికి వెళ్లింది. లక్ష్మికి ఉడుకులాంపట్టీ వేశాను. అరచేయి ముద్దెట్టుకో బోయాను. చెయ్యి లాక్కుని—

'వద్దు. జ్వరంవాళ్లను ముద్దెట్టుకుంటే జ్వరం వస్తుంది' అంది.

'ఫరవాలేదులే' అని చెయ్యి ముద్దెట్టుకున్నాను.

'నీకంటే నీ కెంత అభిమానం' అంది. నాకు ఏడుపు వచ్చింది. కళ్లల్లో నీరు చూసి—

'ఏడుస్తున్నావా! మొగాళ్లు ఏడవొచ్చా. ఛీ! ఊరుకో బావా, నేను బతుకుతాను!' అంది.

ఆరోజల్లా లక్ష్మి తేలికగానే ఉంది. ఎన్నో కబుర్లు చెప్పింది. పరాకుమాట లాడడం లేదు.

'బావా, నువ్వు చెప్పింది నిజమే. కాదని అబద్ధమాడావు, ఔనా' అని అడిగింది.

'కాదు. అబద్ధం చెప్పలేదు. నిజమే చెప్పాను'. అన్నా.

'కాదు. నే నేం అనుకోనులే. అసలు నేను పల్లెటూరి దాన్ని. చదువుకున్న దాన్ని పెళ్లాడితేనే బాగుంటుంది. నా కేం తెలియదు' అంది.

'అక్కర్లేదు. ఇన్ని తెలివితేట లున్నప్పుడు చదువు లేకపోతేనేం! చదువుకున్న వాళ్లకన్నా చాకలి మెరుగట. నిన్నే పెళ్లాడుతాను' అన్నాను. అది నవ్వింది. నేనూ నవ్వాను. ఆరోజంతా దానితో కబుర్లు చెప్పాను.

'బావా, కాసేపు పడుకో' అంది.

'నాకు నిద్ర రావడంలే' దన్నాను.

'నిద్ర పోకపోతే జబ్బు చేస్తుంది. అదీకాక పొద్దున్నే లేవాలి. వెళ్లు, నామాట విను' అంది.

ఆ గదిలోనే యింకో మంచంమీద పడుకుని నిద్రపోయాను, నిద్ర లేచేటప్పటికి లక్ష్మి నిశ్చలంగా పడుకునివుంది. అనిద్రనుండి యింక మెలకువ లేదు.

నా కిది గట్టిదెబ్బ. దాని చావుకు నేనే కారణం. నామనస్సు చాలా సంక్షోభించింది. ఈదెబ్బనుండి ఎప్పటికీ తేరుకోలేను నేను, పుస్తకం ముట్టడం మానేశాను. ఏపని చేస్తోన్నా లక్ష్మి జ్ఞాపకంవచ్చేది. కళ్ల ఎదుట ఉన్నట్లుంది నాకు.

పరీక్షలు దగ్గరికి వచ్చాయి. ఏం చదవలేదు.

ఫేలవుతా ననుకున్నాను. ఫస్టుక్లాసు వచ్చింది. ఫస్టుక్లాసు బి. ఏ. కు ఏం ఉద్యోగం యిస్తారు! చెప్పాను కదూ నష్టజాతకుణ్ణని. యింకా చదువుదామంటే బుర్ర చదువుమీదికి పోదు. మా నాన్నకు సాయంచేద్దామని వచ్చేశాను. పిల్ల నిస్తామని చాలామంది వచ్చారు. ఎనిమిదివే లిస్తా మన్నారు. నాన్నగారు పిల్లని చూడ్డానికి రమ్మన్నారు. కిక్కురుమనకుండా బయల్దేరాను.

ఆ అమ్మాయి ఫస్టుఫారం చదివింది. ఫీచేలు వచ్చును. తెల్లగా పొడుగ్గా సన్నగా ఉంది.

ఇంటికి వచ్చాక మా నాన్న 'ఏమంటావురా' అన్నాడు.

'నేను చేసుకోను.'

'ఏం? బంగారపుబొమ్మలాగున్న ఆ పిల్ల నచ్చలేదా నీకు! యింకా చదువుకున్న పిల్ల కావాలా!'

నేను మాట్లాడకుండా గదిలోకి వెళ్లడానికి రెండడుగులు వేశాను.

'ఒక్క నిమిషం ఆగు. నామాటలు నాలుగూ విని పోదువుగాని. నాకు వాళ్లు ఎనిమిదివే లిస్తున్నారు కనక చేసుకోవాలని లేదు. పిల్ల లక్షణంగా ఉందని చేసుకోమన్నా'

'అది కాదు నాన్నా—'

'నాకు తెలుసు నీ ఉద్దేశం. బాబాయి రాశాడు. కాని నా కాసంబంధం యిష్టంలేదు. మేనరికం ఉంది కదా అనుకుంటే దానికి భూమ్మీద నూకలు లేకపోయాయి. ఈపిల్లను చేసుకో. నామాట విను.'

నేను ఆముదం త్రాగినవాడిలా మొహం పెట్టాను.

'నీకు ఈసంబంధంకన్నా అది యిష్టమని ఎరుగుదును. కాని ఏం చెయ్యను? అది చేసుకోడానికి వీల్లేదు. నీకు చెప్పకుండానే నామాట వింటా వనుకున్నాను. సరే చెప్తా విను.

మా నాన్న కాళహస్తిలో ఉన్నప్పుడు ఒక యిల్లు కొన్నారు. ఆయింట్లో నలుగురు మొగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలు పోయారు. మాఅమ్మకూడా అక్కడే పోయింది. మా నాన్న తర్వాత వివాహ మాడలేదు. మా మేనత్తకూతురు వెనవామె ఒకతె మా యింట్లో ఉండేది.'

ఆమె గర్భవతి అయింది. రహస్యంగా పురుడో సుకుని చచ్చిపోయింది. పిల్లవాడిని వృద్ధిలోకి తెస్తానని నాన్న ఆమె దగ్గర ప్రమాణం చేశాడు. దొరసానితో ఎవరేనా బ్రాహ్మలకి పెంపియ్యమని చెప్పాడు.

కేశవరావుగారు, అంటే ఉమతాతకు పిల్లలు లేరు. ఆయన దొరసానికి తెలిసినవాడు. పిల్లవాడు గౌరవకుటుంబీకుడనీ, బ్రాహ్మణకులజుడనీ చెప్పి పెంచుకోమని సలహా చెప్పింది. కేశవరావుగారు పిల్లడిని పెంచుకున్నారు. కాళహస్తినించీ పిల్లాడితో యిక్కడికి వచ్చేశారు. అతని కూతురే ఉమ. అంటే మీరిద్దరూ అన్నాచెల్లెళ్లవుతారు. మా నాన్న పోయేముందు చెప్పా డీరహస్యం. తెలియక వియ్యమొందుతా వేమోనని చెప్పా డాయన.

నేను కరడుకట్టి స్తబ్ధులాగ ఉండిపోయాను. నాలో మిగిలిన ఆశ ఒకటీ ఆరిపోయింది. ఇంతవరకూ నే ననుకున్నట్టు ఏదీ జరగలేదు. జీవితంలో ఏవిధమైన ఆశ లేకుండా, ఆనందించదగ్గ విషయం లేకుండా అడవిలో చెట్టులా బతికున్నాను. ఈ నా జీవితానికి అంతమనేది ఉంటుందా?

# కృష్ణరాయల కళింగ జైత్రయాత్ర

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

## 3

ఉదయగిరి :—కృష్ణదేవరాయల కళింగజైత్రయాత్ర ఉదయగిరి ముట్టడితో ప్రారంభమైనట్లు మన కింతవఱకు లభించిన సకలసాధనసామగ్రివల్లను తెలియవచ్చుచున్నది. కాని పైముట్టడి ప్రారంభమైన దెప్పుడో కచ్చితముగ నిర్ణయించుటకు వీలులేదు. కృష్ణరాయలు సింహాసన మధిష్ఠించినవెంటనే సాళువ నరసింగరాయల మరణశాసనము గాంచి తనకు ముందు రాజ్యము జేసినవారు శత్రువుల స్వాధీనమందుండు విజయనగరదుర్గములను జయించుటయం దౌదాసీన్యము జూపినందులకు చింతించి, వానిని సాధించుటకు నిశ్చయించి సైన్యముల గూర్చికొని యుదయగిరిపై నెత్తిపోయెనని వ్రాసియున్నాడు. యుద్ధయాత్ర బయలుదేరిన దెన్నడో చెప్పలేదు.' 1 ఉదయగిరిదుర్గమునందు కృష్ణదేవరాయల శాసనములు నాలుగు కలవు. ఇందు శాసనకాలమును సంపూర్ణముగ దెలుపునది యొక్కటియే2. ఇందు 'శకవర్షంబులు ౧౪౩౬ చెల్లంగా మీంద నడచే భావసంవత్సర జ్యేష్ఠ బ ౧ లు...శ్రీ వీరకృష్ణరాయ మహారాయలు వుదయగిరిదుర్గంమీద విడిశి ప్రతాపరుద్రగజపతిని కొంసవీడుపర్యంతం విరుగంబొడిచి వుదయగిరిదుర్గానకు మేణవేయించి దుర్గం పుచ్చుకొని ప్రతాపరుద్రగజపతివారి పిన్నతండ్రి తిరుమలకాంతరాయనిని పట్టుకొని తిరిగి విచ్చేశె' అనియున్నది. కావున శాలివాహనశకాబ్దము ౧౪౩౬ వ సంవత్సరము గతించినపిమ్మట ౧౪౩౭ వ సంవత్సరము నడచుచుండగా భావసంవత్సర జ్యేష్ఠ బ. ౧ లప్పటికి కృష్ణరాయ లుదయగిరిదుర్గమునకు ముట్టడివేసి సాధించి స్వాధీనపఱచుకొనెనని తెలియుచున్నది. అంతకు పూర్వ మెన్నడు రాయల కాదుర్గము వైవశ మాయెనో నిర్ధారించి చెప్పుటకు వీలులేదు ; కాని కోట స్వాధీనమైన క్రొంగ్రొత్తలలోనే విజయప్రకటనార్థమై శాసనముల నెత్తించుట సహజము. ఉదయగిరిదుర్గపుముట్టడి పదునెనిమిదిమాసములపర్యంతము నడచెనని న్యూనిజు వ్రాసియున్నాడు.3 అట్లగుచేని సదరుముట్టడి శకాబ్దము ౧౪౩౪ కు సరియైన అంగీరససంవత్సర మార్గశిరమాసమున, అనగా క్రీ. శ. ౧౫౧౩ వ సం. కడపట ప్రారంభమైయుండవలయును.4

---

1. *Nuniz, Sewell's Forgotten Empire*, *P.* 316.

2. *Nellore district inscriptions* (*ND*1) III, *Udayagiri, Nos.* 37,38,40.41. వీనిలో మొదటి దానియందు (౩౭) శాసనకాలము లేదు ; రెండవ దానియందు (౩౮) శకవర్షమును దెల్పుభాగము మాసిపోయినది. 'భావసంవత్సర' అనిమాత్రము కలదు. తరువాతి యక్షరములుకూడ మాసిపోవుటవలన మాస తిథివారాదులు తెలియవు ; కాని మూడునాలుగు (౪౦,౪౧) శాసనములలో శాసనకాలము సంపూర్ణముగ గలదు. వీనియందు నాలుగవదాని గ్రంథము ముద్రితము గాలేదు. అందువలన, 'This is a mere copy of No 40.' అను శాసనసంపాదకుల వాక్యము (సం. 3. పుట ౧౩౪౭) నాధారపఱచుకొని యందును శాసనకాలము సంపూర్ణముగ నుక్తమై యుండునని మన మూహింపవలసియున్నది.

3. See. Sewell's F. E. P. 316

4. ఇది న్యూనిజు గ్రంథము నాధారపఱచుకొని చేసిన యూహ. దీని యాథార్థ్యమును నిరూపింపగల ప్రత్యక్షప్రమాణము లెవ్వియు నింకను లభ్యము కాలేదు. శకాబ్దము ౧౪౨౬ నకు సరియైన పరాభవ

ఉదయగిరి మిక్కిలియు బలిష్ఠమైన దుర్గము. పేరెన్నిక కెక్కినది. శత్రుజనదుర్గమము; సులభము రాయసామ్రాజ్యమున కంకటికిని మొదటి దుర్గమని సాధింప శక్యము గానిది. ఏకట్టు చూచినను మింటేని

---

సంవత్సరమున వీరవేంకటపతి దేవమహారాయుల యుత్తరవుప్రకారము లిఖింపబడిన 'విజయనగరసామ్రాజ్యము' అను వచ్ఛరణాడితమున కృష్ణదేవరాయలు 'శ్రీముఖ సంవత్సరం చిత్రిమాసం శ్రీరామదశమి గజపతిమీద దండుదొత్తి తరలిపోయి'నట్లు చెప్పియున్నది. (భారతి సం. ౬. పుట ౬౨౧). చిత్రిమాసము కొంచెము మించు మించు చైత్రమాసమునకు సరిపోవును. విజయనగర సామ్రాజ్యమునకు యుక్తమైన కాలము సరియైనదగు జేసి, న్యూనిజుగ్రంథము నాధారముచేసికొని యూహించి ముట్టడిప్రారంభకాలమునకు రమారమి రెండుమూడు నెలలకు ముందే రాయల కళింగదండయాత్ర యారంభమాయె నని యెంచవలసివచ్చును. బ్ర. శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిలవారు స్వరచితతిరుపతిదేవస్థాన నివేదికయందు, కృష్ణదేవరాయలు ఉదయగిరికి పోవుచు మార్గమధ్యమున వేంకటేశ్వరులను సందర్శించుటకు దేవిద్వయసమేతుడై తిరుమలకు విచ్చేసి స్వామివారిని సేవించి కానుక లర్పించి తరలిపోయినట్లు సూచించి యున్నారు. శ్రీశాస్త్రిలవారి యూహను స్థిరపఱచగలిగిన సాక్ష్యము లేకపోయినను అది యసంగతము గాదు. కళింగదండయాత్ర సాగుచుండగా తిరువేంగళప్పనికి మ్రొక్కు చెల్లించుటకు మూడునాలుగుపర్యాయములు కృష్ణరాయలు తిరుమలకు వచ్చినట్లు శాసనసాక్ష్యము గలదు. ఇది యెట్లున్నను కృష్ణరాయలును, నతని దేవేరులును శకాబ్దము ౧౪౩౪ సంవత్సరమునకు సరియైన శ్రీముఖవర్షమున తిరుమలకు వచ్చి వేంకటేశ్వరులను సేవించినది నిశ్చయము. ఈవిషయమచట నా సంవత్సరము ఫాల్గుణశుద్ధపంచమి నాడు వారు వ్రాయించి నిలిపిన శిలాశాసనముల వలన విదితమగుచున్నది (TDI. III nos 32 to 59). ఆ దినముననే కృష్ణరాయలు కాళహస్తీశ్వరుని సందర్శించి యా దేవుని పూజాపురస్కారములు జరుపుటకై చేసిన దానములను వివరించు శాసనములు కొన్ని కాళహస్తీశ్వరుని దేవాలయమున గలవు (ARE 150, 165, and 180 181 of 1924); మఱియు గంటికి పోయి యచట వరదరాజస్వామియాలయమునకు జేసిన దానములను వివరించుచు శకాబ్దము౧౪౩౪కు సరియైన యాంగిరసవర్షమాఘశుద్ధపౌర్ణమానాడొక శాసనము నందు నిలిపెను (ARE 476, of 1919). ఈ శాసనములను బరికించిచూడగా శకాబ్దము ౧౪౩౪ నకు సరియగు శ్రీముఖవర్షాంతమున కృష్ణదేవరాయలు కాళహస్తి తిరుమల కాంచీపురపరిసరప్రదేశముల బర్యటనము సేయుచుండినట్లు కానవచ్చుచున్నది. అచటినుండి యుదయగిరికి పోయెనో లేదో తెలియదు; కాని తరువాత అచిరకాలముననే రాయలు విజయనగరమునకు మరలిపోయినట్లు హంపిశాసనములందు సూచనలు గానవచ్చుచున్నవి (SII. IX ii, 490; SII. IV. 253, 273, 277, 278). ఇవి యన్నియు ౧౪౩౫ శ్రీముఖ చైత్రశుద్ధ౫నాడు వ్రాయించినవి. కృష్ణరాయల 'తండ్రి నరసణనాయకవొడెయరిగారికిని తాయి నాగాజియమ్మ గారికిని పుణ్యముగాను సూర్యగ్రహణపుణ్యకాలమందు' విజయనగరదేవాలయములకు జేసిన దానాదికములు దెలుపుచున్నవి. ఈ శాసనములందు పేర్కొనబడిన సూర్యగ్రహణపుణ్యకాలమున రాయలు విజయనగరమునందుండెనని తలచుట యసమంజసముగాదు. శ్రీముఖ చైత్రమాసాంతమువఱకు రాజధానియందుండెనేమో. వైశాఖమాసమున బయలుదేఱి మరల తిరుమలప్రాంతదేశమునకు వచ్చినట్లున్నది. ఏలనగా, శ. ౧౪౩౫ శ్రీముఖవైశాఖబ౧౩ నాడు తిరువేంగళనాథునకు సమర్పించిన తిరువాభరణములను వర్ణించు శాసనములు నాలుగు తిరుమలయందు గానవచ్చుచున్నవి (TDI. III 60—63). మఱియు శ. ౧౪౩౫ శ్రీముఖ మాఘశుద్ధ౧౧ నాడు తిరువేంగళనాథుని శ్రీభండారమున కొసగిన ధర్మశాసన మొకటి కలదు (TDI. III no 64); ఇదికాక శ. ౧౪౩౫ శ్రీముఖజ్యేష్ఠ శు౭ నాడు శ్రీకాళహస్తీశ్వరుని యాలయమునకు జేసిన దానమును దెల్పు శాసన మొకటి కాళహస్తీశ్వరుని దేవాలయమునం దున్నది (SII. IX. ii. no 492). ఈ శాసనములనుబట్టి చూడగా కృష్ణరాయలు శ. ౧౪౩౪ అంగీరసాంత్యమునను, శ. ౧౪౩౫ శ్రీముఖప్రారంభమునను తిరుపతిప్రాంతభూములకు వచ్చుచుపోవుచుండెనని తెల్లమగుచున్నది. శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిలవా రన్నట్లు ఇవి కేవలము భక్తిపరయాత్రలుగ చేసిన యాత్రలుగావు. కళింగదండయాత్రాసందర్భమున జేసినవే. ఈ యభిప్రాయము మనంగీకార్యముగాదేని, న్యూనిజ్గ్రంథము నాధారము జేసికొని యూహించినట్లు ఉదయగిరిముట్టడి యాంగీరససంవత్సరమార్గశిరమాసముననే ప్రారంభమాయెనని చెప్పవచ్చును.

రాయు కొండలు. అడుగడుగునకును శృంఖలములవలె సంచారనిరోధములైన గండశిలలు. సాఫైన దారి లేదు. ఉండు మార్గమొక్కటియే. అదియును ఇఱుకైన కాలి త్రోవ; మనుజులుగూడ నొకని వెనుక నింకొకడు నడచి పోదగినదే కాని యేకకాలమున పెక్కండ్రు గుమిగూడి పోవ వలనైనది కాదు; ఇక హస్త్యశ్వశకటాదియుద్ధ సాధనములమాట చెప్పవలయునా! ఇట్టి దుర్గమును సాధించుట కష్టము. కాపాడుట సులభము. కృష్ణరాయ లీదుర్గమును ముట్టడించినపు డచట పదివేవురు కాల్బలమును, నాలుగువందల గుఱ్ఱములును గల గొప్ప దళము కాపుండెను; దుర్గాధిపతి ప్రతాపరుద్రగజపతి యొక్క పినతండ్రియగు తిరుమలరాహుత్తరాయడు5. ఇత డారితేరిన శూరుడు. దుర్గసంరక్షణమార్గముల నెఱిగిన నేర్పరి. కావున సుదీర్ఘకాలము ముట్టడి కాగి దుర్గమును శత్రువులకు వశముగానీయక కాపాడగలిగెను.

ఉదయగిరిని స్వాధీనపఱచుకొనుటకు కృష్ణరాయలు తన బలములను గూర్చికొని వచ్చెను. 'ముప్పది నాలుగువేల భటులును, ఎనిమిదివందల యేనుగులను గూర్చికొనివచ్చె' నని న్యూనిజ్ చెప్పుచున్నాడు6. గుఱ్ఱపుదౌజు దోడ్కొనివచ్చినట్లు చెప్పలేదు. రాయవాచక కృష్ణరాయవిజయములందు రాయలవెంట గాయరాణువయంతయు దరలివచ్చినట్లు వ్రాసియున్నది. రాయవాచకముబడి రాయరాణువయందు కైజీతంయేనుగులు౫౦౦, గుఱ్ఱాలు౧౨౦౦౦, సిపాయిదళము౧౦౦,౦౦౦ ను అమరనాయకం యేనుగుఘట్టాలు ౧౨౦ (అనగా ౧౨౦౦), గుఱ్ఱాలు ౨౮౦౦౦, కాల్బలము ౨౦౦,౦౦౦. ఈ మహాసైన్యముతోడను నల్లప్రజతోడను బయలువెడలి ఉమ్మత్తూరురాజ్యమును జయించి కైవసము గావించుకొని, కృష్ణాతీరమున మూడింట్ల తురకరాజులను జయించి గండికోటమార్గమున పయనము సాగించి యుదయగిరిని చేరినట్లున్నది.7 దీనినిబట్టి చూడ, నుమ్మత్తూరుకడను కృష్ణాతటమున తురకలతోడి యుద్ధమునను మడిసిన బలము పోను తక్కిన కర్ణాటక సైన్యమంతయు నుదయగిరిపై నడచెనని మన మూహింపవలసివచ్చును. రాయవాచక సాక్ష్యమును రుజువు పఱచుటకు దగిన సాధనాంతరము లేకపోవుటచే నది యెంతవఱకు సత్యమో నిశ్చయించిచెప్పుటకు వీలులేదు.

ఉదయగిరిముట్టడి సుదీర్ఘమైనదని పైన జెప్పియున్నాను. 'ఒకటిన్నర సంవత్సర పర్యంతము సాగె' నని సమకాలికుడు న్యూనిజ్ చెప్పియున్నాడు8. రాయవాచకములో నివృత్తాంతమువలననది యెంతకాలము నడచెనో చెప్పుటకు వీలులేదు. కృష్ణరాయవిజయమును బట్టి చూడ నిచట కొంతకాలము వఱ కిరుపక్షముల వారును దమ శక్తిసామర్థ్యములనెల్ల వినియోగపఱచి పోరాడినట్లు తెలియుచున్నది. ముట్టడిసందర్భమున నడచిన యుద్ధాంశములు కొన్ని సమకాలికులచేతను, నర్వాచీనులచేతను వర్ణింపబడియున్నవి. సమకాలీనుడగు న్యూనిజ్ వర్ణన మెంట్టమొదట పేర్కొనదగిన దైనను సంగ్రహమును, నసమగ్రమును నగుటచేత విషయము నింతకంటె విపులముగ వివరించు కృష్ణరాయవిజయమున ప్రప్రథమమున బరికించుట యొప్పు.

'అభిమానమునకు గాన
య్యథిరాజజనంబు పోరె నెంతయు బాహా
విభవం బెలర్ప సేనా
రథిసమ్మున నెదిరి కృష్ణరాయలతోడన్.

దుర్గమమగు నాదుర్గము
నర్గళగతి దీయుటకు నహర్నిశము మహో
దోర్గర్వమునన్ నానా
మార్గంబుల బోరిరపుడు మాద్యద్గజులన్'

ఇంతవఱకు వర్ణన సర్వసామాన్యమైనదే. కాని యీముట్టడియందు పోరిన రాయసామంతులను గొంగలిని పేర్కొనుటవలన దీనికి కొంత విశిష్టత గలుగుచున్నది.

"కోటలందుర్గముల్ గొనుచు దోశ్శక్తిబల
ధాటిచే మించు సాళ్వటివాఁ
కంటకాహితకంఠలుంఠనోద్ధతిలీల
దంటలై తగు తోరగంటివారు
నిబ్బరంబుగ శత్రునికరంబు నణగించి
ధీరులై మించు గొబ్బూరివారు

5. కొన్ని శాసనములం దితని పేరు తిరుమలకాంతరాయ డని కలదు. See NDI. III. Udayagiri, 37, 38, 40, 41,

6. Sewell : F. E. p 316.

7. ఆం. సా. పరి. ప. సం 3. పుటలు 33-3౮

8. Sewell : F. E. p. 316.

చాల దోర్బలలీల సమదారిసంఘంబు
దూలించి పోయెఁ నందేలవార
లాదిగాఁగల్గు రాజులు పేరురగతి
తుళువదొరలును బోయలు దురుసుగాఁగ
ప్రతిదినంబును ఘోరమౌ రణమొనర్ప
నిలిచి పోరాడె గజపతిబలము లపుడు.

"శివిగ నాకువారును క
డిందిరహీన్ వెలుగోటివార లా
రావెలవారుగూడుకొని
రాత్రిబగల్ చతురంగసేనతో
నీవగ జూచినన్ దెలియ
నెంతయు శక్యముగాని దుర్గమా
భూవరమౌళి గాంచి"9

ఇందువలన ఆర్వీటివారు, తొరగంటివారు' గొబ్బూరివారు, నందేలవారు, నాకువారు మొదలగు రాజులును, వెలుగోటివారు, రావెలవారు మొదలగు వెలమ, కమ్మనాయకులును తుళువదొరలును బోయలును రాయలపక్షమున నొడ్డెవారితో బోరిరని తెలియవచ్చుచున్నది.

వీరందఱును వాస్తవముగ నుదయగిరిముట్టడియం దిందు చెప్పినట్లు పాల్గొనిరని నిశ్చయించి చెప్పుటకు వీలులేదు; ఏలనగా దీని యాథార్థ్యమును నిరూపింపగల సాధనము వేఱొండు గానరాదు; కాని యది కేవలము విశ్వాసపాత్రము గాదనియు త్రోసిపుచ్చ దగదు. పైజేర్కొన్న కుటుంబములన్నియు రాయసామంతకుటుంబములే. ఆర్వీటివారు విజయనగరసామ్రాజ్యసంస్థాన స్థాపనకాలమునుండియు సుప్రసిద్ధినందిన వారే. నందేలవారును నాకువారును ఆర్వీటివంశశాఖలకు జెందినవారే. ఈ వంశస్థులలో ప్రముఖులు గొందఱు కృష్ణరాయలకాలమున నుండినట్లు శాసనాది చరిత్రాధారములవల్ల దెలియవచ్చుచున్నది. తొరగంటివారును, గొబ్బూరివారును ఆర్వీటివారి బంధువులు. వెలుగోటివారు కృష్ణరాయలసామంతులని యముద్రితములైన కొన్ని రాయలసీమశిలాశాసనములు ఋజువుసేయుచున్నవి. రావెలవారివిషయము మాత్ర మించుక సంశయాస్పదమే. కావున పైజేర్కొనిన సామంతకుటుంబములన్నియు నీముట్టడియందు పాల్గొనుట యసంగతము గాదు. కృష్ణరాయవిజయమందలి పైవృత్తాంతము విశ్వాసపాత్రము గాదని నిరూపింపగల సాక్ష్యము బయల్పడువఱకును మన మది సత్యమని యెంచుట యుక్తము.

విజయనగరసైన్యము లిట్లహోరాత్రములు పోరాడినను ఫలము లేకపోయెను. కోట దుస్సాధ్యమని యందఱకు దెల్లమాయెను. కాని రాయలకు దాని నెట్లైన సాధింపవలయునను పట్టుదల దృఢతరమాయెను. ఆతడు యోధమాత్రుడు గాడు. అప్రతిమానప్రతిభాశాలియైన సేనాని. దళముల కూర్పుటయందును విచ్చుటయందును శత్రుల విభాళించుటయందుమాత్రమే కా దతనికి నేర్పుగల్గినది. సైన్యమునకు అడ్డపెట్టు నాటంకములను - నైసర్గికాత్మకములుగాని మనుజనిర్మితములుగాని యెట్టివికాని - తొలగించి యవి నిరాఘాటముగ నియమితకృత్యము నెఱవేర్చుదగు వానుకూల్యముల గల్గించుటయం దతనికి గల నైపుణ్య మప్పటి సేనాధిపకులయం దెవ్వరియందును గానరాదు. తన ఫౌజులు కోటగోడలను సమీపించుటకు కొండలును బండలునుగ నాయడ్డపడుచున్నవి. వానిని గడచిపోవుట కుపాయము లేదా? అని చింతించి వానిని బగులగొట్ట నిశ్చయించెను. "తన ఫౌజు కోటకొత్తళముల సమీపమునకు బోవుటకు పెక్కు గండశిలల జదియగొట్టించి, కొండలమీద పెక్కుమార్గముల నేర్పఱచెను; మునుపేక కాలమున నొక్కడే ప్రాకిపోవ ననుకూలమైయుండిన ఇఱుకు కొటమును విపులీకరించి విశాలమార్గముగ జేసెను; ఇటువంటి బాటలను మఱికొన్నిటిని నిర్మించి సేనలను కోటగోడల క్రిందికి జేరునట్లొనర్చెను' అని న్యూనిజ్ వాక్రుచ్చినాడు.10 ఇట్లు భగీరథప్రయత్నము గావించి కోటగోడలకడకు గొంపోయినను రాయరాణువ దాని సాధింపజాలకపోయినది. కోటను వశపఱచుకొనుట కందు కాపుండువారికి ధాన్యమును ఆహారపదార్థముల నందనీయక పస్తుల మాడ్చుటవక్క యన్యోపాయము లేదని న్యూనిజ్ చెప్పియున్నాడు. కావున రాయలు కోటకు రాకపోకలను సంపూర్ణముగ నాపివేయుటకు ప్రయత్నములు సేయదొడగెను.

ఈ స్థితియందు ముట్టడికారులకు వెనుకటిపోటు తగిలినది. విజయనగరసైన్యముల విజృంభణము గని గజపతిప్రతాపరుద్రు డూరకుండలేదు. ఉదయగిరిపై

9. కృ. రా. వి. 3: ౫౬-౫౯
10. *Sewell. F.E. PP* 316-17.

గాపుండు తన దళముల యుపాయము వలదు. స్ఫురించెను. కృష్ణరాయల బాహుదోర్బలము యత్యంతావశ్యక మని తెలిసికొనెను. కావున సైన్యసమేతుడై బయలు వెడలి యుదయగిరి చుట్టుముట్టియున్న రాయస్కంధావారముపై నడచెను. తరువాతివృత్తాంతము ఉదయగిరి శాసనములందు సంగ్రహముగ నిట్లు వర్ణింపబడియున్నది.

"ఉదయగిరిదుర్గాదమేలె బిట్టు ప్రతాపరుద్ర గజపతియను కొండవీడుపరియంతరలూ ముఱియలిఱిదు ఉదయగిరియ దుర్గక్కె విడియవనూహాకి దుర్గవనూ తెక్కొండు ప్రతాపరుద్రగజపతియవర చిక్కప్ప తిరుమలకాంతరాయననూ హిడిదుకొండు"

"ఉదయగిరిదుర్గంమీద విడిసి ప్రతాపరుద్ర గజపతిని కొండవీడుపర్యంతం విరుగంబోడిచి వుదయ గిరిదుర్గానకు మేణత (వేణతె) వేయించి దుర్గం పుచ్చుకొని ప్రతాపరుద్రగజపతివారి పిన్నతండ్రి తిరుమలకాంతరాయనిని పట్టుకొని తిరిగి విచ్చేసి"[10-a]

పై శాసనవాక్యములవలన నీక్రింది ముఖ్యాంశములు విదితమగుచున్నవి:—

(౧) తనపై నట్లు వచ్చిన ప్రతాపరుద్రగజపతిని కృష్ణరాయ లెదిర్చి యుద్ధమున పరాజితుని గావించెను; మఱియు నుదయగిరిప్రాంతమున నెచటనైన నతని నిలువనిచ్చిన దన కపాయము కలుగవచ్చు నని శంకించి యతని వెన్నంటి తఱుముచు కొండవీడుపర్యంతము బోయెను.

(౨) అచటినుండి, వెనుదిరిగివచ్చినపిమ్మట ఉదయగిరిదుర్గమునకు మేణత లేక వేణతె వేయించెను.

(౩) దుర్గమును స్వాధీనము చేసికొని దుర్గాధ్యక్షుడగు ప్రతాపరుద్రగజపతిపినతండ్రి తిరుమల కాంత (లేక, రాహుత్త) రాయుని బట్టుకొనెను.

ఈయుద్ధప్రస్తావన మఱి యెచ్చటను గానరాదు. ఎచ్చట నడిచినదియు దెలియదు. ప్రాయశః ఉదయగిరిపరిసరములందే నడచియుండవచ్చును. అంతకంటె మించి యూహింపదగిన విషయములెవ్వియు లేవు. కాని దుర్గమునకు మేణత లేక వేణతె వేయించుట గమనింపదగినయంశము. 'మేణత' 'వేణతె'లు అభాష రూపము. 'వేణతె' అనగ 'వేణై'కు ఆంధ్రరూపము. వేణై యన చుట్టుగోడ యని యర్థము.[11] ఇందువలన కృష్ణదేవరాయలు కోటకు సంపూర్ణముగ రాకపోకల నాపి, కోటలోని ధాన్యమున కాహారపదార్థముల నందనీయక వారి నాకటిపాలుచేసి హింసపెట్టుట కొఱకు కోటచుట్టును గోడ నెత్తించెనని తెల్లమగుచున్నది. కాని యందువలన పద్యఃఫలమేదియు గలిగినట్లు కానరాదు. తుదకు కృష్ణదేవరాయలు లగ్గలుపట్టి నిర్వహించుకొనెను. 'దుర్గ మా భూవరమౌళి గాంచి యొక పూటనె దీసెద నంచు నుగ్రుడై' శపథము చేసెనట.[21] ఈ సందర్భమున స్మరింపదగినది ఒక యైతిహ్యము గలదు. కృష్ణదేవరాయలు దిగ్విజయములో ఉదయగిరిదుర్గము ముట్టడించినప్పుడు అందు తిరుమలకాంత (లేక రాహుత్త) రాయ డనువాడు గజపతికి పినతండ్రి కాపుండి కడుసమర్థుడై ఎన్నాళ్ళకును దుర్గమును లోబడనీయక కాపాడుచుండెను. అంతట నొకనాడు కృష్ణరాయడు 'ఈదినము తిరుమలకాంత (లేక రాహుత్త) రాయని తలద్రొక్కక స్నానము చేయను' అని ప్రతిజ్ఞ చేసి స్వయముగా ముట్టడి నడుపగా తిరుమలకాంత (లేక రాహుత్త) రాయడు భయపడి లోబడి తనతలకు మాఱుగా తన కిరీటమును పంపగా రాజు దానిం ద్రొక్కి మాధ్యాహ్నికము గావించెనని యైతిహ్యము.'[13] ఈ కథ సత్యాత్మకము. కృష్ణదేవరాయలే ఈ విషయమును ప్రస్తావించియున్నాడు. ఆముక్తమాల్యదప్రథమాశ్వాసాంతపద్యమున,

"ఇది కర్ణాటధరాధృతిస్థిరభుజా
హేవాకలబ్ధధరా

---

10-a NDI III, ud. 40,41.

11. తెలుగుస్వతంత్ర. సం. ౨. సంచి. ౧౮. పుట ౧౩.

12. కృ. రా. వి. ౩:౫౯

13 బ్ర. శ్రీ. కళాప్రపూర్ణ వేదం వేంకటరాయ శాస్త్రిగారు:—ఆముక్త. వ్యాఖ్య పుట౯౦. ఇందు శ్రీ. శాస్త్రిగారు సర్వత్ర ప్రహరేశ్వరపాత్రుడని వ్రాసిరి. ఇది పొరబాటు. శాసనములన్నిటియందును ఉదయగిరికడ రాయలచేజిక్కిన ప్రతాపరుద్రగజపతిపినతండ్రి పేరు

దుదయోర్వీధరతిప్రతిష్ఠకృతన
వ్యోత్పాయనోన్మీవర
త్సద్భుగంచత్ప్రదకృష్ణరాయవసుధా
ధ్యక్షోదితాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యముల నా
ద్యంబై మహిం బొల్పగున్."

అని చెప్పియున్నాడు. కావున కృష్ణరాయవిజయమునను, పైనుదాహృతమైన యైతిహ్యమందును వచింపబడిన రాయలప్రతిజ్ఞావృత్తాంతము సత్యమని శంకింపవలసినపనిలేదు. కాని యందుక్తమైనట్లు కృష్ణరాయల ప్రతిజ్ఞ చెవిసోకినంతటనె తిరుమలకాంత(లేకరాహుత్త) రాయడు భయపడి తనతలకుబదులు ఉష్ణీషమును బంపినాడనుట యతిశయోక్తి. విజయనగరదళములు కృష్ణరాయ ప్రేరితములై లగ్గలెక్కెను. కొంతదడవు సంగ్రామము భీకరముగ నడచినది. రాయవాచకమున నిట్లాయుద్ధము వర్ణింపబడియున్నది. "హాంర్కత్తు అనే దుర్గముపై లగ్గయెక్కగా దుర్గములోనివారు తమ చేతనైనట్టు సమరం జేసి మందుగుండు శిలపై నిర్వహించలేక కొలిచినారు." 14 అటుపిమ్మటనే తిరుమలకాంత (లేక రాహుత్త) రాయడు తన యుష్ణీషమును రాయలకడ కంపి శరణువేడియుండవలయును. ఉదయగిరి నిట్లు కయివసము జేసికొని యచట 'కంపన్నను తాణ్యం వుంచి'15 రాయలు వేంకటేశ్వరులను సేవించుటకై తిరుమలకు బోయి యచటినుండి విజయనగరమునకు బోయి చేరెను. సైన్యము గజపతిరాజ్యమును జయించుట కచటు వాసి కొండవీడుదండపాడుపై నడచెను.

"శ్రీకరకటాక్షవిజయ
శ్రీకాంతాకృష్ణరాయసిద్ధకృపాణా
స్వీకృతసత్వరపర
భీకరభటయూధకంపపృథ్వీనాథా"

కావున రాయలచే నుదయగిరితాణ్యమున కధిపతిగ నియుక్తుడైన కంపన యితడు కావచ్చును.

---

తిరుమలకాంత (లేక రాహుత్త) రాయడనియే కలదు. మఱియు ప్రహరేశ్వరపాత్రుడు కాపుండినది యుదయగిరియందు కాదనియు, కొండపల్లెయందనియు 'ఇది పాత్రప్రహరేశ్వరప్రభృతి' యను నాముక్తమాల్యద తృతీయాశ్వాసాంతపద్యమువలన విస్పష్టమగుచున్నది. కావున ప్రహరేశ్వరుని పేరు తొలగించి దానికిబదులు తిరుమలకాంత లేక రాహుత్తరాయని పేరు చేర్చితిని.

14. ఆం. సా. పరి. ప. సం. 3. పుట ౧౩౪.

15. ఈ కంపన్న యెవ్వరో తెలియదు. రాయవాచకమున దప్పమఱియెచ్చటను అతని పేరు గానరాదు. కాని మనుమంచిభట్టప్రణీతమైన అశ్వలక్షణసార మను గ్రంథమున చాళుక్యవంశజుడు మీసరగండ, ఒర్బర సాహిత్యబిరుదాంకితుడు ఔభళరాజకుమారుడు సాళువ కంపరాజొకడు పేర్కొనబడియున్నాడు. తృతీయాంకుర ప్రారంభమున నతడు 'కృష్ణరాయసిద్ధకృపాణు'డని చెప్పియున్నది.





# విమర్శనము



## మన రాజ్యాంగము

సంకలనము: డి. వి. సుబ్బాశాస్త్రిగారు. ప్రచురణ: సమయుగ ఆర్థిక వైజ్ఞానిక కేంద్రము, మద్రాసు 17. పుటలు 72. వెల రూపాయి.

రాష్ట్రశాసన సభ్యులు, ఉత్సాహాధికులు నివర్తి, పెండెకంటి వెంకటసుబ్బయ్యగారలు రాజకీయ ప్రచారము చేయబూని ఈ వైజ్ఞానిక కేంద్రము నుపక్రమించి ఈ పుస్తకమును ముందుగా ప్రచురించినారు. గ్లేజు కాగితములో దళసరిఅట్టతో మంచి ముఖ, ముఖ్యచిత్రములతో ఈ పుస్తకము చూడముచ్చటగా నున్నది. కాంగ్రెస్ కార్యదర్శి కళా వెంకటరావుగారి తొలిపలుకుతో ఈ సంకలనము వెలువడినది.

దేశస్థులందరూ స్వీయరాజ్యాంగమునుగూర్చి తెలిసికొని మసలుట దేశమునకు క్షేమహేతువు. విద్యార్థులకు, ప్రాప్తవ్యవహారులకు రాజ్యాంగము అవశ్యము పాఠ్యము. తెలుగులో రాజ్యాంగమును గూర్చిన సాహిత్యము వెలువడుచుండుట ముదావహము. ఇటీవల వెలువడిన రచనలలో డి. వి. సుబ్బాశాస్త్రిగారి సంకలనము ఎన్నదగినది. సంగ్రహముగ వీరు రాజ్యాంగమందలి ముఖ్యాంశములను క్రోడీకరించి ఉటంకించియున్నారు. ఇందువలన రాజ్యాంగము సాంగోపాంగముగ తెలియకపోయినను లీలగా తెలియగలదు. సమగ్రరచన పెద్దగ్రంథమగును. సూక్ష్మములో రూపాయ వెలకు ఈ సంకలనమువలన అవసరము కొంతవరకు తీరుచున్నది. రాజకీయప్రచారకులకు విద్యార్థులకు ఇది తప్పక ఉపయోగించగలదు.

ఆ. దా.

---

## గ్రంథ స్వీకారము

### తారాతోరణము

రచయిత: నండూరి రామకృష్ణమాచార్య గారు. ప్రచురణ: విజ్ఞానప్రభాస, భీమవరము. వెల రూ. ౧-౮-౦.

### భగవాన్ శ్రీరామతీర్థ

రచయిత: శ్రీ కేశవతీర్థస్వామి. ప్రకాశకులు: శ్రీరామతీర్థసేవాశ్రమము, పిడుగురాళ్ల, గుంటూరుజిల్లా. వెల రూ. ౧-౧౨-౦

### శ్రీరామ తీర్థస్వామిజీవితము

రచయిత: బులుసువెంకటేశ్వర్లుగారు. బి. ఏ. పి. ఆర్. కాలేజి, కాకినాడ. వెల రూ. ౨-౦-౦

### అశ్రుమాల

రచయిత: నారపరెడ్డిగారు. ప్రకాశకులు: కవికోకిలపబ్లికేషన్సు, నెల్లూరు. వెల రూ. ౧-౦-౦

### అశ్రుధారలు

రచయిత: బూదరాజు రాధాకృష్ణగారు. ప్రాప్తి

స్థానము: పంతులూరి వెంకటసుబ్బారావుగారు, కోట పాలెం. వెల రూ. ౧-౦-౦

## అలమేలుమంగాపరిణయము

తుము రామచంద్రావనీపాలప్రణీతము. ప్రకాశకులు: తూము రామకృష్ణారెడ్డి దేశముఖుగారు. మానాజీ పేట, మహబూబునగరు జిల్లా. వెల రూ. ౧-౦-౦

## అశోక ధర్మచక్రము

నాటకము: రచయిత: రాయసం రాధాకృష్ణ మూర్తిగారు. ప్రాప్తిస్థానము: ఆదర్శసాహిత్యనిలయము, ౯వ లైను, అరండేలుపేట, గుంటూరు. వెల రూ. ౧-౮-౦

## దీక్షితదుహిత

రచయిత: శివశంకరశాస్త్రిగారు. ప్రకాశకులు: సాహితీసమితి, గుంటూరు. వెల రూ. ౧-౮-౦

## వెన్నెల వెలుగులు

రచయిత: వాశము కృష్ణరావుగారు, రాజమహేంద్రవరము. వెల రూ. ౧-౦-౦

## నేతాజీ సజీవి

రచయిత : యన్. విజయరాజకుమార్ గారు, చేబ్రోలు. వెల రూ. ౧-౪-౦

## ఆవేదన

రచయిత: వి. గోపాలరావుగారు, లగడపాడు, పెదకూరపాడు పోస్టు, గుంటూరుజిల్లా. వెల పావలా.

## నేటిప్రపంచము

రచయిత: దుర్గి నాగాచార్యులుగారు. తెలుగు పండితులు, ఏ. బి. యం. హైస్కూలు, ఒంగోలు. వెల రూ. ౧-౦-౦

## సందేశం

సాంఘిక నాటకము. రచయిత: బి. వి. యస్. పాత్రుడుగారు.

## నిరుద్యోగి

నాటిక. రచయిత: బి. వి. యస్. పాత్రుడుగారు.

హైస్కూలు ప్రకాశకులు: స్వర్ణలతాపబ్లికేషన్సు, కాకినాడ.

## క్షీరార్ణవము

ఖండకావ్యము. కవి: పాలెపు వెంకటరత్నముగారు. ప్రకాశకులు: స్వర్ణలత పబ్లికేషన్సు, కాకినాడ.

## మిస్ తార

రచయిత: యం. నరసింహగారు. ప్రకాశకులు: మిస్ తారాపబ్లిషింగుహౌసు, ౧౧౩౦ కవాడిగుడా, సికిందరాబాదు. వెల అ. ౯.

## మోటుపల్లి

రచయిత: బూసం వల్లభ్యకవిగారు, జాండ్రపేట, వయా చీరాల. వెల అ. ౪.

## స్వతంత్రగీతాలు

రచయిత: పోలూరి ఆంజనేయప్రసాదుగారు. బోర్డుహైస్కూలు, కొరంపూడి, గుంటూరుజిల్లా వెల అ. ౮.

## సమీచీనసంఘవ్యవస్థ

రచయిత: ఆచార్యులు. ప్రకాశకులు: గురుకులము, కుంచేరు, కృష్ణాజిల్లా. వెల అ. ౫.

---

Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras. Editor : S. Sambhu Prasad.